విజయవంతంగా ప్రదర్శింపబడుచున్న అత్యుత్తమ చిత్రం...





దర్శకత్వం
సి.పుల్లయ్య

సోమశేఖర్. రాధాకృష్ణ

సముద్రాల (జూ)

T.V.రాజు

శేఖర ఫిలిమ్స్

# భామా విజయం

అను గొల్లభామ కథ

## కమల్, రీగల్
హైదరాబాద్

★

## నటరాజ్
సికింద్రాబాద్

—దివ్యదత్త రిలీజ్

PIONEER

## ఈ సంచికలో


రవీంద్రనాథ టాగూర్ ★ చతురంగం 17
(సంక్షిప్తనవల)

ఓగేటి ఇందిరాదేవి ★ పాపం వంచిత 48

ముప్పాళ
రంగనాయకమ్మ ★ ఇదే న్యాయం 70
(పెద్దకథ)

వై. రాంబాబు & శాయి ★ షామియానా 86

కొడవటిగంటి
కుటుంబరావు ★ చురుకైన అబ్బాయి 103

యం.యస్. మూర్తి ★ ఆత్మహత్య మహాపాతకం
కాదు, కాని... 108

'ఊర్వశి' ★ వెన్నెల విరిగి పడింది 113

వనపూల్ ★ సనాతనపురం వాసులు 123

కొమ్మూరి
వేణుగోపాలరావు ★ వ్యక్తిత్వం లేని మనిషి 129
(సీరియల్)


ముఖచిత్రం: "భిక్షాం దేహి"

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

---

చందాదారులకు ప్రత్యేక అవకాశం

వివరములు 8వ పేజీ చూడండి

చిన్న దెబ్బ కూడా పుండు కాగలదు. బర్నాల్ తక్షణం ఉపయోగించండి.

మండనటువంటి
బర్నాల్
మూలంగా గాయం
త్వరగా మానుతుంది.



# నేడే బర్నాల్ కొనండి—ఎప్పుడైనా అవసరం కలగొచ్చు!






బర్నాల్ మూలంగా గాయం ఈ విధంగా మానుతుంది:
సాధారణ మలాం యొక్క రోగ నాశకతత్వం దాని జిగురు పదార్థంలో వుండుటమూలంగా గాయం మీద దాని ప్రభావం వెంటనే పడదు. గాయానికి చీము పడితే అది మానడానికి చాలా సేపు పడుతుంది.
కానీ బర్నాల్ యొక్క రోగ నాశకతత్వం పైనే వుండుట మూలంగా, గాయం మీద వెంటనే ప్రభావం పడుతుంది-గాయం త్వరగా మానుతుంది. మండనటువంటి బర్నాల్ పిల్లలకు కూడా రాయవచ్చు.

25గ్రా.,రూ.1.50
10గ్రా.రూ 0.90
పన్నులు అదనం

**కోతలు, కాల్పులు, పుండ్లు, గాయాలు, దెబ్బలకు బర్నాల్ రాయండి.**

**బర్నాల్**— బూట్స్ యొక్క రోగ నాశక పసుపు క్రీం

Shilpi B 1/67 Tel.




జూలై సంచిక బాగుంది శ్రీ పద్మావి పాపయ్యగారి వర్ణచిత్రాలు వర్ణనాతీతముగా వున్నవి. శ్రీ ముప్పాళ రంగనాయకమ్మగారి ఇదే నా న్యాయం" మధ్యలోనే ఆపినందుకు చాలా విచారిస్తున్నాను 'యువ'ను అన్ని పత్రికలకంటె ముందుగా అందిస్తున్నందులకు చాలా ఆనందిస్తున్నాను. మధ్య మధ్య వర్ణచిత్రాలు అందిస్తారని కోర్తాను

లక్ష్మణశ్రీ. సూర్యాపేట

జూలై నెల యువ చాలా బావుంది. అందులో "గులాబీరేకులు" కథ చాలా చాలా బావుంది. చంద్రికగారి చిత్రాలు కథకి శోభను చేకూర్చాయి.

"చక్రవాకం" సీరియల్ ముగింపు ఆశించినంత గొప్పగా లేదు కథకు వేసిన బొమ్మనుబట్టి ముగింపు ట్రాజెడీ యని తెలిసినా, అన్ని కష్టాలను అనుభవించాక దేవరాణినీ, కిరణ్‌నూ కలిపితేనే బావుండేది.

ముప్పాళ రంగనాయకమ్మగారి "ఇధే నా న్యాయం?" నాకు బాగా నచ్చింది. చివరకు శంకరానికీ శ్యామలకూ పెళ్ళవుతుందని మేం ఆశిస్తుంటే, శ్యామలను ఇం కెవరికో ఇచ్చి చేసే

క్కారు. ఇదేనా న్యాయం?

దయచేసి ఇక ముందుకూడా ఇలాగే యువని వడ్డాదిపాపయ్యగారి చిత్రాలతోనూ, కథలూ, సీరియల్స్‌తోనూ ముస్తాబు చేసి మా కందిస్తారని ఆశిస్తున్నాను.

కుమారి సంధ్యాసుందరి,
సీలేరు ప్రాజెక్టు

జూలై నెల యువ సర్వాంగసుందరంగా వుంది "చక్రవాకము" పాఠకుల హృదయాలను ఆకట్టుకొందంటే అతిశయోక్తి లేదు. రచయిత్రిగార్కి నా ధన్యవాదములు. "రంగడి అంతరంగము" చాల బావుంది, వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించాయి మా మంచి "యువ'ను ప్రచురించే మీకు మా ధన్యవాదములు.

పెల్లకూరి మునిస్వామి,
తాడిపత్రి

జూలై నెల "యువ"లో ప్రచురితమైన హరిప్రసూన కాపాలక్ష్మిగారి "గులాబీ రేకులు"; శారదాదేవిగారి ''జారిన క్షణం'' కథలు నిజంగా ఎంతో సహజంగా వున్నాయి. నాకు చాలా నచ్చాయి. రచయితలకూ, మీకూ నా ధన్యవాదాలు.

డా॥ ఎం. నాగరాజరావు,
కర్నూల్

# రాబోవు దసరా పండగ సందర్భంగా
# క్రొత్త చందాదారులకు
# ప్రత్యేక అవకాశం

*1967 సెప్టెంబరు నెల 30వ తేదీలోగా రు. 16-00 లు పంపిన కొత్త చందాదారులకు యువ దీపావళి ప్రత్యేక సంచిక రు. 4-00 లకే రిజిష్టర్డ్ పోష్టుద్వారా పంపబడును. నేడే మీ చందా పైకాన్ని పంపండి. ఒక్క దీపావళి సంచికే కావలసిన రు. 5-00 లు పంపండి.*

యువ సాలుచందా దీపావళి సంచికతో రు. 16/-

రెండు సంవత్సరముల చందా రు. 30/-

## యువ ఆఫీసు

పోస్టుబాక్సు నెం. 216; పబ్లిక్ గార్డెన్ రోడ్,

హైదరాబాద్-1

GRAND GALA RELEASE IN AUGUST

Mukhesh Movies Presents:

ULTRASCOPE - EASTMAN COLOR PICTURE

***Directed by FRANK KRAMER***

# KISS KISS KILL KILL

Starring: TONNY KENDALL,
MARIA PERSCHY, BRAD HARRIS

***Simultaneously at***

## NAVRANG ★ ASHA
(HYDERABAD)

&

## AJANTA
(SECUNDERABAD)

— B Marideswara Rao & Co Release

యువ
సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు · చక్రపాణి

సంపుటి 16 ఆగస్టు, 1967 సంచిక 2

అయిదవ ఉక్కు ఫాక్టరీ నిర్మాణం విషయమై తగాదాలు, ఆందోళనలు మళ్ళీ విజృంభిస్తున్నాయి. రాష్ట్రాలమధ్య తగాదాలూ, విభేదాలూ ఏర్పడకుండా నిక్కచ్చిగా ఒక నిర్ణయాన్ని చెయ్యవలసిన కేంద్ర ప్రభుత్వం, అసలువిషయాన్ని అటూ యిటూ తేల్చకుండా ఊగిసలాడుతూవుంటే, కాస్తగట్టిగా నోరు పెట్టుకొని ఆందోళన చెయ్యగల రాష్ట్రాలు, తమ కోరికను నెరవేర్చుకొనడానికి ఆందోళనను ప్రారంభిస్తున్నాయి. ఇలాంటి పరిస్థితిని ఏర్పడనిస్తున్నది కేంద్రప్రభుత్వం.

భారతదేశంలో ప్రస్తుతం ఆరు పెద్ద ఉక్కు ఫాక్టరీలు ఉన్నాయి. వాటిలో మూడు ప్రైవేటురంగంలో ఉన్నాయి. అవి, టాటాకంపెనీ, ఇండియన్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ, మైసూర్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ. తక్కిన మూడుఫాక్టరీలు గవర్నమెంటు యాజమాన్యంలో ఉన్నాయి. అవి, భిలాయ్, దుర్గాపూర్, రూర్కెలా.

ఈ ఆరు ఫాక్టరీలలోను ఏడాదికి 64 లక్షల టన్నుల ఉక్కు సామగ్రి ఉత్పత్తి అవుతున్నది. దీనిలో 31 లక్షల టన్నులు గవర్నమెంటు యాజమాన్యాన ఉన్న ఫాక్టరీలలో ఉత్పత్తి అవుతున్నది.

గవర్న్మెంటు యాజమాన్యాన స్థాపింపబడిన మూడు ఉక్కు ఫ్యాక్టరీలకొరకు ఇప్పటివరకు పెట్టుబడి 900 వందల కోట్ల రూపాయలు. ఇదికాక, బొకారోవద్ద మరొక ఉక్కుఫాక్టరీని రష్యన్ సాంకేతిక సహాయంతో స్థాపించడానికి ప్రయత్నం ఆరంభమైంది. ఈ ఫాక్టరీ నిర్మాణానికి మొత్తం 620 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. అంటే, మూడు ఫాక్టరీలు నిర్మించడానికి అయినదానిలో మూడింట రెండువంతులు ఇప్పుడు ఒక ఫాక్టరీకి అవుతుందని అంచనా. ఈ నాలుగూకాక, మరొక ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈనిర్ణయం ఎప్పుడో అయిదారేళ్ళనాడు జరిగింది. నాలుగు ఫాక్టరీలు ఉత్తరదేశంలో ఉన్నాయి గనుక అయిదవ దానినైనా దక్షిణదేశంలో స్థాపించవలసిందని, దక్షిణాన ఉన్న నాలుగు రాష్ట్రాలవారూ కోరారు. ఈ ఫాక్టరీ నిర్మాణానికి కూడా దాదాపు నాలుగైదువందలకోట్లరూపాయలు వ్యయ మౌతుంది.

దక్షిణ దేశంలో, మదరాసు, మైసూరు రాష్ట్రాలు పారిశ్రామికంగా బాగా అభివృద్ధికి వచ్చాయి కనుకనూ, కేంద్ర ప్రభుత్వపు యాజమాన్యంలో స్థాపించబడిన అనేక పరిశ్రమలు యీ రెండు రాష్ట్రాలలోనే వున్నాయి కనుకనూ, అధమం అయిదవ ఉక్కు ఫాక్టరీని అయినా ఆంధ్ర రాష్ట్రంలోస్థాపించవలసిందని ఆంధ్రప్రజలు అడగడం ఆరంభించేటప్పటికి, యీ ఫాక్టరీని తమ రాష్ట్రంలో స్థాపించుకుందామనేఆశ మదరాసు ప్రభుత్వానికి కలిగింది. కేంద్ర ప్రభుత్వంతో సంప్రతించకుండానే, విదేశ నిపుణులతో సంప్రతించి సేలంలో ఉక్కు ఫాక్టరీ నిర్మాణానికి ప్లాను తయారు చేయించి, సేలంలోనే అయిదవ ఉక్కుఫాక్టరీని పెట్టాలని మదరాసు ప్రభుత్వం ఆందోళన చేస్తున్నది.

కేంద్ర ప్రభుత్వం నియమించిన ఆంగ్లో — అమెరికన్ నిపుణుల సంఘం, యీవిషయాన్ని విపులంగా పరిశీలించి అయిదవ ఉక్కుఫాక్టరీని విశాఖపట్టణంలోనే స్థాపించడం మంచిదని సలహాయిచ్చింది. కాని, యీ

సలహాను కేంద్ర ప్రభుత్వం గౌరవించడమూ లేదు; మదరాసు ప్రభుత్వం ఖాతరు చెయ్యడమూ లేదు. కేంద్ర ప్రభుత్వం నిష్పక్షపాత బుద్ధితో వ్యవహరించిన ట్లయితేనూ, కేంద్ర ప్రభుత్వం అంటే రాష్ట్రాలకు గౌరవం ఉంటేనూ, పరిస్థితులు ఇలా వుండవు. 1947 లో స్వరాజ్యం వచ్చినప్పటినుంచీ, కేంద్ర ప్రభుత్వం మదరాసు రాష్ట్రంపట్ల పక్షపాత బుద్ధిని చూపుతూనే వచ్చింది. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడి ఇప్పటికి 14 సంవత్సరాలు అయినా, ఆంధ్రుల కోరికను కేంద్ర ప్రభుత్వం మన్నించిన సందర్భంగాని, ఆంధ్ర రాష్ట్రాభివృద్ధికి అవసరమైన పథకాలను రాష్ట్రంలో అమలుజరిపిన సందర్భంగాని ఒక్కటీలేదు.

ఉక్కు ఫ్యాక్టరీ విషయంలో ఆంధ్రుల కోరిక న్యాయమైనది. విదేశీ నిపుణుల నిర్ణయం ఆంధ్రులకు అనుకూలంగా వున్నది. అయినా, నిర్ణయాన్ని కేంద్రం అమలు జరపడంలేదు, పైగా, ఆనిర్ణయానికి విరుద్ధంగా మదరాసు ప్రభుత్వం ఆందోళన చేస్తున్నది. ఈ ఆందోళనకు కేంద్ర ప్రభుత్వం లొంగిపోవలసిందేనా ?

ప్రస్తుతం దేశంలో ఉన్న ఉక్కు-ఫ్యాక్టరీలలో ఉత్పత్తి అవుతున్న ఉక్కు అంతా పూర్తిగా వినియోగింపబడడంలేదు. అంతేకాదు; ప్రస్తుతం ఉన్న ఉక్కు-ఫ్యాక్టరీలు తాము ఉత్పత్తి చేయగలిగినంత ఉక్కును ఉత్పత్తి చేయడంలేదుకూడాను. అలా కాకుండా, ప్రస్తుతం ఉన్న ఉక్కు-ఫ్యాక్టరీలు తమ ఉత్పత్తిశక్తిని పూర్తిగా వినియోగించి, ఉక్కును ఉత్పత్తిచేస్తే, అలా ఉత్పత్తిఅయిన ఉక్కు అంతా వినియోగింపబడకపోగా ఎంతో ఉత్పత్తి వృథా అవడంకూడా జరుగుతుంది. ఈ విషయాన్ని సావధానంగా ఆలోచిస్తే, బొకారోలో ఉక్కు-ఫ్యాక్టరీని నిర్మించడమే అనవసరం అవుతుంది. ఆరువందలకోట్ల రూపాయ

లను వృధాగా వెచ్చించడంకంటే, ఆ డబ్బును ప్రయోజనకరమైన ఇతర కార్యక్రమాలకు వినియోగించవచ్చును. ఇలాటి నిర్ణయం కేంద్రప్రభుత్వం చేసినట్లయితే, ఆంధ్రులకు తీవ్రమైన ఆశాభంగం కలుగుతుంది; కాని, నిష్ప్రయోజనమైన కార్యక్రమాలకు డబ్బును ఖర్చుపెట్టమని ఆంధ్రులు కోరరు. అయితే, ఏ నిర్ణయం జరిగినా, కేంద్రప్రభుత్వం నిపుణుల సలహాలను తీసుకొని నిష్పక్షపాతబుద్ధితో వ్యవహరించాలి.

ప్రస్తుతం మనకు కావలసినది ఆహారం. 1966 సంవత్సరంలో 500 కోట్ల రూపాయల విలువగల ఆహారధాన్యాలను దిగుమతి చేసుకున్నాము. 1947 నుంచీ ఇప్పటివరకూ మనం ఆహారధాన్యాల దిగుమతి కోసం సుమారు 5000 కోట్ల రూపాయలను విదేశాలకు అర్పించాము. అయినా, వ్యవసాయోత్పత్తికి తగిన భారీ పథకాలను అమలుజరుపుకోలేక పోయాము. పదకొండు సంవత్సరాలనాడు ప్రారంభమైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు, యిప్పటికి మూడింట రెండువంతులుకూడా పూర్తి కాలేదు. ఈ ప్రాజెక్టుకు ఏడాదికి ముప్ఫయికోట్ల రూపాయలను కేంద్రప్రభుత్వం ఇచ్చినట్లయితే, నాలుగేళ్ళనాడే యీ ప్రాజెక్టు పూర్తిఅయి, విదేశాలనుంచి వందలకోట్ల రూపాయల వ్యయంతో ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసిన దౌర్భాగ్యస్థితి మనకు ఇంకా వుండేదికాదు. నాగార్జునసాగర్ నిర్మాణానికి సహాయం చెయ్యాకపోవడంలో కేంద్రప్రభుత్వం ఆంధ్రులకు పచ్చిఅన్యాయాన్ని చేస్తున్నది. అంతేకాదు; దేశంలో ఎన్నో అభివృద్ధికార్యక్రమాలకు వినియోగించడానికి వీలైన డబ్బును విదేశాలకు పోస్తున్నది.

నాగార్జునసాగర్‌కు కేంద్రప్రభుత్వసహాయం లభించకపోవడానికి ముఖ్య కారణం, ఈర్ష్య. ఈ ప్రాజెక్టు పూర్తిఅయిననాడు, ఆంధ్రదేశపు

బియ్యం, యావద్భారతదేశపు ఆకలిని తీరుస్తుంది. ఆంధ్రరైతులు బాగు పడతారు. వ్యవసాయంవల్ల ఆదాయం పెరిగినట్లయితే, రాష్ట్రంలో అనేక పరిశ్రమలు తలఎత్తుతవి. దానివల్ల ఆంధ్రదేశం బాగుపడుతుంది. అలా జరగడం, కేంద్రప్రభుత్వ ఆర్థికమంత్రులుగా వున్న పొరుగు రాష్ట్రాల వ్యక్తులకు రుచించలేదు. అంచేత, నాగార్జునసాగర్ నిర్మాణానికి ఎన్నివిధాల ఆటంకాలు కల్పించాలో అన్నివిధాలా కృషి చేస్తూనేవున్నారు.

అయిదవ ఉక్కు-ఫ్యాక్టరీ అంటూ ఒకటి స్థాపింపబడేటట్లయితే, అది ఆంధ్రదేశంలో స్థాపింపబడవలసిందే. కాని, దానికన్నముందు కావలసినది, నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి కావడం. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి కావలసిన పూర్తి డబ్బును వెంటనే యిమ్మని కేంద్రప్రభుత్వాన్ని మనం ఒత్తిడి చెయ్యాలి. నాగార్జునసాగర్ నిర్మాణం పూర్తి అయినదాకా, ఉక్కు-ఫాక్టరీని దేశంలో ఎక్కడా స్థాపించ నవసరంలేదనీ, ఆ తరువాత విదేశీనిపుణుల సలహా ప్రకారం విశాఖపట్టణంలోనే స్థాపించాలనీ మనం పట్టుబట్టాలి. కేంద్రప్రభుత్వ ఆర్థిక పరిస్థితి బాగా ఉన్నట్లయితే, నాగార్జునసాగర్‌కు డబ్బూ, ఉక్కు-ఫాక్టరీ నిర్మాణానికి డబ్బూ కేంద్రప్రభుత్వం ఇప్పుడే యివ్వవచ్చును. ఆర్థిక పరిస్థితి బాగు లేదనే కారణం గనుక కేంద్ర ప్రభుత్వం చెప్పినట్లయితే, అది నిజమే అయినట్లయితే, నాగార్జునసాగర్ నిర్మాణానికి మాత్రం ముందు డబ్బు యివ్వవలసిందే. అలాంటి పరిస్థితిలో, మరెక్కడా ఉక్కు-ఫాక్టరీని స్థాపించకూడదు.

# చిత్రవార్తలు



హైద్రాబాద్‌లో ది 3-7-67 న మన ముఖ్యమంత్రి. కొండజాతి సర్పంచుల సదవకాశములకై ఏర్పాటైన 8 రోజుల సాంస్కృతిక పరిశోధనా కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.



సమాచార శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ నల్గొండజిల్లా బొమ్మల రామవరంలో ది 2-7-67 న గాంధీవిగ్రహాన్ని ఆవిష్కరించారు.



మధూపిక్చర్స్‌వారి నూతన చిత్రానికి సారధీస్టూడియోస్‌లో సమాచార శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రారంభోత్సవం జరిపారు. ప్రక్కన వున్నవారు డైరెక్టర్ శ్రీ వి. మధుసూదనరావు

---

ఈ సందర్భంలో మధూపిక్చర్స్ ప్రొడ్యూసర్, శ్రీ చక్రపాణిని ఆహ్వానించారు. ఆ ప్రక్కవారు శ్రీ సారధీస్టూడియోస్ అధిపతి శ్రీ కె. శ్రీనివాసరావు .




ఆయనకి ఈ ఊళ్ళో శత్రువులెవరైనా ఉన్నారా?
ఇన్కం టేక్స్ ఆఫీసర్
సత్యమూర్తి


మెట్లున్నవి.
మెట్లు వున్నవి జాగ్రత్త
Satyam




నేను మా గ్రామం నుంచి కలకత్తాకు వచ్చి కాలేజీలో ప్రవేశించేసరికి శచీశుడు బి. ఏ. లో ఉన్నాడు. అతనూ నా ఊరివాడే. మొదటి చూపులోనే అతనిలో నాకు బలమైన ఆకర్షణ కనబడింది. అతను విలక్షణమైన వ్యక్తి కావటంచేత అతని సహాధ్యాయులకు అతనంటే ద్వేషం ఉండేది. నాకు అత

నంటే భక్తి అని తెలిసి మా లాడ్జిలో ఉండే కుర్రాళ్ళు రోజూ నేను వినేటట్టుగా అతన్ని గురించి 'అడ్డమైనమాటలూ' అంటూవచ్చారు.

ఇది చాలా రోజులు సహించి, చివరకు అతనితో చెప్పాను

"వాళ్ళతో వాదించి లాభం లేదు. వాళ్ళు తాము చెప్పేది నిజమనే నమ్ముతారు," అన్నాడు శచీశుడు.

"మీరు నాస్తికులని వాళ్ళంటున్నారు. అది నిజమేనా?" అని అడిగితే, నిజమేనని అతను ఒప్పుకున్నాడు. నేను షాక్ తిన్నాను దీనికితోడు మరొక షాక్ కూడా నాకు తగిలింది. అతను బ్రాహ్మణుడనుకున్నాను – కంసాలిట! కాలక్రమాన నేనూ నాస్తికమతము అవలంబించాను; కంసాలి సరసన భోజనం కూడా చేశాననుకోండి.

శచీశుడి పెత్తండ్రి జగమోహనుడు పేరుగన్న నాస్తికుడు. దేవుడిలో తనకు నమ్మకం లేదని కాదు, దేవుడే లేడని ఆయన వాదించేవాడు. దేవుడే ఉంటే తనకు బుద్ధి ఇచ్చినవాడు దేవుడై ఉండాలి; ఆ బుద్ధే దేవుడు లేడంటున్నది.

జగమోహనుడికి చిన్నతనంలోనే పెళ్ళి అయింది. యౌవనంలోనే భార్య పోయింది. అయినా జనాభా పెరగటం ఇష్టం లేక ఆయన తిరిగి పెళ్ళాడలేదు. జగమోహనుడి తమ్ముడైన హరిమోహనుడికి కొడుకు శచీశుడు. అన్నదమ్ము లిద్దరికీ **ఎలాటి** సామ్యమూ లేదు.

హరిమోహనుడి బాల్యమంతా అనారోగ్యంతో గడిచింది పెద్దవాడయాక ఏ రోగమూ లేకపోయినా అతని తల్లి, పిన తల్లులూ అతన్ని రోగిష్టిగానే చూసి చాలా శ్రద్ధచూపేవారు. అతను ఇతరులపైన ఆధారపడి ఉండటం నేర్చుకుని, పోలీసు అధికార్లనూ, పెద్ద ఉద్యోగులనూ, పత్రికలవాళ్ళనూ, ఎవరిని పడితే వారిని ఆశ్రయించాడు. గోబ్రాహ్మణులంటే అతనికి మరీ భక్తి!

జగమోహనుడు దీనికి పూర్తిగా విరుద్ధం. అతను గొప్పవాళ్ళకు దూరంగా ఉండేవాడు. వాళ్ళను దగ్గిరికి రానిస్తే తనకు లోకం స్వార్థం ఆరోపిస్తుందని అతని భయం. ఆ లౌకికశక్తులనుకూడా అతను ఆ విధంగానే దూరంగాఉంచాడు.

హరిమోహనుడికి శచీశుడు ఏడో సంతానం. శచీశుడికి ముగ్గురు అన్నలూ, ముగ్గురు అక్కలూ ఉండేవారు. శచీశుడు తన పెత్తండ్రి ముక్కునుంచి ఊడి పడ్డట్టుగా ఉండేవాడు. జగమోహనుడుకూడా అతన్ని తన సొంత కొడుకు లాగే చూసుకునేవాడు. ఇదీ మేలేననీ, శచీశుడి చదువుభారమంతా తన

సోదరుడే వహిస్తాడనీ హరిమోహనుడు సంతోషించాడు. జగమోహనుడు ఇంగ్లీషులో పెద్ద పండితుడు.

శచీశుడు పెద్దఅన్న పురందర్ తండ్రి మాలిమితో చిన్నతనంనుంచీ చెడిపోయి, చదువు అంటక, పెద్దవాడై పెళ్ళి చేసుకున్నాకకూడా పై తిరుగుళ్ళు మానలేదు. జగమోహనుడు పురందరుడి పెంపకం చూసి, శచీశుడు అలా కాకుండా ఉండటానికి తగిన జాగ్రత్తలన్నీ పడ్డాడు. తన ఈడువాడితోలాగా ఆయన శచీశుడితో అన్ని విషయాలూ చర్చించేవాడు. అతనిలో వ్యర్థమైన పాతభావా లుంటే వాటిని ఖాళన చేసేవాడు. "మనం ఇతరుల శాసనాన్ని ఒప్పుకోం గనక మనని మనమే శాసించుకోవాలి. నాస్తికుడి ధర్మం ప్రతిఫలాపేక్ష లేకుండా సాధ్యమైనంతమందికి ఉపకారం చెయ్యటం. అత్యధిక సంఖ్యాకులకు అత్యధికమైన మేలు కలగటమే మన ఆదర్శం," అని బోధించేవాడు.

శచీశుడి చదువు పూర్తి అయాక అతని తండ్రి హరిమోహనుడు అతన్ని తనకేసి తిప్పుకోవాలని చూశాడు. సాధ్యం కాలేదు. తన కొడుకును గురించీ, అన్నను గురించీ దుష్ప్రచారం సాగించాడు. తన అన్న తోళ్ళ వ్యాపారం చేసే తురకవాళ్ళకూ, చెప్పులు కుట్టే తురకవాళ్ళకూ సహాయపడటం హరిమోహనుడికి ఏమీ నచ్చక, అతను తమ పిత్రీయమంతా తగలేస్తున్నాడని ఆరోపణ చేశాడు. "నువు బొర్రలు పెంచుకున్న పురోహితులమీదా, పండాలమీదా తగలేసినదానికన్న నేను ఎక్కువ తగలేసిననాడు లెక్కలు చూసుకుందాం," అన్నాడు జగమోహనుడు.

ఒకనాడు జగమోహనుడు తన భాగంలో తురకవాళ్ళకు విందు ఏర్పాటు చేశాడు. హరిమోహనుడు. వచ్చి అభ్యంతరం చెప్పాడు. "నువు నీ దేవతలకు రోజూ భోగాలు చేస్తావే, నేను నా దేవతలకు ఒకసారి భోగం చేస్తే అభ్యంతరం దేనికి?" అన్నాడు జగమోహనుడు.

"ఆ తోళ్ళపని చేసే సాయిబులు నీ దేవుళ్లా?" అని హరిమోహనుడు అడిగాడు.

"అవును—వాళ్లు కంటికి కనబడతారు. నివేదన చేసిన ఆహారాన్ని తినేస్తారు," అన్నాడు జగమోహనుడు.

పురందరుడు చిందులు తొక్కుతూ వచ్చి, "చూడు, పెదనాన్నా! ఇవాళ నే నెంత ఘోరం చేస్తానో !" అన్నాడు.

"కోతి వెధవా! వాళ్ళ ఒంటిమీద చెయ్యివేసేవు. వా ళ్లూరుకోరు," అన్నాడు జగమోహనుడు.

తురకల విందు నిర్విఘ్నంగా జరిగిపోయింది.

## 2

జగమోహనుడికీ, హరిమోహనుడికీ కూడా జరుగుబాటు దేవాస్థానపు ఆదాయం ద్వారానే. తన అన్న అనాచారి నాస్తికుడూ కావటంచేత ధర్మ



కర్తగా ఉండతగడని హరిమోహనుడు అన్నమీద జిల్లాకోర్టులో దావా వేసి బోలెడంతమంది సాక్షులను తెచ్చాడు. తనకు దేవుడిలో నమ్మకం లేదనీ, ఎవరి పంక్తినైనా భోజనం చేస్తాననీ, తినదగినది ఏదైనా తింటాననీ జగమోహనుడు కోర్టులో చెప్పటంవల్ల తీర్పు హరిమోహనుడి పక్ష మయింది అన్నదమ్ములు విభాగాలుపడ్డారు. ఇద్దరి ఇళ్ళభాగాల మధ్యా ఎత్తుగా గోడలు లేచాయి.



ఇప్పుడు జగమోహనుడికి భుక్తి గడవటమే కష్టంగనక, శచీశుడు అతన్ని వదిలి తన గూట్లో దూరుతాడని హరిమోహను డనుకున్నాడు. కాని అలా జరగలేదు. "తన అన్నవస్త్రాలకు లోటు కలిగిపోతుందేమోనని మా అన్న నా కొడుకును అకట్టుకున్నాడు," అని హరిమోహనుడు నలుగురిలోనూ ప్రచారం చేశాడు.

ఈ మాట విని జగమోహనుడు నిర్ఘాంతపోయి శచీశుణ్ణి ఇంటినుంచి వెళ్ళిపొమ్మన్నాడు. తన పెత్తండ్రి ఎంత బాధపడి ఆ మాట అన్నాడో శచీశుడు ఊహించుకున్నాడు. అతను తన తండ్రి ఇంటికి పోవటానికి మారుగా బండిమీద తన పెట్టే, పరుపూ ఎక్కించుకుని, తన స్నేహితు డొక డుండే మెస్‌లో చేరి, ప్రైవేటు ట్యూషన్లు చెప్పుకోసాగాడు.

జగమోహనుడు ఒక ఎలిమెంటరీస్కూలుకు హెడ్మాస్టరుగా కుదిరాడు.

చాలా రోజులు గడిచాక ఒకనాడు శచీశుడు తన పెత్తండ్రి ఇంటికి పెద్ద పనిమీద వచ్చాడు. ఒక దగాపడిన గర్భవతికి ఆశ్రయం కావాలి. ఆమె పేరు ననిబాల. ఆమెకు తండ్రి లేడు. తల్లితోబాటు మేనమామవద్ద ఉంటూ ఉండేది. కొద్దిరోజులక్రితం తల్లి కూడా పోయింది. మేనమామకొడుకులు రౌడీవెధవలు. వాళ్ళ జట్టులోవా డొకడు ఇటీవల ననిబాలను లేవదీసుకుపోయి, ఆమెను నానాహింసలు పెడుతున్నాడు. ఇది శచీశుడు ప్రైవేటు చెప్పే ఇంటి పొరుగునే జరిగింది. ఆ అమ్మాయిని కాపాడాలని నిశ్చయించి శచీశు డామెను వెంటబెట్టుకుని తన పెత్తండ్రి ఇంటికి వచ్చాడు. ఎందుకంటే తనకు ఇల్లూ, వాకిలీ లేదు.

జగమోహనుడు ఆమెను తన లైబ్రరీగదిలో ఉండమన్నాడు. ఒకప్పుడు పుస్తకాల గుట్టలతో నిండిఉండిన ఆ గది ఇప్పుడు దాదాపు ఖాళీగా ఉన్నది. ఉద్యోగం లేనికాలంలో జగమోహనుడు తన పుస్తకాల నన్నిటినీ అమ్ముకున్నాడు. ఆమె కొక ముసలి పరిచారికను ఉంచాడు. తన తల్లికన్న కూడా ఈ జగమోహనుడు తనను హెచ్చు ఆదరంతో చూడటమూ, తాను పతిత అన్నట్టు చూడకపోవటమూ చూసి ననిబాల ఆశ్చర్యపోయింది.

రెండు రోజులలో జగమోహనుడిమీద దాడి ఆరంభమయింది. అమ్మమ్మలూ ఆడబంధువులూ వచ్చి, "ఆ అమ్మాయిని ఇంట ఉంచుకోవటం పాపం. వెళ్ళగొట్టెయ్యి," అని సలహా ఇచ్చారు. ఈ పాపాని కంతకూ మూలకారకుడు



శచీశుడై ఉంటాడని హరిమోహనుడు ప్రచారం చేశాడు. ఈ అపవాదులు విని జగమోహనుడూ, శచీశుడూ పరమానందం చెంది, గట్టిగా నవ్వుకున్నారు.

పురందరుడు ననిబాలను ఆ పేటనుంచి వెళ్ళగొడతానని శపథం చేశాడు. జగమోహనుడు తాను బడికి వెళ్ళేటప్పుడు తన ఇంటి తలవాకిలి తాళం పెట్టి వెళ్ళేవాడు. ఒకనాడు మధ్యాన్నం పురందరుడు తమ ఇంటి డాబా మీది నుంచి నిచ్చెన సహాయంతో తన పెత్తండ్రి భాగంలోకి దిగాడు. ననిబాల గదిలో నిద్రపోతున్నది. గది తలుపు తెరిచేఉన్నది. అతను ననిబాలను చూసి నిర్ఘాంతపోయి, "ఇక్కడున్నది నువా!" అన్నాడు.

ననిబాల నిద్రలేచి పురందరుణ్ణి చూసి కొయ్యబారిపోయింది. పురందరుడు కోపంతో వణికిపోతూ, "ననీ! ననీ!" అని రంకెలు పెట్టాడు.

సరిగా అదేసమయంలో జగమోహనుడు వచ్చి, "నా ఇంటినుంచి ముందు బయటికి పో!" అన్నాడు. పురందరుడు వెళ్ళాడు, ననిబాల మూర్ఛపోయింది.

ననిబాలకు ఈ దుస్థితి కలిగించింది పురందరుడే నని శచీశుడికి ముందే తెలుసు. కలకత్తాలో మరెక్కడా ననికి పురందరుడినుంచి రక్షణ లేదని తెలిసి, అతను అమెను జగమోహనుడి ఇంటికి తెచ్చాడు. పురందరుడు ఆమెను ఒకనాడు తన్ని వెళ్ళగొట్టాడు. ఆమె ఏమయినదీ అతనికి తెలీదు. శచీశుడు

ఆమెను తన ఇంటి సరసనే ఉంచటం తనను అవమానించటానికే నని పురంద రుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది

ఇది జరిగాక కొద్దిరోజులకు ననిబాల మృతశిశువును ప్రసవించింది.

ననిబాల విషయంలో పుణ్యం కట్టుకున్నవాడు పురందరుడే నని తెలిసి హరిమోహనుడు విచారించక, శచీశుడు తన అన్న తాలూకు ఆడదాన్ని ఆదు కోవటం చాలా తప్పనుకున్నాడు పురందరుడు ననిబాలను ఎలాగైనా తిరిగి తన అధీనం చేసుకోవాలని ఎత్తులు వేశాడు ఒకతెకు అతను డబ్బిచ్చి పంపితే, అది ననిబాల తల్లినంటూ వచ్చి జగమోహనుడిముందు శోకాలు ప్రారంభించి జగమోహనుడు తన్నబోయేసరికి పారిపోయింది.

మరొకనాడు సాయంకాలం పురందరుడు మరొకణ్ణి వెంటబెట్టుకుని దూకుడుగా జగమోహనుడి ఇంట ప్రవేశించి, "నేను ననీ అన్నను నా చెల్లెల్ని తీసుకుపోతాను,'' అని వాడి చేత చెప్పించాడు.

"నీకు సిగ్గు లేదురా? ననీకి సహాయం కావలిసినప్పు డేమయావు? ఇప్పుడు దాని అన్ననంటూ వస్తావా?" అని జగమోహనుడు వాడిమీద ఎగిరిపడ్డాడు.

''పోలీసులతో పిర్యాదు చేస్తాను,'' అంటూ వాడు వెళ్ళిపోయాడు. నిజానికి వాడు ననిబాల అన్నే. ఆమెకు గర్భం కలిగించినది శచీశుడేనని సాక్ష్యం చెప్పించటానికి వాణ్ణి పురందరుడు చేరదీశాడు.

ననీని కాపాడటానికి జగమోహనుడు ఆమెను వెంటబెట్టుకుని పడమర పోదామని ఆలోచించాడు.

''అన్నయ్య అల్లరి పెట్టదలిస్తే ఎక్కడికి వెళ్ళీ లాభం ఉండదు. ననీని నేను సివిలుమారేజి చేసుకుంటాను," అన్నాడు శచీశుడు

జగమోహనుడు ఆనందంతో శచీశుణ్ని కౌగలించుకున్నాడు.

ఈ సంగతి తెలిసి హరిమోహనుడు తన అన్నవద్దకు వచ్చి, "ఆ చెడి పోయినదాన్ని శచీశుడి కిచ్చి పెళ్ళి చేసి నా మీద పగ తీర్చుకుంటావా? ఈ ప్రయత్నం మాను; నా ఆస్తిలో సగం ఇస్తాను," అన్నాడు.

జగమోహనుడు మండిపోయి, "నేను నీలాంటి ధార్మికుణ్ణి కాను. నా స్తి కుణ్ణి. నీ ఎంగిలికి నేను ఆత్రపడను నీ మీద పగ తీర్చుకోవటమూ, నీ దయ సంపాదించటమూ నా కవసరం లేదు," అన్నాడు.

హరిమోహనుడు శచీశుణ్ణి కలుసుకుని. "నీ కేం పొయ్యేకాలంరా? వంశానికి కళంకం తెస్తావా?" అని అడిగాడు



"కాదు. ఉన్న కళంకం పోగొడతాను," అన్నాడు శచీశుడు.

శచీశుడు ననిబాలను చేసుకుంటే తాను ఆత్మహత్య చేసుకుంటానని పురందరుడు ప్రకటించాడు.

"నా మొగుడికి అంత ధైర్యం కూడానా?" అన్నది పురందరుడి భార్య.

కాని ననిబాల, జగమోహనుడు ఇంటలేని సమయంలో ఆత్మహత్య చేసుకుని ఎవరికీ ఏ సమస్యా లేకుండా చేసింది.

## 3

కలకత్తాకు ప్లేగు వచ్చింది. తానుండే పేట అపాయకరమని తెలిసి హరిమోహనుడు కాల్నాలో గంగబడ్డున ఉండే తమ బంగళాకు వెళ్ళిపోతూ

తన అన్నను కూడా ఆహ్వానించాడు. జగమోహనుడు రానన్నాడు. హరి మోహనుడు శచీశుడ్నికూడా పిలిచాడు.

"నే నెలా రాను. ఇక్కడ నాకు చాలా పని ఉన్నది,'' అన్నాడు శచీశుడు.

"చెప్పులు కుట్టేవాళ్ళ శవాలు మొయ్యటమేనా?" అని తండ్రి అడిగాడు. అవు నన్నాడు కొడుకు.

* * *

హరిమోహనుడు వెళ్ళాక ఆ పేటకు ప్లేగు రానేవచ్చింది. ప్రభుత్వ ఆస్పత్రిలో ప్లేగు తగిలినవాళ్ళను నేరస్థులను చూసినట్టు చూస్తున్నారు. అది తెలిసి జగమోహనుడు తన ఇంట్లోనే ఒక ప్రైవేటు ఆస్పత్రి ఏర్పాటు చేశాడు. అందులో నేనూ, శచీశుడూ, మరి నలుగురు కుర్రాళ్ళూ పని చేశాం, వాళ్ళలో ఒకడు డాక్టరు.

ఈ ఆస్పత్రిలో మొదట చచ్చిపోయినవాడు ఒక తురకవాడు, రెండో వాడు జగమోహనుడే. బతికిఉండగా శచీశుడు పెదతండ్రికి ఎన్నడూ ప్రణామంకూడా చెయ్యలేదు. ఇప్పు డతను ఆయన శవంయొక్క పాద ధూళి తీసుకున్నాడు.

తరవాత శచీశు డెటో వెళ్ళిపోయాడు. ఏమయాడో ఎవరికీ తేలీదు. మా దళంలో మిగిలినవాళ్ళము మాత్రం మతాన్ని ఖండిస్తూ, మతాభిమానులను తిట్టుతూ, అందరికీ ఆగ్రహం తెప్పిస్తున్నాం.

రెండే ళ్ళయింది. శచీశుడి జాడలేదు. మేం శచీశుణ్ణి నిందించలేదు గాని, అతనిలో దార్ఢ్యం తక్కువనిమటుకు అనుకున్నాం. జీవితమనే గీటురాయిమీద శచీశుడు చెల్లనిరూపాయి అయిపోయాడని మేం సిగ్గుపడేవాళ్ళం.

చివరకు మాకు శచీశుడి జాడ తెలియవచ్చింది. లీలానందస్వామి అనే వైష్ణవ బావాజీ శిష్యబృందంలో అతను చేరాడుట. అందరూ కీర్తనలు పాడుతూ, తాళాలు వేస్తూ, నృత్యాలు చేస్తూ చాలా అట్టహాసం చేస్తారట. ఒక నాస్తికు డీ భజనలజట్టులో చేరి ఎందుకు నృత్యాలు చేస్తున్నాడో నాకు బోధ పడలేదు. మా కిది చాలా తలవంపు లయింది. మావా ళ్ళందరికీ అతని మీద కోపం వచ్చింది; నాకు మటుకు రాలేదు.

నేను లీలానందస్వామిని వెతుక్కుంటూ, ఏర్లూ, మైదానాలూ, ఊళ్ళూ, పొలాలూ దాటి ఒకనాటి మధ్యాహ్నం రెండు గంటలవేళ శచీశుణ్ణి పట్టుకు న్నాను. ఆ కుగ్రామంలో గురుజీ ఆశ్రమం, దూరగ్రామాలనుంచి వచ్చిన



భక్తులతో కిటకిటలాడుతున్నది. అందరికీ భోజనాల ఏర్పాట్లు జరుగుతున్నాయి. శచీశుడితో ఒంటరిగా మాట్లాడటం పడలేదు.

ఎన్నడూ లేనిది శచీశుడు నన్ను చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చి గట్టిగా కౌగలించుకున్నాడు. తన గదిలో విశ్రాంతి తీసుకుంటున్న గురూజీ నేనెవరని శచీశుణ్ణి అడిగితే, "నా స్నేహితుడు, శ్రీవిలాస్," అని అతను చెప్పాడు. నేను ఇంగ్లీషులో ధారాళంగా ఉపన్యాసా లివ్వటానికీ, నాస్తికుణ్ణిగానూ పేరుపడిఉన్నవాణ్ణి.

గురూజీ నన్ను తన దగ్గిరికి పిలిపించుకున్నాడు. శచీశుడు ఆయన కాళ్ళ దగ్గర నేలమీద కూర్చుని కాళ్ళు ఒత్తసాగాడు. నేను కూర్చోవటానికి ఏ

నుంచి కనబడి మాయమయేది; కాని త్వరలో నేనూ, శచీశుడూమాత్రమే గురువుగారివెంట ఉన్నప్పుడు మా ఎదట పడసాగింది. ఆమె అంగాలలో యౌవనం తొణికిసలాడుతున్నది. ఆమె లోపల అగ్ని ప్రజ్వలిస్తున్నది.

దామినితండ్రి మొదట చాలా సంపన్నుడు. ఆయన తన కుమార్తెను శివతోషుడి కిచ్చినప్పుడు అతని కులంతప్ప ఏమీ చూడలేదు. నిజానికి అతనిలో ఏ విశేషమూ లేదు అతను కలకత్తాలో మామగారినుంచి రెండంతస్తుల మేడ ఒకటి పుచ్చుకున్నాడు. సుఖంగా కాలక్షేపం చెయ్యదగిన సౌకర్యాలన్నీ అమిరాయి దామిని పుట్టెడు నగలతో వచ్చింది

శివతోషుడికి తన ఆఫీసులో పని నేర్పాలని మామగారు చాలా యత్నించాడు. కాని అతనిబుద్ధి సంసారంకేసీ, కాంతా కనకాలకేసీ మళ్ళలేదు. ఇంతలో లీలానందస్వామివద్ద మంత్రోపదేశంకూడా పొందాడు

ఈ లోపుగా దామినితండ్రి ఆర్థికపరిస్థితి తారుమారై యావదాస్తీ హరించుకుపోయి, గడ్డురోజులు వచ్చిపడ్డాయి

ఒకనాటి సాయంకాలం శివతోషుడు తన భార్యదగ్గిరికి వచ్చి, "స్వామీజీ నిన్ను రమ్మంటున్నారు; నీకు ఉపదేశం చేస్తారుట," అన్నాడు

తన నగలపెట్టెముందు కూర్చుని నగలన్నీ సర్దుకుంటున్న దామిని తనకు తిరిక లేదన్నది. ఆరాత్రే ఆ నగలను శివతోషుడు స్వామీజీకి అర్పించాడు. మర్నాడు దామిని ఈ సంగతి తెలుసుకుని, "నా నగలు నా కిచ్చెయ్యి. అవి మా నాన్న ఇచ్చినవి వాళ్ళకే తిరిగి ఇస్తాను," అన్నది.

"అవి అంతకంటె మంచిచోటికే వెళ్లాయి," అన్నాడు భర్త.

దామినికి కడుపు దహించుకుపోయింది అవతల తన తండ్రికుటుంబం తిండికి మాడుతూంటే ఇక్కడ తాను అరవై, డెబ్భైమంది భక్తులకు వండి వార్చాలి ఆమె కావాలని కూరల్లో ఉప్పు జాస్తివేసేది; పాలు అడుగంటించి కాటుపోనిచ్చేది

దీనికంతకూ శిక్షగా శివతోషుడు తనభార్య అనంతరం తన ఆస్తిని స్వామీజీకి ధారపోసి మరీ కన్నుమూశాడు

ఇప్పటికీ ఆమెకు గురూజీపట్ల లక్ష్యంలేదు. ఆయన ఎప్పుడు ఉపదేశం చేస్తానని పిలిచినా, తనకు తల నొప్పిగా ఉన్నది అనేది. స్వామీజీవంటివాడు ఇంట్లో ఉంటే ఎటువంటి వారికైనా పవిత్రభావాలు ఏర్పడాలి, కాని ఆమెకు అలాటివి లేవు. ఆమె వితంతువుకు అర్హమైనట్టుగా ఉండక ముస్తాబయేది. థియేటరుకు

వెళ్ళేది. ఒకసారి, స్వామీజీ తనతో ఎట్లా మాట్లాడేదీ అనుకరించి తన స్నేహితురాలికి చూపి నవ్వింది.

ఇదంతా చూసికూడా స్వామీజీ ఆగ్రహించేవాడుకాడు. దామినితో చాలా తియ్యగా మాట్లాడేవాడు. ఆమె ప్రవర్తనను ఎవరన్నా విమర్శిస్తే, "ఆమె మారుతుంది," అనేవాడు.

మేం వచ్చిన కొద్దిరోజులకు ఆమె నిజంగానే మారింది. ఆమె మొరటు ప్రవర్తన ఉన్నట్టుండి అదృశ్యమయింది. ఆనాటినుంచీ ఆమె, సేవలో నిమగ్నురాలయింది. ఆనాటినుంచీ శచీశుడు ఆమెలో శోభను చూడసాగాడు.

సీతాకాలం. ఒకనాటిమధ్యాన్నం గురువుగారూ, భక్తులూ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో శచీశు డెందుకో తన పడకగదిలోకి వెళ్ళబోయి, స్తబ్ధుడై గడపదగ్గిర ఆగిపోయాడు. దామిని విరబోసుకున్న జుట్టుతో తలను నేలకు తాటిస్తూ, "నువు రాయివి, రాయివి! నన్ను కనికరించు! నన్ను చంపెయ్యి!" అంటున్నది.

శచీశుడికి భయం వేసి, వణుకు పుట్టుకొచ్చి, అక్కడినుంచి పారిపోయాడు.

## 4

గురూజీ మాఘమాసంలో ఏదైనా దారి తెన్నూ లేని ప్రదేశానికి వెళ్ళటం అలవాటు. ఈయేడు శచీశుడు తాను కూడా వస్తానన్నాడు. నిర్జనప్రదేశం కోసం తహతహలాడుతూ, నేనుకూడా వస్తానన్నాను. చిత్రమేమిటంటే దామిని తానుకూడా వస్తానన్నది. నిజానికి ఈ మాసమే ఆమెకు ఆటవిడుపు. నువు నడవలేవు అని గురూజీ చెప్పినా ఆమె వస్తానని పట్టుబట్టింది. స్వామీజీ ఆశ్చర్యపోయాడు.

శచీశుడి డైరీనుంచి ఈ సంఘటన ఇస్తున్నాను.

ఒకనాడు మేము ఒక ద్వీపకల్పంమీద ఉండే గుహలు చూడబోయాం. అక్కడ ప్రాచీన శిల్పా లున్నాయి. ఆ గుహలు చూసి చీకటిపడేలోగా గ్రామానికి తిరిగిరావటం పడలేదు. అందుచేత ఆ రాత్రి గుహలలోనే గడప నిశ్చయించాం.

శచీశుడికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. గుహ చాలా చీకటిగానూ, చెమ్మగానూ ఉండి, అతన్ని భయపెట్టింది. అందులో నుంచి బయటికి రావాలని ప్రయత్నిస్తే ఆ చీకటిలో అతనికి దారి తెలియలేదు. అతను చివరకు కలత



నిద్రలో పడుతూండగా తన పాదాలవద్ద నిట్టూర్పు వినిపించింది. అతని పాదాలను ఏదో మెత్తగా తాకింది. అతని ఒళ్లు మంచులాగా బిగుసుకుపోయింది. అతను భయంతోనూ, అసహ్యంతోనూ తన కాళ్ళదగ్గిర వున్నదాన్ని కాళ్ళతోనే తోశాడు. నిద్రమత్తు వదిలింది. అతని కాళ్ళమీద వెంట్రుకలు పడ్డాయి. అతను కంగారుపడి లేచి కూర్చునేసరికి చీకటిలో ఎవరో లేచి వెళ్ళిపోతున్నట్టు స్ఫురించింది. ఎవరో వెక్కిన చప్పుడు కూడా అతనికి వినిపించింది.

మేం గుహనుంచి గ్రామానికి తిరిగివచ్చాక దామినిలో మార్పు కనబడింది.

ఆమె మా కంటబడటం మానేసి, గ్రామంలోని స్త్రీలతో స్నేహంచేసి, ఇల్లిల్లూ తిరగసాగింది. ఆమె వాలకంలో కూడా తిరుగుబాటు కనబడింది. గురూజీకి మళ్ళీ ఆమె అంటే కాస్త భయం పట్టుకున్నది. ఆయన మాట్లాడుతున్నప్పుడు లేచి వెళ్ళిపోయ్యేది. గురూజీ వెళ్ళి "మా గదిలోకి రావా ?" అని అడిగితే, "రాను, నాకు పని ఉన్నది," అనేది ఆమె గురూజీ ఉపదేశాలు వినటం మానేసి, దెబ్బతిన్న డేగను సంరక్షించటంలోనూ, కుక్కపిల్లను సాకటంలోనూ నిమగ్నురా లయింది

మొదట్లో ఆమె మమ్మల్ని దూరంగా ఉంచినప్పుడు మా కందులో విడ్డూర మేమీ కనబడలేదు గాని, ఈ సారి చాలా వింతగా తోచింది.

ఒకసారి శచీశుడు మా బసమీది డాబాకు వెళ్ళి, "నువ్వు బొత్తిగా మా దగ్గిరికి రావటం మానేశావేం ?" అని దామినిని అడిగాడు

"నాతో ఏమిటి పని ?" అన్న దామె.

"అవసరం మాది కాదు, నీదే," అన్నా డతను.

"నా కేమీ లేదు, ఏమీ లేదు," అన్న దామె తీవ్రంగా.

"నీ మనస్సులో అశాంతి ఉన్నది దాన్ని పోగొట్టుకోవాలంటే—"

"రాత్రీ పగలూ కోతుల్లాగా గంతులు వేసే మీరా అశాంతిని పోగొట్టేది. మీకే శాంతి లేదు. మీకు దణ్ణం పెడతాను. నన్ను వదిలెయ్యండి," అన్నది దామిని.

స్త్రీ హృదయం అర్థం చేసుకునేపాటి అనుభవం నాకు లేదు. కాని పైపైన నేను చూసి తెలుసుకున్న దేమంటే దుఃఖం సంప్రాప్తమయేచోటనే వాళ్ళు ఆత్మార్పణ చేసుకుంటారు వాళ్ళను కామాంధులైన పశుప్రాయులూ, భావ లోకంలో విహరిస్తూ చేతికి అందనివాళ్ళూ ఆకర్షిస్తారు గాని నావంటి మధ్య రకం మనుషులు ఆకర్షించలేరు నాబోటివాళ్ళకు ఆడది ఆడదిలాగే కనబడు తుంది గాని, ఒక ఆటవస్తువులాగానో వీణాఝుంకారంలాగానో కనబడదు. మేము వాళ్ళను మా కామాగ్నికి బలిచెయ్యనూలేము, మా భావజ్వాలలలో కరిగించి కొత్తస్వరూపం ఇవ్వనూలేము. మేము తేలికగా ఆత్మార్పణ చేసుకుంటాము గనకనేమో స్త్రీలు మమ్మల్ని లక్ష్యపెట్టరు. మా పైన వాళ్ళకు ఆదరం ఉండ వచ్చు, మాతో వారికి పనికూడా ఉండవచ్చు, మమ్మల్ని ప్రేమించారు.

దామిని కోపంకొద్దీ గురూజీని బహిష్కరించింది; కోపానికి వ్యతిరేకమైన




భావంకొద్దీ శచీశుణ్ణి బహిష్కరించింది. కాని నాపట్ల ఏభావమూ లేకపోవట. చేత నన్ను బహిష్కరించక, వీలు చిక్కినప్పుడల్లా నాతో తెగ మాట్లాడేదిం

రసచర్చలకు అప్పుడప్పుడూ నేనుకూడా ఎగనామం పెడుతూండేవాణ్ణి. శచీశు డది గమనిస్తూనే ఉండేవాడు. ఒకసారి నేను సంకీర్తన ఎగగొట్టి ముంగిస వెనక పాలుపట్టుకుని పరిగెత్తుతుండగా శచీశుడు చూశాడు. నేను కంగారు పడి, పాలపిడత అక్కడే ఉంచేసి, పక్కకు పారిపోయాను. దామిని నా పరువు దక్కనివ్వకుండా, "ఎక్కడికి పోతున్నారు శ్రీవిలాసబాబూ? ఈపాటికి సంకీర్తన ముగిసే ఉంటుంది. కాస్సేపు కూర్చోండి," అన్నది. శచీశుడు వింటుండగానే ఆమె, "ముంగిసను కట్టిఉంచాలిసిందే. నిన్న రాత్రి సాయిబుల ఇంటినుంచి కోడిని తెచ్చింది. దాన్ని మూసిపెట్టటానికి పెద్దగంప తెమ్మని శ్రీవిలాసబాబుతో చెప్పాను," అన్నది.

గురూజీ శచీశుడిచేత సేవ చేయించుకోవటానికీ, దామిని నాచేత సేవ చేయించుకోవటానికీ తేడా ఏమీ లేదు.

శచీశు డేమీ అనకుండానే వెళ్ళిపోయాడు.

అదిమొదలు దామిని ప్రతి చిన్నపనికీ నన్ను పిలుస్తూండేది. ఒకనాడు ఆమె ఏవో వంటకం తయారుచేసి తినటానికి నన్ను పిలిచింది. నేను దాన్ని తింటుండగా శచీశుడు వచ్చి చూసివెళ్ళాడు.

ఆ ఇద్దరి మధ్యా నేను నలిగాను. నా అసమర్థత చూస్తే నాకే కోపం వచ్చేది.

ఒకనాడు శచీశుడు నాతో, "దామిని మన వెంట ఉండటం మంచిదికాదు. మనం ప్రకృతితో ఎటువంటి సంబంధమూ పెట్టుకోరాదు," అన్నాడు.

"ప్రకృతిని లేకుండా చెయ్యటం నీ తరం కాదు అది ఉన్నదనుకునే సాధన చెయ్యాలి. దానికి దూరంగా వెళ్ళి సాధన చేద్దామనుకోవటం ఆత్మవంచన; దెబ్బతింటావు," అన్నాను.

"మన మనసు మన వశంలో ఉండకుండా చెయ్యటానికే ఆడవాళ్ళు ఉద్దేశించబడ్డారు వాళ్ళకు దూరంగా ఉంటేనే గాని ఆత్మసంయమనం రాదు," అన్నాడు శచీశుడు నేను మాయచుట్టి ఉన్నాననీ, సాధన అంటే సరదాగా ఆడుకోవటం అనుకుంటున్నాననీ తిట్టి, అతను గురూజీదగ్గిరికి వెళ్ళి కాళ్ళుపట్టాడు.

తరవాత శచీశుడూ, గురూజీ కలిసి ప్రకృతి అల్లుతూండిన మాయాజాలాన్ని గురించి చాలారోజులు చర్చించారు. గురూజీకి దామిని పెద్ద సమస్య తెచ్చిపెట్టింది సాఫీగా ప్రవహించే నీటిలో పెద్ద సుడిగుండం కలిగించింది. పైగా గురూజీకి దామిని అంటే భయం.

ఒకనాడు గోవిందస్వామి ఆలయంలో భజన ఏర్పాటయింది. దూరంనుంచి ఎవరో భజనకారుడు వచ్చాడు. రాత్రి చాలాసేపటికిగాని భజన ముగియదు. అందరమూ అక్కడికి వెళ్ళాం. నేను మాత్రం భజన ఆరంభంలోనే జారుకుని బసకు వచ్చేశాను ఆ రోజు దామిని మనసు విప్పి నాతో తన కష్టసుఖాలు మాట్లాడింది.

ఎప్పుడు వచ్చాడో శచీశుడు వచ్చి మా వెనక నిలబడ్డాడు. అతన్ని చూడగానే దామిని కళ్లు తుడుచుకుని, అవతలి గదిలోకి వెళ్ళిపోబోయింది. శచీశుడామె నాపి, "చూడు దామినీ! మేం గురూజీవెంట వచ్చిన ఉద్దేశమూ, నువు వచ్చిన ఉద్దేశమూ ఒకటి కాదు. ఈ భక్తులవెంట నువ్వెందుకు?" అని అడిగాడు.

దామిని కళ్ళ నిప్పులు రాలుస్తూ, "నేను కోరి ఇక్కడ ఉన్నానా? వెళ్ళిపోయే అవకాశం ఏదీ? నేను మా భక్తుల ఖైదీని!" అన్నది.

"నువు మీ బంధువు లెవరిదగ్గిరకైనా వెళ్ళిఉంటే మంచిదని మేం తీర్మా నించాము," అన్నాడు శచీశుడు.

"మీరు తీర్మానించారేం? నేను తీర్మానించలేదు," అన్న దామె.

"అందువల్ల నీ కేం ఇబ్బంది?"

"మీ ఇష్టం వచ్చినట్టు రావటానికి పోవటానికి నేను మీ చేతి క్కీలుబొమ్మను కాదు మీకు ఇష్టమవుతుందని రాలేదు, కష్టమయిందని వెళ్ళిపోను," అంటూ దామిని పక్కగదిలోకి వెళ్ళి తలుపులు మూసుకున్నది.

శచీశుడు భజనకు మరి వెళ్ళలేదు. నేను మాత్రం బయటికి వెళ్ళి, చీకట్లో గ్రామమంతా తిరిగాను.

గురూజీ నన్నూ, శచీశుణ్ణీ రసస్వర్గంలో నిలిపిఉంచటానికి చేసిన ప్రయత్నాలు దామిని భగ్నం చేయసాగింది. మా రసస్వర్గం మట్టికుండలాగా బద్దలు కానున్నది. శచీశుడు దారం తెగినాకూడా ఇంకా ఆకాశంలో ఆడుతున్న గాలిపటంలాగా ఆగిపోయాడు. అతని పూజలూ, జపాలూ యథాప్రకారం సాగుతున్నా, అతని గుండెలోపల దడమాత్రమే ఉన్నది.

దామినికీ నాకూ మధ్య రహస్యాలు లేవుగనక నేను ఎప్పటిలాగే ఉన్నాను; కాని గురూజీ భయమూ, శచీశుడి బాధా నానాటికీ పెరిగిపోతున్నాయి. వాటిని మరింత చెయ్యటానికి దామిని, మేము ముగ్గురమూ మాట్లాడుకునే సమయంలో నన్ను పిలుస్తూండేదీ. కొద్దిగా నేను పస్తాయించి చివరకు వెళ్ళేవాణ్ణి.

ఒకరోజు గురూజీ దామినితో, "అమ్మా! మేము ఇక్కడినుంచి చాలా దూర ప్రదేశానికి అతి కష్ట ప్రయాణం చేయబోతున్నాం. నువు మీ పిన్నిగారింటికి పోవటం మంచిది," అన్నారు.

"నేను వెళ్ళను. ఆవిడ నాకు వరస పిన్ని కాని, అసలుపిన్ని కాదు. కాక పోయినా ఆమె నన్నెందు కుంచుకోవాలీ? నా మంచిచెడ్డలు విచారించే బాధ్యతా, నన్ను కట్టుబాటులో ఉంచే బాధ్యతా మీరు మీద వేసుకున్నారు. దాన్ని ఇప్పు డెవరిమీదికి తోస్తారు?'' అన్న దామె.

"అయితే, నేను ఎప్పటికీ నిన్ను వెంట ఉంచుకోవలసిందేనా? నేను పోతే ఏం చేస్తావు?'' అన్నారు గురూజీ.

"ఆసంగతి ఆలోచించే అధికారం నా కెవరిచ్చారు? నాకు ఎవరూలేరు, డబ్బూలేదు – అంతే నాకుతెలుసు," అంటూ దామిని వెళ్ళిపోయింది.

గురూజీ పెద్ద నిట్టూర్పు విడిచారు.

ఒకసారి దామిని నన్ను మంచిపుస్తకాలు తెచ్చిపెట్టమని అడిగింది. దామిని ఉద్దేశంలో "మంచి" పుస్తకాలంటే "భక్తిరత్నాకరం" లాటివి కావు. నేను ఒక ఆధునికుడి రచనలు తెచ్చాను. అవి గురూజీ చేతిలోపడ్డాయి. ఆ పుస్తకాలెవరికోసమని ఆయన నన్నడిగారు. చెప్పేను. ఒక పుస్తకం తీసి, పేజీలు తిరగేసి, "ఇందులో సాత్వికవాసనేమీ ఉన్నట్టులేదే?" అన్నారాయన.



"కాని సత్యంవాసన ఉన్నది," అన్నాను. నాలో అణగిఉన్న తిరుగుబాటు చప్పున అలా పైకివచ్చింది.

గురూజీ నన్ను తేరిపార జూసి, "ఓహో, అలా అయితే చదివిచూస్తాను," అంటూ ఆ పుస్తకాలను తన దిండుకింద పెట్టేశారు. వాటిని ఆయన ఇవ్వ దలచలేదనుకున్నాను.



దామిని అంతా గమనించి ఉండాలి ఆమె తలుపుదగ్గరకు వచ్చి, "నే నడిగిన
పుస్తకా లింకా రాలేదా, శ్రీనివాసబాబూ?" అన్నది.

"అవి నువు చదవదగిన పుస్తకాలు కావమ్మా!" అన్నారు గురూజీ.

"మీ కెలా తెలుసు?" అని దామిని అడిగింది.

"నీకుమాత్రం ఎలా తెలుస్తుంది?" అన్నాడు గురూజీ ముఖం చిట్లించి.

"నేను అదివరకు చదివాను. మీరు బహుశా చదివివుండరు."

"చదివినవి మళ్ళీ చదవటం దేనికి?"

"అది నా కోరిక. మీ కోరికల కడ్డుండరాదే? నాకు కోరిక లుండరాదా!"

"నేను సన్యాసిని — నీకు తెలీదా?"

"నేను సన్యాసినినికాను. అది మీకూ తెలుసు. నా పుస్తకాలు నాకిచ్చేయండి."

గురూజీ దిండుకిందనుంచి పుస్తకాలు తీసి విసిరేశారు.

దామిని ఆ పుస్తకాలను నాచేత చదివించుకోసాగింది వరండాలో కూర్చుని మాట్లాడుకునేటప్పుడు మాతో వచ్చి కూచోవాలని శచీశుడికి కూడా అనిపించే దనుకుంటాను. అప్పుడప్పుడూ మా ఎదటగా వచ్చేవాడు, వెళ్ళేవాడు

ఒకనాడు మే మేదో హాస్యఘటనగురించి చదువుతూ నవ్వుకుంటూండగా, దేవాలయంలో జరిగే భజనదగ్గిర ఉండవలసిన శచీశుడు అకస్మాత్తుగా మా దగ్గిరికి వచ్చి కూర్చున్నాడు. మా ఇద్దరి నవ్వులూ కట్టుపడ్డాయి. శచీశుడితో ఏదన్నా మాట్లాడదామనుకున్నాను; కాని సాధ్యంకాలేదు. అతను ఎలా వచ్చాడో అలాగే, హాఠాత్తుగా లేచి వెళ్ళిపోయాడు.

ఆ రోజే అతను గురూజీతో చెప్పి, వారంరోజులలో తిరిగివస్తానని సముద్ర తీరానికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయాక దామిని నన్ను చదవటానికి పిలవలేదు; తన గదిలో తలుపులు మూసుకుని కూర్చున్నది.

కొద్దిరోజుల అనంతరం, గురూజీ నిద్రపోతున్న సమయంలో శచీశుడు అకస్మాత్తుగా తిరిగివచ్చి, నాకేసి చూడకుండా తిన్నగా దామిని గదిదగ్గిరికి వెళ్ళి, ఆమెను పేర్లుపెట్టి పిలిచి, తలుపు తట్టాడు.

దామిని తలుపు తెరిచి అతని అవతారం చూసి దిగ్భ్రాంతి చెందింది. చెదిరి పోయిన జుట్టూ, మురికిగుడ్డలూ, ఎండిపోయిన ముఖమూ—అతను తుఫాను దెబ్బతిన్న ఓడలాగా ఉన్నాడు.

"దామినీ! నిన్ను వెళ్ళిపొమ్మనటం చాలా పొరపాటు; క్షమించాలి. నువు



మాతో కలిసిమెలిసి అన్ని పనులూ చేస్తూఉండాలి. ఇలా ఎడంగా ఉండ కూడదు," అన్నాడు శచీశుడు.

"అలాగే కలిసి ఉంటాను. ఏ అపరాధమూ చెయ్యను," అంటూ దామిని అతని పాదాలు తాకి ప్రణామం చేసింది.

అప్పటినుంచీ దామిని మారిపోయింది. ఆమె ఎప్పుడూ మాతోనే ఉంటున్నది; పూజలూ, సేవలూ చేస్తున్నది గురూజీ చేసే బోధలు వింటున్నది. ఆమె బట్టలు కూడా మారిపోయాయి. ఆధునిక రచనలు పోతుపులంగు[illegible] పోయాయి.

ంగా ఇదంతా వైమాల్య. ఆమె హృదయం మారలేదు. ఆమెకు గురూజీ బోధలు తల కెక్కలేదు. కాకపోతే ఆమె కిప్పుడు నాతో పని లేదు. నాకూ్కడా వేరే ఎవరూ లేరు. గద్ద చచ్చిపోయింది. ముంగిస పారిపోయింది. కుక్కపిల్లను దామిని, గురూజీ అసహ్యపడుతున్నారని, ఎవరికో ఇచ్చేసింది. లోపల ఎంతో వాదించుకుంటున్నా నేను మా మధ్య జరిగే వాదనల్లోనూ, నృత్యాలలోనూ పాల్గొనక తప్పలేదు.

ఇంతలో నవీన్ అనేవాడి భార్య విషం తిని ఆత్మహత్య చేసుకున్నది. ఈ నవీనుడు మా పొరుగునే ఉండేవాడు. భజన ముఠాలో ఒకడు. నవీనుడి భార్య, పెళ్ళి కావలిసిన తన చెల్లెలిని తన దగ్గిరే ఉంచుకున్నది పిల్ల చాలా బాగుంటుంది. నవీనుకి తమ్ముడే ఆ పిల్లను చేసుకోవటానికి నిశ్చయమయింది. ఇంతలో, నవీనుడికి తన చెల్లెలితో సంబంధం ఉన్నదని తెలిసి, నవీనుడి భార్య తన భర్తను బతిమాలి తన చెల్లెలిని అతనికే ఇచ్చి పెళ్ళి చేసి, తా నింత విషం పుచ్చుకున్నది.

ఆ రాత్రి వెన్నెలలో డాబామీద దామిని కూర్చునిఉండగా శచీశుడు అక్కడికి వచ్చాడు. ఆమె అతనితో, "మీరు రాత్రీ పగలూ చేసే రససాధనతో ఎవరిని కాపాడగలిగారు. రసం ఏమిటో ఇవాళ చూశారు గదా! దానికి ధర్మమూ, బాధ్యతా, అన్నదమ్ములూ, భార్యా, మానమూ, దయా, విశ్వాసమూ, సిగ్గూ—ఏదీ లేదు. ఈ సిగ్గుమాలినదానినుంచి మీరు మనుషులను ఎలా కాపాడదా మనుకుంటున్నారు?'' అన్నది.

"ఆడవాళ్ళను మా సరిహద్దుల లోపలికి అడుగు పెట్టనివ్వం,'' అన్నాను నేను.

దామిని నా మాట వినిపించుకోక, "మీ గురువుగారి దగ్గిర నా కేమీ దొరకలేదు. ఆయన మిమ్మల్ని దయాశాంతులు లేని మార్గాన తీసుకుపోతున్నారు. రసరాక్షసియొక్క భయంకరరూపం ఇవాళ చూశాం గదా! న న్నా రాక్షసినుంచి కాపాడగలవాడివి నువే?'' అని శచీశుడితో అన్నది.

"నే నేం చెయ్యగలను?" అన్నాడు శచీశుడు.

"నాకు గురువుగా ఉండి ఆజ్ఞాపించు. నేను బతికివుండే మార్గం చూపించు," అన్నది దామిని

"సరే,'' అన్నాడు శచీశుడు.

ఆ తరవాత శచీశుడు మళ్ళీ మతం మార్చాడని పుకార్లు బయలుదేరాయి.



"రోజూ మీకు నచ్చేట్టు వంట చేస్తే ఇక మీతో పోట్లాట ఎలావస్తుంది?
నేను అలిగి కన్నవారింటికి ఎలా వెళ్ళగలను?"

ఇప్పు డతనికి ఎందులో నమ్మకమో ఎవరికీ తెలీదు. పూర్వంలాగే సంఘసేవ చేస్తున్నాడు—కాని ఎవరితోనూ వాదనలూ, దెబ్బలాటలూ లేవు,

మరొక విషయం. దామిని నన్ను పెళ్లాడింది. ఇది ఎలా జరిగిందో ఎవరికీ తెలీదు. తెలియవలసిన అవసరంకూడా లేదు.

# 5

లీలానందస్వామిని వదిలేశాం. ఆయనవెంట ఉన్నంతకాలమూ మాకు తిండిసనిలేదు, ఇంటిసమస్యలేదు; మా అవసరాలన్నీ హాయిగా గడిచిపోయాయి. ఇప్పుడు మాకు అవన్నీ సమస్య లయాయి

జగమోహనుడు తన ఇంటిని శచీశుడిపేర రాసి, అందులో కొన్ని షరతులు పెట్టాడు. ఆయన రాసినవి నాకు నేనే ఎగ్జిక్యూటరునుగనక ఆ షరతులను నేనే అమలుచెయ్యాలి. షరతు లేవంటే:- ఆ ఇంట్లో పూజలూ, పునస్కారాలూ జరగరాదు; కిందిభాగంలో ఆ పేటలోని పేద సాయిబుల పిల్లలకోసం రాత్రి పాఠశాల ఏర్పాటు చెయ్యాలి. శచీశుడి అనంతరం ఆ ఇంటిని పూర్తిగా వాళ్ళ అభివృద్ధికోసమే వదిలెయ్యాలి.

ఆ ఇంటికి పోదామన్నాను శచీశుడితో. కాని అతను అలాటి ఆధారాలను ఆశ్రయించేటందుకు సుముఖుడుగా లేడు.

"మీ రిద్దరూ వెళ్ళి అక్కడ ఉండండి. నేను కొన్నాళ్లు ఒంటరిగా తిరుగుతాను.

ఇప్పుడిప్పుడే గమ్యం గోచరమవుతున్నది. దాని అన్వేషణ ఇప్పుడు మానిత మరి దొరకదు," అన్నాడతను

అతనలా ఒంటరిగా తిరగటానికి వీలులేదన్నది దామిని నాతో. "ఇదివర కొకసారి ఇలాగే ఒంటరిగా తిరిగి, భీభత్సంగా తిరిగివచ్చాడు. జ్ఞాపకం లేదూ?" అన్నదామె.

నాకు మండిపోయింది. "పెత్తండ్రి పోయాక అతను రెండేళ్ళు ఒంటరిగా తిరిగాడు; అప్పుడు చచ్చిపోలేదే," అన్నాను.

"మనిషి అంతత్వరగా చావడు; కాని మనం ఉండగా అతన్ని బాధపడనివ్వడం దేనికి, శ్రీనివాసబాబూ?" అన్నది దామిని. 'మనం' అని ఆమె నన్నుకూడా తనతో కలుపుకున్నందుకు నాకు ఆనందమయింది.

సరే, మేం కలకత్తా వెళ్లే ఆలోచన మానుకుని, ఒక పాడుపడిన 'దయ్యాల కొంప'లో మకాం ఏర్పాటుచేశాం.

శచీశుడి సాధన నాకు అంతుచిక్కలేదు. గురూజీవెంట ఉన్నప్పుడు అతను పాడి, గంతులు వేసి, లోపల ఉండే ఉద్రేకాన్ని ఏదో రూపంలో విసర్జించేవాడు. ఇప్పుడా అవకాశంలేదు. అతను అగ్నిని ఆరాధిస్తున్నాడు; అగ్నిలాగా వెలుగుతున్నాడు. అతన్ని చూస్తే భయం వేస్తున్నది

"ఎవరినన్నా ఒక గురువును చూసుకుని నీ భారం ఆయనపైన వేశావంటే సాధనకు తేలిక అవుతుంది," అన్నానతనితో.

"మాయలో మునిగిపోవటం మరింత తేలిక. తేలికైన సాధన ఎవడిక్కావాలి?" అన్నాడతను. అతనిమాటలు పరస్పరం విరుద్ధంగా కూడా ఉండేవికాదు. ఎప్పుడెక్కడ ఉంటాడో చెప్పటానికి లేకుండా ఉండేది. రోజురోజుకూ కుమిల్కిస్తున్నాడు.

ఇది చూసి దామినిప్రాణాలు కొట్టుకుపోయేవి. అతని స్నానపానాలు క్రమంగా జరిగేటట్టు చూడటానికామె విశ్వప్రయత్నం చేసేది. కాని శచీశుడు ఏ నియమాలకూ లొంగేరకంకాడు.

ఒకనాడు ఉదయం అతను ఏరు దాటి అవతలిఒడ్డున ఉండే ఇసుకదిబ్బల మీదికి వెళ్లాడు. దామిని అన్నం తినలేదు; మధ్యాహ్నం దాటిపోయింది. అతను తిరిగిరాలేదు దామిని అతని భోజనం పళ్ళెంలో పెట్టుకుని ఆవతలి ఒడ్డుకు వెళ్ళి చూసింది ఎక్కడా మనిషిపొడ లేదు. కేకలుపెట్టింది. జవాబు లేదు. చివరకామె ఇసుకలో కాలిగుర్తులుచూసి, వాటినిబట్టి వెళితే, ఒక చెరువు ఒడ్డున, ఇసుకదిబ్బ నీడలో కూర్చుని శచీశుడు కనిపించాడు.



ఆమెను చూసి అతను ఎందుకు వచ్చావన్నాడు. భోజనం తెచ్చానన్నది. తిననన్నాడు. చాలా పొద్దయిందన్నది. కావలిస్తే కొంచెంసేపు ఆగి తినమన్నది. అత నామెమీద చిరాకుపడ్డాడు. ఆమె తిరిగి వచ్చేసి, కాళ్ళుచాచుక్కు కూర్చు కంట నీరుపెట్టుకున్నది. (ఆమెకు ఒకంతట కన్నీరురాదు.)

"శచీశుడి పోషణగురించి నీ కింత తాపత్రయం దే... దామి నడిగాను.

"నాకు సాధ్యమైనది అదే. మిగతా విషయాల్ని అతనే చూసుకుంటాడు. నే నేం చెయ్యగలను?" అన్న దామె.

ఇది జరిగినాక శచీశుడు చాలా 'మంచి'గా ఉండటం మొదలుపెట్టాడు. దామినిని సంతోషపెట్టాలని అనేకప్రయత్నాలు చేశాడు మాతో మాము లుగా మాట్లాడసాగాడు. ఇదంతా తెచ్చిపెట్టుకున్నది కాదు. ఇందువల్ల దామిని బాధేతప్ప ఆనంద మేమీ కలగలేదు.

ఒకనాడు రాత్రి రెండుగంటలవేళ శచీశుడికి జ్ఞానోదయం అయింది. అతని

ఇంటిముందు నిలబడి నన్నూ, దామినినీ కేక పెట్టి పిలిచాడు. మేం నిద్ర లేచి, కళ్లు నులుముకుంటూ బయటికి వెళ్ళాం. మమ్మల్ని చూడగానే అతను "నిజం తెలిసిపోయింది!" అన్నాడు.

అతను కనిపెట్టిన నిజం ఏమంటే—దేవుడికి మనం అభిముఖంగా వెళితేనే గాని దేవుణ్ణి కలుసుకోలేం. దేవుడు నడిచే దారినే మనమూ నడిస్తే మనకూ దేవుడికీ భేటీ జరగదు. దేవుడు ఆకారంకేసి వస్తాడు, మనం నిరాకారంకేసి పోవాలి. దేవుడు బంధాలకేసి వస్తాడు, మనం బంధవిముక్తికేసి పోవాలి. ఈ రహస్యం ఆ అర్ధరాత్రివేళ శచీశుడికి హఠాత్తుగా బోధపడింది.

ఇది జరిగాక అతను మళ్ళీ పూర్వంలాగా అయిపోయాడు. అతను ఏం తినేవాడో, ఎప్పుడు నిద్రపోయేవాడో తెలీదు.

ఒకనాటి రాత్రి ప్రళయమైన గాలివాన ఆరంభమైంది. మేము ముగ్గురమూ మూడు గదులలో పడుకునేవాళ్ళం. నేనా గాలివాన భీభత్సానికి మేలుకున్నాను. తిరిగి నిద్రపట్టలేదు. మా గదుల ముందు వరండాలో ఉండే కిరసనాయిలు బుడ్డిదీపం గాలికి ఆరిపోయి, అంధకారంగా ఉన్నది.

ఆ సమయంలో శచీశుడు తన గదిలో నుంచి, "ఎవరది?" అని కేక వెయ్యటం వినపడింది.

"నేను దామినిని. కిటికీలోనుంచి జల్లు లోపలికి వస్తున్నది. రెక్కలు మూసేస్తాను," అన్న దామిని జవాబు వినపడింది.

శచీశుడు గదిలోనుంచి లేచి బయటికి వెళ్ళిపోయాడు. అతను తిరిగి వస్తాడని చూసింది, గడప దగ్గర తిష్ఠవేసి; ఇంతలో ఆకాశంలో మెరిసిన పెద్ద మెరుపులో ఆమెకు శచీశుడు నదిఒడ్డున నిలబడి కనిపించాడు. దామిని అతని దగ్గిరికి వెళ్ళి, అతని పాదాలమీద పడి, "నేనేం అపరాధం చేశాను? నన్నెందు కిట్లా శిక్షిస్తున్నావు?" అన్నది. శచీశుడేమీ అనలేదు; ఆమె రమ్మనగానే వచ్చేశాడు.

తిరిగివచ్చాక అతను దామినితో, "నాకు కావలిసినవాడికోసం నేను వెతుక్కుంటున్నాను. లోకంలో నాకింకేదీ అవసరంలేదు. దయచేసి నన్ను విడిచిపెట్టి వెళ్లు," అన్నాడట. అలాగే వెళ్ళిపోతానన్నదిట దామిని.

ఆ మర్నాడు దామిని తనను కలకత్తాకు తీసుకుపొమ్మని నన్నడిగింది. రాత్రి జరిగినది నాకు తెలీదు. అయినా నేను ఎందుకని అడగలేదు. ఆమె వెళ్ళిపోవటం మంచిదనే నాకూ అనిపించింది

దామిని బయలుదేరి వచ్చేటప్పుడు ఆమే, శచీశుడూ ఒకరికొకరు క్షమాప



ణాలు చెప్పుతున్నారు. నాకు శచీశుడిమీద రేగుతున్న కోపాన్ని దామిని ఎదట బయటపెట్టాను. "అతన్ని గురించి నా ఎదట ఎన్నడూ అలాంటి మాటలు అనవద్దు," అని దామిని కోపంగా అన్నది.

దామినిని పిన్నిగారింట దిగబెట్టి నేను ఒక పాతమెస్‌కు వెళ్ళాను మర్నాడే నాకు దామిని ఉత్తరం రాసింది. ఆమెకు పిన్నిగారింట చోటు లేదట. ఆమె చెడిపోయినవారిలో జత అయిందట. తనను తీసుకుపొమ్మన్నది.

దామిని. ఆమె తల్లిదండ్రులు పోయారు. ఒకరిద్దరు తోబుట్టువు లున్నారు గాని, కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నారుట.

"అయితే ఎక్కడికి పోతావు?" అన్నాను.

"లీలానందస్వామిదగ్గిరికి," అన్న దామె.

నేను నిర్ఘాంతపోయి, "ఆయన నిన్ను మళ్ళీ రానిస్తారా?" అన్నాను.

"సంతోషంగా రానిస్తారు," అన్న దామె నిజమే అయిఉండాలి. ఆమెకు మనుషులసంగతి బాగా తెలుసు.

అప్పుడు నే నన్నాను, "నావంటివాణ్ణి చూసి పెళ్ళాడితే అనేక గడ్డు సమస్యలు సులువుగా తీరిపోతాయి."

"నీ కేమన్నా పిచ్చా, శ్రీవిలాసబాబూ? నావంటిదాన్ని పెళ్ళాడితే నీ గతి ఏమవుతుందో ఆలోచించావా?" అన్న దామె.

"ఆ భయం నీకు వద్దు నా గతి ఇంతకన్న పాడయేది లేదు," అన్నాను.

చాలాసేపు మాట్లాడుకున్నాం గాని నే నడిగినదానికి ఔననిగాని, కాదని గాని సమాధానం రాలేదు.

కలకత్తాలో నరేన్ అనే మిత్రుడు తన ఇంట్లో ఖాళీగా ఉన్న భాగంలో మమ్మల్ని తాత్కాలికంగా ఉండనిచ్చాడు. ఇంతకాలంగా న న్నెరిగినాకూడా దామిని ఇప్పుడు నన్ను కొత్తకళ్ళతో చూసి, నాలో ఎలాటి ప్రకాశం గాని ఉన్నదా అని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తూఉన్నది. అదివరకు మరొక దేదీప్యమైన కాంతి ఆమె దృష్టిని అరికట్టి ఉంచింది. కాని ఈ కలకత్తా గొందిలో నే నామె దృష్టిలో అసామాన్యుణ్ణి కావటానికి క్షణంకూడా పట్ట లేదు. నా ముఖంలో దామినికి సృష్టిలో ఉన్న సౌందర్యం కనబడసాగింది. నేను గొప్ప సాహసిని అయాను. నా సాధన అసాధ్యమైనది అయింది!

చైత్రమాసం క్షణంలాగా గడిచింది. వైశాఖమాసంలో పెళ్ళి ముహూర్తం పెట్టుకున్నాం.

పెళ్ళికి శచీశుడు రావాలనీ, అతనే కన్యాదానం చెయ్యాలనీ ఆమె పట్టు పట్టింది. అత నెక్కడుంటాడో? ఉత్తరాలు రాస్తే జవాబు లేదు. చివరకు ఇద్దరమూ వెళ్ళి, అతన్ని పట్టి కలకత్తాకు తెచ్చాం. శచీశుడు అమిత ఉత్సాహంతో పెళ్ళిపనులలో కలగజేసుకుని, నిశ్శబ్దంగా జరగవలసిన పెళ్ళిని హోరెత్తించేశాడు. మా పేటలో ఉండే సాయిబులకు పెళ్ళిమాట తెలియగానే, హైదరాబాదునుంచి ఏ నిజామో వస్తున్నంత అడావుడి చేసేశారు.

శచీశుడి కోరికపై నేనూ, దామినీ అతని ఇంటనే గృహప్రవేశం చేశాం. ఆ రోజు విందుకు అతిథి శచీశు డొక్కడే; కాని మే మా ఇంటిని హరిమోహనుడి చేతినుంచి స్వాధీనం చేసుకోవటం యజ్ఞం చేసినంత పని అయింది. ఆ యజ్ఞం మాచేత చేయించినవారు మా పేటలోని సాయిబులు. వాళ్ళు మాకు వకీళ్ళ బెడదా, కోర్టు బెడదా లేకుండా చూశారు.

నాకు లెక్చరరు ఉద్యోగం దొరికింది. నేను రెండు చేతులా సంపాదించవలసిన అవసరం ఏర్పడింది. 'నోట్సు' పుస్తకాలు రాశాను. ఈ సంపాదనంతా మా ఇద్దరికోసం కాదు. శచీశుడి భద్రతకు కావలసిన ఏర్పాట్లు చెయ్యటం మా బాధ్యత అని దామిని అనుకున్నది. దామినికి పెళ్ళి కావలసిన మేనగోడళ్ళిద్దరున్నారు. వాళ్ళ పెళ్ళిళ్ళు చేయాలి. ఆమె మేనల్లుళ్ళ చదువులకు ఏర్పాటు చేయాలి. వాళ్ళెవరూ మా ఇంట అడుగుపెట్టరు. కాని మా వల్ల ధనసహాయం పొందటానికి అభ్యంతరం చెప్పరు. ఆర్జన చాలేటట్టు లేదు. ఒక ఇంగ్లీషు పత్రికలో సబ్ ఎడిటరు పని సంపాదించాను.

మాకు జీవితం ఆనందమయంగానే సాగింది. 

# సాగర సంచిత

* కుమారి ఓగేటి ఇందిరాదేవి *





"లేఖా! లేఖా! అఖండుడల్లే వుందే ఆ కిశోర్. నీ వ్యాసానికి మళ్ళీ సమాధానం వ్రాశాడు చూడు..." శైలబాల మాటలింకా పూర్తికానేలేదు. ఒక్క ఉదుటున పత్రిక లాక్కొని కిశోర్ వ్యాసం చదవటం మొదలుపెట్టింది విద్యుల్లేఖ. ఆమె ముఖంలో క్షణక్షణానికీ ముదురుతున్న కోపారుణరాగాన్ని గమనిస్తున్నది శైలబాల. కాస్సేపటికి ఆ పత్రికను టేబిల్ మీదకు విసిరికొట్టి, "హుం, ఎలా వ్రాశాడో చూడు శైలా ఈ మహాశయుడు; కట్నాల సమస్య తీరకపోవటానికి స్త్రీలే కారణంట – మతిలేకపోతే సరి," అంటూ మునిపంటితో క్రిందిపెదవిని బిగబట్టి ఆలోచనలో పడింది లేఖ.

శైలబాల గబగబా తెల్లకాయితాలూ, కలమూ తెచ్చి టేబిల్ మీద పెట్టింది.

"లేఖా! ఆ పురుషోత్తముడి గుండెలు ఝల్లుమనేట్లుగా సమాధానం వ్రాసి పడెయ్యి. నీ వ్యాసానికి అఖిలాంధ్ర స్త్రీ జనమూ జోహారు చేయాలి," అన్నది.

శైలబాల ముఖంలోకి అపేక్షగా చూసింది లేఖ. "శైలా—నీ ప్రోత్సాహమేగనక లేకపోతే..."

"ఊఁ, లేకపోతే?... మరేం పుట్టిము న్గదుగాని తొందరగా వ్యాసం వ్రాయి;" నవ్వుతూ అక్కడినుంచి వెళ్ళిపోయింది శైలబాల.

"ఇదేమిటి లేఖా! ఇంకా వ్రాస్తూ కూర్చున్నావ్? తెల్లవారుజామునేగా మన ప్రయాణం," అంటూ హడావుడిగా వచ్చాడు సంపత్కుమార్.

"ఓ—నేను రెడీయే నబ్బాయ్. సర్దే బాధ్యతంతా మిస్ శైలబాలాదేవిమీదనే వేసుకుంది. నువ్వూ నేనూ ఆవిడగారు చెప్పినట్లు వినితీరవలసిందే," అంటూ వ్రాసుకోవటం కంటిన్యూ చేసింది లేఖ.

అసలు ఈ శైల చెవులు మెలెయ్యాల్సిందే.. పనులన్నీ తను చేస్తూ, నిన్ను కూర్చోబెట్టి వ్రాయిస్తూంటుంది," అంటూ శైలదగ్గిరికి వెళ్ళాడు సంపత్—మరి కాస్సేపటికి శైల గదిలోంచి వస్తున్న మధురమందహాసాల చిరునవ్వుల నాలకిస్తూ చిరునవ్వు నవ్వుకుంది లేఖ—ఈ ప్రయాణానికి గతమూ, అసలీ కథకు మూలమూ ఐన విషయమేమిటంటే...

* * *

"పట్టాభిరామయ్యగారి కేమండీ బంగారు పిచ్చుక. సాక్షాత్తూ ధనలక్ష్మమ్మగారి భర్త. ఆయన దానధర్మాలు చేశాడంటే చెయ్యడూ మరీ. దానకర్ణుడిలాంటివాడంటే విడ్డూరమేముందీ—" అని విద్యుల్లేఖతండ్రిని పొగుడుతూ వుంటారు చాటునే. సార్థకనామధేయ విద్యుల్లేఖ—ఆర్ట్‌కాలేజీ విద్యార్థుల కళ్లు మిరుమిట్లు గొల్పుతూ చదివి బియ్యేపరీక్షలు వ్రాసింది. ఆ పిల్లకసలు పెళ్ళిచూపులంటే గిట్టదు. పెళ్ళంటే అంతకన్నా గిట్టదు—ఒక్కగానొక్క అన్నయ్య సంపత్కుమార్, బొంబాయిలో ఇంజనీరుగా ఉద్యోగం చేస్తున్నాడు. అతనికి ధారాదత్తమైన వధువు శైలబాల—ధనలక్ష్మమ్మ పెద్దన్నయ్య కూతురు. వాళ్ళ వూళ్ళో కాలేజీ లేక పోవటంచేత కాబోయే కోడలిని తీసుకొచ్చి చదువు చెప్పిస్తున్నారు. బీ. ఎస్సీ పరీక్షలు వ్రాసింది—చదువు లైపోయాయి గదా—ఇక ఒకేసారి ఇద్దరుపిల్లల పెళ్ళిళ్లూ చేయాలని పట్టాభిరామయ్యగారూ ఆయన సతీమణీ గట్టిగా నిశ్చయించుకున్నారు. కానీ ఈ విద్యుల్లేఖ పెళ్ళి వద్దంటుందాయె—ఆమె తల్లిదండ్రులకి ఇదొక్కటే బెంగ.

ఒకరోజున ఎన్నోవిధాల చెల్లెలికి నచ్చజెప్పాలని ప్రయత్నించాడు సంపత్కుమార్ అతని ఉపన్యాసాన్ని శ్రద్ధగా మౌనంగా విన్నది లేఖ.

"ఏమిటే లేఖా! మాట్లాడవ్? చెప్పు—

ఎందుకని చేసుకోవు పెళ్ళి? ఏం చేదు ష్మెయ్యాలనీ నీ భయం?" స్పష్టంగా కోపం ధ్వనించింది సంపత్ కంఠంలో.

అప్పుడు పెదవులు కదిలించింది లేఖ- "క్షమించన్నయ్యా! నాకు మగవాళ్ళని పెళ్ళిచేసుకోవటం యిష్టం లేదు_"

కోపమంతా మర్చిపోయి నవ్వాడు సంపత్. గడప అవతలగా నుంచుని వింటున్న శైలకూడా ఒక్కసారిగా ఇది విని ఫక్కుమంది. అతిప్రయత్నం మీద నవ్వాపుకొని "అయితే ఆడపిల్లను పెళ్ళిచేసుకోటాని కే అభ్యంతరం లేదంటావ్. పత్రికల్లో ప్రకటన చేయిస్తానుండు..." అంటూ ఆగాడు.

"చదువుకు సరస్వతివి, డబ్బుకు శ్రీ మహాలక్ష్మివి, రూపానికి సాక్షాత్తూ రతీదేవివి, విద్యుల్లేఖవు _ నిన్ను చేసుకోవడానికి మగధీరులు గాజులు తొడుక్కుని, వేషం మార్చుకుని రావడానికి వెనుదీయరు," అంటూ అందుకుంది శైలబాల.

'మిగతా విషయాలమా టెట్లావున్నా డబ్బునుచూసి ఆపని చేయగలరులే యువకులు,' అనుకుంది మనసులో విద్యుల్లేఖ.

"బలేవాళ్ళు తయారయ్యా రిద్దరూ నా ప్రాణానికి _ ఒక ల్లేదన్నా అంటే రెండోవాళ్ళు దానికి తందానతాన అనటమే. అంతనవ్వు యెందుకొస్తుందో మరి. ఉండండి, నాన్నతో చెప్తాను_ మీకు అర్జెంటుగా పెళ్ళి చేసెయ్యమని _ అదేగా మీకు కావలసింది. ఆ ప్పా డు నన్ను చేసుకోమని బాధించరు _ మరే _ నాన్నా!...దీర్ఘం తీస్తూ, బుంగమూతి పెట్టుకుని తండ్రి దగ్గరికి వెళ్ళబోయింది లేఖ.

మా చిట్టితల్లికాదూ _ మా బంగారు కొండకాదూ _ నీ అమూల్యమైన అభిప్రాయముంది చూశావూ, దాన్నిమాత్రం నాన్నతో చెప్పకు. తనూ నవ్వుతారు. మా పెళ్ళి నువ్వు చెప్పకపోయినా చేసేస్తారు. కదూ శైలా!" కొంటెగా శైలముఖంలోకి చూశాడు సంపత్. చటుక్కున కళ్ళు వాల్చేసుకుని "ఏమిటా అల్లరిమాటలూ," క్రీగంటితో మందలించింది శైల.

ఆ రోజు సాయంకాలం శైలబాలా సంపత్కుమార్ ఇద్దరూ కలిసి చాలాసేపు సంప్రదించుకున్నారు విద్యుల్లేఖ వివాహం సంగతి. చర్చ పూర్తికాగానే "ఔనౌను బావా! అల్లాగే చెయ్యి. తన ఉద్దేశమదే అసలు. వాళ్ళతో కూడా మాట్లాడివుంచు." అన్నది సంతోషంతో శైలబాల.

"చిత్తం మరదలా!" అని, "నిజమే బాలా! కార్యేషు మంత్రీ కరణేషు దాసీ," అని వూరికే అనలేదు పెద్దలు.

ధర్మపత్ని గురించి అన్నారండీ పండితులవారూ ఆ మాట. మరదలి పిల్ల గురించికాదు," వేళాకోళంగా అన్నది శైలబాల.

"నిన్ను తొందరగా ధర్మపత్ని పద విలో వుంచటానికే గదటోయ్ ఈ తాప త్రయం, ఈతహతహ. చూడుకావాలి స్తే నా గుండె కొట్టుకోవడం మానేసి, నీ నామమే జపం చేస్తోంది," అంటూ ఆమె నిగనిగలాడే చెక్కిళ్ళు అరిచేతుల్లో నిలుపుకోబోయాడు.

"అదుగో లేఖ—"

ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు.

"బోల్తాకొట్టారండీ ఇంజనీరుగారూ!" అందకుండా తప్పించుకుని పారిపోయింది శైలబాల.

* * *

ధనలక్షమ్మ చిన్నతమ్ముడు విద్యాసాగర్, సంపత్ ఈడువాడే. బియ్యే పాసవగానే నౌకరీల జోలికి పోకుండా పల్లెటూరుకు వెళ్ళి వ్యవసాయం చేయిస్తున్నాడు — విద్యాసాగర్ దేశభక్తుడు. వర్ణనలప్రియుడు. దూరప్రాంతాల్లోవున్న సంపత్కుమార్‌కు తరచుగా ఉత్తరాలు వ్రాసేవాడు. ప్రతిదాంట్లోనూ ఆ పల్లెటూరూ, పంటపొలాలూ, కొబ్బరి తోటలూ, చల్లగాలీ, మల్లెపూలూ, కలువ రేకులూ మొదలైనవాటి వర్ణనలే. కొన్నాళ్ళిట్లా గడిచేసరికి సంపత్కుమార్ ఉండబట్టలేక పోయినాడుట. ఆంధ్ర భూమిమీద రెక్కలు కట్టుకుని వాలి విద్యాసాగర్‌నూ ఆ పల్లెటూరునూ చూడాలని నిశ్చయించుకున్నాడుట.

"అదేమిట్రా అబ్బాయ్! హఠాత్తుగా వచ్చేశావేం? ఏమిటి విశేషం" అని అడిగిన తల్లిదండ్రులకు పై సమాధానమే చెప్పాడు సంపత్కుమార్.

"అమ్మయ్య! ఎన్నాళ్ళకింత మంచి బుద్ధి పుట్టిందిరా నీకు — మన దేశ సౌభాగ్యానికి పట్టుకొమ్మలు గ్రామాలేరా!" అన్నాడు ముసలాయన.

"అన్నయ్యా! నాకు తెలుసులేను వ్వెందుకొచ్చావో? శైలబాలా దర్శనం కోసం ఉరకలు వేస్తున్న మనస్సుతో వచ్చావుగదూ!" అన్నది విద్యుల్లేఖ అన్నయ్య చెవిదగ్గిర చేరి.

చెల్లెలి మాటలకు చిరునవ్వు నవ్వి "ఓసి కొంటెపిల్లా! ఏం తెలిసిందే నీ కప్పుడే — పెళ్ళికొడుకుకోసం ఊరూ పల్లే తహతహలాడుతూ తిరిగినప్పుడు గానీ నాఈ ఆదుర్దా ఎట్లాంటిదో నీ కర్థం కాదు." అన్నాడప్రయత్నంగా సంపత్.

"అదుగో గుమ్మంలోకి వచ్చాడో లేదో 'పెళ్ళి పెళ్ళి' అంటూ ప్రారంభించాడు. ఇంతకుతప్ప ఇంకోమాటేలేదు;" విసురుగా అంటూ తన గదిలోకి పోయి తలుపులు బిగించుకుంది లేఖ.

* * *

అనంతా గుర్తుకొచ్చి నవ్వుకుంటూ "ఒకేదెబ్బకు రెండుపిట్టలు. 'ఏకక్రియా ద్వ్యర్థకరీ' అని అర్థం. రేపే మన ప్రయాణం— లేఖతోగూడా చెప్పు. ఏం రాణీగారూ! తమ కిష్టమేనా?" స్నానం




చేస్తూన్న సంపత్ తువ్వాలు తెస్తూన్న శైలబాలమీద నీళ్ళు చిలకరించాడు.

"అబ్బ! ఆగు బావా! ఏవిఁటో ఆనందంలో మునిగిపోతున్నట్టున్నావ్? సంస్కృతంలో ఏవిఁటో బోధిస్తున్నా రెవరికండీ ఇంజనీరుగారూ! అయ్యో! మీ కొంటెపని మూలంగా బఁగారం లాంటి నా చీరంతా తడిసిపోయింది గదా!"

"ఈ చుట్టుపట్ల కాకులూ కోకిలలూ కొండపిల్లలూ చాలా వున్నాయ్‌లే. వాటితో మాట్లాడుతున్నా - అయినా నేను నీళ్ళు చల్లుతూంటే విలాసంగా చెయ్యి అడ్డుపెట్టి 'హే ప్రభో! మోదకె స్తాదయ' అని వేడుకోవాలిగాని... ఛీ - నువ్వు నాకు తగినదానివి గావు బాలా!" గంభీరమైన పోజుపెట్టాడు సంపత్.

"నీకు చిన్నప్పుడు సంస్కృతం చెప్పించడంతో చిక్కొచ్చిందే బావా! బాబ్బాబు పండితమహాశయా! అన్నం చల్లారిపోతూంటి. ఇక చాలించండి తమ సంస్కృతమ్. అత్తయ్య ఏమేం చేశారో తెలుసా? మీ కిష్టమైనవన్నీనూ - కొబ్బరి పెరుగుపచ్చడీ.... మరేమో ఇంకా,.. అతన్ని ఊరించడానికి ఒక్క క్షణం ఆగింది.

"పొరబాటు బేలా! నాకు అంతకంటే చాలా ఇష్టమైన మనిషి వుంది. ఆ మనిషి పేరేమిటో తెలుసా?"

"సరే. మీ రిక్కడే ఆ మనిషినే

తలుచుకుంటూ కూర్చోండి భావకవి గారూ! నేనక్కడ జిలేబీతోసహా అన్నీ స్వాహా చేసేస్తూంటాను.

"ఏయ్ పిల్లా ... ఓయ్ బాలా!"

వినిపించుకోకుండా లోపలికెళ్ళిపోయిందా బాల.

* * *

ఇదండీ జరిగినకథ – అనుకున్న ప్రకారం శైలా లేఖలతో కలిసి సంపత్కుమార్ పల్లెటూరికి ప్రయాణమయ్యాడు

* * *

ఒక్కకుదుపుతో వచ్చి ఆగింది — అప్పటికే స్టాండుదగ్గిరికి బండి కట్టించుకుని వచ్చాడు విద్యాసాగర్. ధోవతి కట్టుకుని, మోచేతులవరకూ మడుచుకున్న లాల్చీ తొడుక్కుని, జరీఅంచు ఉత్తరీయం వేసుకుని అచ్చాంధ్రపురుషుడిలా, బహు హుందాగా వున్న చిన్నమామయ్యను చూసేసరికి విద్యుల్లేఖ హృదయం ఉప్పొంగిపోయింది — "చిన్నమామయ్యా! నువ్వు ధన్యుడివి – దేశసేవ ప్రత్యక్షంగా చేయగల్గుతున్న కిసాన్‌వి," అనుకుంటూ గబగబా అతని దగ్గిరికి వెళ్ళింది లేఖ. ఆప్యాయంగా పలకరించాడు సాగర్. ఇంతలోకే సంపత్ శైలా కూడా అక్కడికి వచ్చేశారు.

ముందర సునాయాసంగా బండిలోకి దూకింది శైలబాల. ఆమెకు చిన్నప్పుడు పల్లెటూళ్ళో పెరిగిన అనుభవం బాగా వుంది.

"భద్రం బుల్లెమ్మా! చిన్నాన్నగార్ని చూసిన సంబరంలో కాలు బెణికేను," పరిహాసం చేస్తూ తనూ ఎక్కేశాడు సంపత్కుమార్.

"అమ్మబాబోయ్! చిన్నమామయ్యా! ఈబండి నెట్లా ఎక్కడం?" ఖంగారుగా అడిగింది లేఖ. "ఊఁ, మరే – కాలేజీల్లో అబ్బాయిల్ని ఏడిపించటంఅంత సులభమనుకున్నావా బండీ ఎక్కడం?" ముక్కు లెగరేస్తూ చెల్లెల్ని ఎక్కిరించాడు సంపత్. "ఏం భయం లేదమ్మా! చూడూ, ఈ చక్రంమీద కాలుపెట్టి ఇట్లాయెక్కు," అంటూ తను ఎక్కిచూపించాడు సాగర్. ప్రాణా లుగ్గబట్టుకుని రెండు అకు లెక్కిందో లేదో చక్రం కొంచెం కదిలింది. కెవ్వుమంది లేఖ — క్రిందకు దిగుదామంటే భయం, పైకి యెక్కుదామంటే భయం. "ఏం ఫర్వాలేదు తల్లీ! నాచెయ్యి పట్టుకుని పైకిరా," అని చెయ్యి అందించాడు సాగర్." అమ్మయ్య! ఎట్లాగైతేనేం మామయ్య చెయ్యి ఆసరాతో బండిలోకొచ్చిపడింది – శైలా సంపత్‌లకీ పిల్ల అవస్థ చూస్తే పట్టశక్యంగాకుండా నవ్వొస్తున్నది – కానీ లేఖకింకా ఉడుకుమోత్తనం వస్తుందని అతి ప్రయత్నంమీద మొహాలు సీరియస్‌గా పెట్టుకూర్చున్నారు. మొత్తానికి ఒక పావుగంటసేపు 'శకటారోహణోత్సవం' జరిపింది విద్యుల్లేఖ.

మువ్వలు గంటలు గణగణ లాడగా

పరుగులు పెడుతున్నాయి ఎడ్లు — పరమ రమణీయమైన ప్రాతస్సంధ్యా వేళలో సుస్వచ్ఛమైన ప్రకృతి కాంత అందాలకు పరవశించిపోతూ కూర్చుంది లేఖ. ఒక గంటసేపటికి ఇంటికి చేరారు.

సుషుమ్న గబగబా ఒక కుర్చీ తెచ్చి బండిలోంచి దిగేటందుకు వీలుగా వేసింది. మనసులోనే చిన్నత్తకు వందన సహస్రా లర్పించుకుంటూ అందరికంటే ముందు తనే బండి దిగింది లేఖ — "బావున్నావా లేఖా? పరీక్ష లెట్లా వ్రాశావు? ఇంతకీ మావూరు నీకేమన్నా నచ్చుతుందంటావా?" అంటూ వరస వరసగా ప్రశ్నలు కురిపించింది, సుషుమ్న — సుషుమ్న విద్యాసాగర్ ధర్మపత్ని — పదవిచేత నేకాక రూప సౌందర్యాది విశేషాల్లో, సద్గుణసంపదలో అన్నివిధాలా ధర్మపత్నీ పదవాచ్యురాలు.

"పరీక్షలు బాగానే వ్రాశాను చిన్నత్తా! నేను చూసినంతవరకూ మీవూరు నాకు చాలా నచ్చింది — బాలసూర్యుడు ప్రసా దించే వెలుగులో కొత్త అందాలు ఒలక బోస్తున్న పచ్చని పంటపొలాల్ని చూసీ, ప్రతి యింట్లోనూ శ్రీమహాలక్ష్మల్లా దూడలతోసహా నిలిచివున్న గోమాతలను చూసీ, ముంగిళ్ళలో కళాపిచల్లి, ముగ్గులు పెట్టి, అలంకరిస్తున్న పల్లెపడుచుపిల్లల్ని చూసీ, వామనసు పులకరించిపోయింది. అంతా బాగానేవుంది కానీ ఈ యెడ్లబండి నెక్కటంమాత్రం... చాలాకష్టం."

"బావుంది — చాలా బావుంది. ఇహ ఈ అతిధులగతి పట్టించుకోరా యేమిటి ఇంటి ఇల్లాలుగారూ! కాస్త కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళూ, గొంతు తడుపు కుని ప్రాణం నిలుపుకోవడానికి ఓకప్పు వేణ్ణీళ్ళూ — ఏవీ యివ్వరన్నమాటే? ఈ కోడలుపిల్లగారి కవిత్వంలో పడితే అంతేగతి —" అంటూ ఉస్సురన్నాడు సాగర్.

చటుక్కున సిగ్గుపడిపోయి "ఇవిగో నండీ — బొక్కెనతో నీళ్ళూ చెంబూ ఇక్కడే పెట్టాను. రండి, అందరూ కాళ్లు కడుక్కుని రండి. కాఫీ తెస్తాను," అని ఆహ్వానించి లోపలికి వెళ్ళింది సుషుమ్న.

ఇంటిచుట్టూ రకరకాల పూల మొక్కలూ, దొడ్లో కూరగాయల మొక్కలూ వేసి జాగ్రత్తగా పెంచుకుం టోంది సుషుమ్న. వేణ్ణీళ్ళతో స్నానాలు చేసి తయారై తీరిగ్గా ఆ పూలమొక్కల్ని పరికించటానికి వచ్చారు లేఖా శైలా. అప్పటికే విద్యాసాగర్ సంపత్కుమార్ని తీసుకెళ్ళాడు. తను వ్యవసాయంలో నూతనంగా అమలు జరుపుతున్న పద్ధ తుల్ని చూపించటానికి. అక్కడ పొలం గట్టుమీద కూర్చుని వాళ్ళిద్దరూ చాలా సేపు సమాలోచనలు చేశారు. చివరకు చిరునవ్వులు నవ్వుకుంటూ "అలాగే చేద్దాం," అనుకున్నారు.

"మంగళం రుక్మిణీ రమణాయ శ్రీమతే, మంగళం రుక్మిణీమూర్తాయతే,"

అగరొత్తుల సువాసనలూ, శ్రీగంధపు ఘుమ ఘుమలూ, వీటితోపాటు శ్రావ్య కంఠంతో పాడే హారతీ - కలిసి ఇద్దరు కన్యల నాసికాశ్రవణకూపాల నాక్రమించేసుకున్నాయి. గబగబా వంట ఇంట్లోకి వెళ్ళారు. అక్కడి దృశ్యం వాళ్ళని ముగ్ధుల్ని చేసింది

నగిషీలు చెక్కబడి పసుపు కుంకుమ పచ్చని ఆకులతో, పూలమాలికలతో అందంగా అలంకరించబడి వుంది పూజా మండపం. అందులో శ్రీరామచంద్రుడు కోదండపాణియై, సీతాలక్ష్మణ సహితుడై, చిరునవ్వు చిందిస్తూ నిలిచిఉన్నాడు. ఆయన నుదుట కుంకుమ, మెడలో తులసి దళాలతో పువ్వులతో కట్టినమాల; చుట్టూ అత్యంత పవిత్రంగా వెలుగులు విరజిమ్ముతున్న దీపారాధన కుందులు.

నిండుగా బొట్టూ కాటుకా పెట్టుకుని ముడిలో ముద్దమందారపువ్వు తురుముకుని, లేత ఆకుపచ్చ నేత చీర కట్టుకుని, నల్లపూసలూ మంగళసూత్రాలతోపాటు పలకసర్లు పెట్టుకుని, గాజులు మధురధ్వనులు సలుపగా మంగళహారతిస్తున్నది సుషమ్న— "అమ్మాయిలూ కళ్ళ కద్దుకోండర్రా హారతి," అంటూ వాళ్ళముందుకు తెచ్చింది పళ్ళెం. నైవేద్యం పెట్టిన అరిటిపళ్లూ మామిడిపళ్ళూ కొబ్బరి ముక్కలూ తెచ్చి వాళ్ళకిచ్చి - మగవాళ్లు వచ్చేవరకూ ఆకలికి తాళలేరేమో - ఇవి తింట ఆత్మారాముడు తాత్కాలికంగానైనా శాంతిస్తాడు." అన్నది.

ప్రసాదాన్ని భక్తిగా కళ్ళకద్దుకుంటూ "ఎవరివమ్మామ్ నువ్వు - ఈ ఇంటికి లక్ష్మివా?" అని ఆర్టిస్టిక్‌గా ప్రశ్నించింది లేఖ. "ఔనమ్మా! నేను గృహలక్ష్మిని - మా యింటి కొచ్చావు గనుక నీకూ శుభా లిస్తాను." అంటూ నవ్వింది సుషమ్న — మిగిలిన పిల్ల లిద్దరూ శ్రుతి కలిపారు.

మామా అల్లు ళ్ళిద్దరూ ఇంటికి రాగానే అందరికీ కలిపి భోజనాలు వడ్డించేసింది సుషమ్న. శైల లేఖలను ఒక్కపనికూడా ముట్టుకోనివ్వడంలేదు. వేయించి వండిన కందిపప్పూ, దొడ్లో కాసిన వంకాయకూరా, ఘుమఘుమలాడే నెయ్యీ, ములక్కాడల పులుసూ, మీగడ పెరుగూ, మామిడిపళ్ళూ, పరమాన్నం — ఇవీ అనాటి భోజనపదార్థాలు. సగం భోజనం చేసేటప్పటికే అలిసిపోయారు అతిథులు. వీటికితోడు మధ్యాహ్నం ఒక నిద్రపోయి లేచాక అరిసెలూ బజ్జీలూ పనసతొనలూ పెట్టి కాఫీ యిచ్చింది సుషమ్న. "బాబోయ్! ఇహ సాయంత్రము అన్నం తినలే" మని అతిథులు గోలపెట్టేశారు–'అదేం కుదరదండీ' అని పట్టణవాసులను సుషమ్న మందలించింది. కన్నెపిల్ల లిద్దరూ సుషమ్న దగ్గిర చేరి గచ్చకాయలాడటం నేర్చుకుందామని వ్యర్థ ప్రయత్నం చేస్తున్నారు.




"ఏరా! నువు ఇందిరను తీసుకొని పారిపోయినప్పుడు ఆపిల్ల నాయన నీవెంట పడ్డాడటగా!"

"ఊరికే వెంట పడటంతో ఆగాడా! ఇంకా ఇప్పుడుకూడా మా యింటోనే వుంటున్నాడు."

---

ఇంతలో వాకిట్లోంచి కేకేశాడు సుబ్బడు—"అమ్మగోరూ! ఇయిగో మల్లెపూలు కోసుకొచ్చి కుప్పవోసినా ఈడ." అని. ఆ మల్లెపూలరాశిని చూసి గంతులు వేశారు శైలా లేఖలు.

పోడుగాటి చీపురుపుల్లలు తెచ్చి లేఖ జడ కొలుస్తూ "అన్నపూర్ణమ్మపిన్నిగార్ని పిలిచాను పూలజడ వెయ్యటానికి. శైలబాలకు రేపు వేస్తాం...అరుగో మాటల్లోనే వచ్చేసారే పిన్నిగారూ! రండి," అంటూ గౌరవంగా ఆహ్వానించిందావిడని సుషమ్న—

"లేఖంటే ఈ పిల్లేనా? చక్కటి జుట్టుంది. పూలజడేస్తే కనులపండువుగా వుంటుంది;" మురిసిపోతున్నట్లుగా అన్నది అన్నపూర్ణమ్మగారు.

"నాకొద్దు బాబోయ్ ఇంత పెద్ద దానికి జడేమిటీ?" ఖంగారు పడింది లేఖ.

"ఇప్పుడే తల్లీ వేసుకోవాల్సిన వయస్సు—పూలజడంటే భయమేమిటీ మీ బస్తీపిల్లలికి?" అన్నది అన్నపూర్ణమ్మగారు—"మరే—లేఖా! పిన్నిగారు జడేస్తేనే తక్కువని పెళ్ళైపోతుంది." అని అసలు సంగతిని విడమరచింది సుషమ్న.

"అయితే అసలే జడేయించుకోను." అని పెంకెగా అనబోయి, ఆ అన్నపూర్ణమ్మగారిని చూసి ఝడిసి మాట్లాడలేదు లేఖ.

"ఔనమ్మా లేఖా! మీ చిన్నత్త స్వానుభవంలే అది. క్రిందటి యెండాకాలంలో సుషమ్నను విద్యాసాగరం

చూడడానికి వచ్చినరోజున జడేసింది నేనేలే." అంటూ నోటినిండుగా నవ్వుతూ లేఖ జడవిప్పటం మొదలుపెట్టింది అన్నపూర్ణమ్మగారు - సన్నటి సిగ్గుతెర కదలాడింది సుషమ్న ముఖంలో.

జడ పూర్తి కాగానే ఎగాదిగా నాలుగుసార్లు విద్యుల్లేఖను పరికించి "పిన్నిగారూ! మా లేఖకు పూలజడతో చాలా అందం వచ్చింది కదండీ," అన్నది సుషమ్న.

"ఏమో, నాకట్లా అనిపించటల్లేదు."

విస్తుపోయి ఆవిడవంక చూసింది సుషమ్న.

"మీ లేఖవల్ల ఆ పూలజడకే అందం వచ్చింది," అంది అన్నపూర్ణమ్మగారు.

"భలేవారండీ మీరు," అంటూ సుషమ్న నవ్వింది. "లేఖా! ఈ ఒక్కపూటకీ నా అభిమతం ప్రకారం తయారవ్వాలి నువ్వు - శైలా! ఆ అలంకార సామగ్రినంతా లేఖకు చూపించు." అన్నది.

శైలబాల లేఖ చెయ్యి పుచ్చుకుని గబగబా తీసుకెళ్ళిం దక్కణ్ణుంచి. అభిప్రాయాలు కనిపెట్టటంలో శైల అద్వితీయమైన ప్రజ్ఞ గలది.

అన్నపూర్ణమ్మగారూ సుషమ్నా ఏమిటో నెమ్మదిగా మాట్లాడుకుని నవ్వుకుంటున్నారు.

ఇంతలో విద్యుల్లేఖ ముస్తాబుతో ప్రవేశించింది. శైలబాల ఇంకా తయారౌతోంది లోపల.

సన్నని జరీ బార్డరున్న గోధుమ రంగు పట్టుచీర కట్టుకుని అంచురంగుతో మెరిసిపోయే ఆకుపచ్చని పట్టు జాకెట్ వేసుకుని మధ్య మధ్య పచ్చలు పొదిగిన మూడుపేటల ముత్యాలనెక్లెస్ పెట్టుకుని తయారైన విద్యుల్లేఖను కన్నార్పకుండా చూశారు ప్రేక్షకు లిద్దరూ.

ముందు సుషమ్నే తెప్పరిల్లుకుని "లేఖా! కొత్తచీర కట్టుకున్నావుగదా! ముందు పెద్దముత్తైదువ అన్నపూర్ణమ్మగారికి నమస్కారం చెయ్యి," అన్నది.

తనకు వంగి నమస్కరించిన విద్యుల్లేఖను చూసి సంతృప్తితో పొంగిపోయిం దావిడ. "శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు - పుత్రపౌత్రాభివృద్ధిరస్తు." అని దీవెనలు కురిపించి లేఖను లేవనెత్తి చెక్కిళ్ళు పుణికింది.

కాస్సేపటికి వూరి సంచారానికి వేంచేసిన సాగర్ సంపత్‌లు ఊడిపడ్డారు. "సుషూ! అంతా రెడీయేనా?" అంటూ హడావుడిగా ప్రశ్నించాడు సాగర్.

"ఓ - అంతా రెడీ - అదుగో చూడండి మందారచెట్టుదగ్గిర నుంచున్న మీ అక్కగారి కూతుర్నీ. అన్నగారి కూతుర్నీనూ," అంటూ చూపించింది సుషమ్న.

"ఇంతకూ మా అక్కయ్య అదృష్ట

వంతురాలు. బంగారంలాంటి కూతురూ..."

ముఖం తుడుచుకుంటూ వచ్చిన సంపత్ అందుకున్నాడు — "ప్లాటినమ్ లాంటి కోడలూ..."

"సాగర్ మళ్ళీ అందుకుని వాక్యాన్ని పూర్తి చేశాడు. "రత్నంలాంటి కొడుకూ దొరికినందుకు."

"అసలువాళ్ళగురించి ఏమీ అనరే," మనుకుంది సుషమ్న — "తొందరగా తయారవ్వండి మీరూనూ," అంటూ భర్తను లాక్కుపోయింది.

సంపత్కుమార్ మందారచెట్టుదగ్గిరికి వచ్చాడు. చెల్లెలికి చెప్పొద్దని సైగ చేసి పొడుగాటి శైలజడను పక్కనున్న చెట్టుకు సున్నితంగా ముడివేస్తున్నాడు. లేఖకు నవ్వు ముంచుకొచ్చింది. తీరిగ్గా నవ్వుకుందామని ఇంట్లోకి పరుగెత్తింది. కానీ కించిత్తు భేదంగా అక్కడి పాఠాన్నే పఠిస్తున్నారు సుషమ్నా సాగర్‌లు. అందుకని వాకిట్లో వున్న కుర్చీలోనే కూలబడి నవ్వుకోబోయింది.

ఇంతలోకే గంభీరమైన కంఠంతో "సాగర్ ఉన్నాడాండీ?" అనే ప్రశ్న విన్పించింది.

ఉలిక్కిపడి "ఆఁ — వున్నాడు. పిలుస్తాను. మీ రిక్కడ కూచోండి — అంటూ కుర్చీ ముందుకు నెట్టింది. అతడు ఒక్క క్షణం కనులు కుంచించీ, మరుక్షణం కళ్ళు విప్పార్చీ లేఖవైపు చూశాడు —

"అబ్బ!. చాలా అందంగా వున్నాదే — ఈ పల్లె టూ శ్శో ఇంత దెక్కణ్ణుంచి వచ్చాదో!" అనుకుంటున్న విద్యుల్లేఖ అతని చూపులకు షాక్ కొట్టినట్లయిపోయి, "ఊఁ, కూచోండి—" అని చిన్నగా గద్దరించి సాగర్‌ను పిలవటానికి లోపలికి వెళ్ళబోయింది. ఇంతలో వాకిట్లోకి రానేవచ్చారు సుషమ్నా సాగర్‌లు — "ఎవరినమ్మా లేఖా, కోప్పడుతున్నావ్?" అంటూ.

ఆ వచ్చిన యువకుణ్ణి చూసి, "ఓరి కిశోర్; ఇప్పుడేనా రావటం — కులాసానా? వగైరా వగైరా కుశలప్రశ్నలన్నీ వేస్తూ సుషమ్నవైపు తిరిగి "ఇతను నా ప్రాణస్నేహితుడు కిశోర్. మన పెళ్ళికి రాలేదు. ఎమ్మే ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసై కాలేజీలో వుద్యోగం చేస్తున్నాడు. లెక్చరరుగా. కాస్త జాగ్రత్తగా సత్కారం చెయ్యి. లేకపోతే ఏదో వ్యాసం రాస్తూ మనల్నికూడా దుయ్యబడతాడు." అని పరిచయం చేశాడు. నమస్కార ప్రతినమస్కారా లయ్యాయి. "రా లేఖా! నా మిత్రుణ్ణి పరిచయం చేస్తాను," అని లేఖను పిలిచి "ఈమె మిస్ విద్యుల్లేఖ — మా అక్కయ్యగా రమ్మాయి. పురుషుల దౌర్జన్యాలను గూర్చి ఘాటుగా వ్యాసాలు వ్రాసేస్తూంటుంది — బియ్యే పరీక్షలు వ్రాసింది." అని పరిచయం చేశాడు. సాగర్ కనుతుదలు హాసరేఖలతో ఉక్కిరిబిక్కి రౌతూండగా.

"అట్లాగా - ఈ వింత పేరు నాకు సుపరిచితమేనే!" స్వగతంలో లాగా అనుకున్నాడు కిశోర్. మరునిముషంలో ఆ యువతీ యువకుల కళ్ళల్లో ఏదో చిత్రమైన భావం కదలాడటం గమనిస్తూ నవ్వుకున్నారు సుషమ్నా సాగర్‌లు.

'వరకట్న పిశాచి' అనే వ్యాసంమీద విమర్శలు వ్రాస్తున్నది మీరేనా? అతన్ని పరిశీలనగా చూసి సూటిగా ప్రశ్నించింది విద్యుల్లేఖ.

"ఇంతకీ 'వరకట్న పిశాచిని' వ్రాసింది మీరేనా?" మహా కుతూహలంగా అడిగాడు కిశోర్.

అప్పుడే వచ్చిన శైలబాల చప్పట్లు కొట్టేసింది. అంతా అర్థమైపోయింది చుట్టూ వున్నవాళ్ళందరికీ.

"ఏమిటీ! ఐతే విద్యుల్లేఖా కిశోర్‌లు పూర్వపరిచయం కలవారే నన్నమాట;" అని ఆశ్చర్యపోయారు సంపత్కుమార్ విద్యాసాగరులు.

మామిడిపండు ముక్కలు తరిగి ప్లేట్లో పెట్టుకుని తీసికొచ్చింది సుషమ్న. "తీసుకోండి రచయితగారూ!" అంటూ.

"అమ్మో! ఎదురుగుండా రచయిత్రిగారున్న సంగతి మరచిపోవద్దండోయ్_" అంటూ ఆ ప్లేటందుకున్నాడు కిశోర్.

ఆరుగురూ కలిసి విద్యాసాగరుగారి మల్లెతోటకు బయల్దేరారు. వీళ్ళని మన్మథుడి బాణాల్తో పోల్చడానికి వీల్లేదు. అవి అయిదే. వీళ్ల ఆరుగు రున్నారు మరి. విద్యుల్లేఖా సౌందర్య వాహినిలో మునకలు వేస్తూ నడుస్తున్నాడు కిశోర్. ఏతత్సౌందర్యాస్వాదనలో సహస్రాక్షుడై పోయాడు.

'ఎంతపెద్దది తోట!' దాన్ని చూస్తూనే మహాశ్చర్యపోయారు అతిధులు. ముందర ఫలభరితాలైన సపోటాచెట్లు, మామిడి చెట్లు తలలు వంచి స్వాగత మిచ్చాయి వాళ్ళకి. నిమ్మ నారింజ పనస ద్రాక్షలు ఆహ్లాదంగా పలుకరించాయి. ఆ తర్వాత ఉన్నదే మల్లెతోట. మధురమైన సాయం సంధ్యలో మల్లెపూలమీదినుంచి వీచే ఆ సౌరభాన్ని మోసుకొస్తూ ఆయాసపడుతోంది మలయానిలం. అందుకే అంత మందంగా వీస్తోందది. సూర్యభగవానుడు తన తీక్ష్ణతాపాన్ని పరిహరించుకుంటున్నాడు. ఆ వేళలో, ఆ తోటలో, ఆ స్థితిలో సంధ్యారమణీయమైన ప్రకృతి సౌందర్యానికి పరవసించి పులకరించి పోయింది లేఖాదేవి మధుమయ హృదయము. త్వరత్వరగా ముందుకు నడిచింది. గులాబీలు నందివర్ధనాలు మందారాలు సన్నజాజులు సంపెంగలు మల్లెలు అన్నీ చల్లగాలికి తలలు వూపూతూ ఆహ్వానించాయి విద్యుల్లేఖను. ఆమెనుకూడా ఒక పూబాల అనుకున్నాయవి.

విచ్చీవిచ్చని తెల్లనిమల్లెపూవులతో, నయనానంద సంధాయకమై, తరుణి చిరునవ్వులా వుంది తోట. దానిమధ్యన ఆధునికంగా తయారుచేయబడిన పూల




పొదరిల్లు. ఆ పూలపై అసంఖ్యాకంగా వాలివున్న తేనెటీగలు ఝుమ్మని లేచి ఆ తోటలోనే వున్న తమతమ పెట్టెల్లోకి వెళ్ళిపోతున్నాయి.

"తేనెపెట్టెలుకూడా పెట్టావే! తేనె తియ్యటం వచ్చునన్నమాట. ఈ తోట అంతా చాలా బావుంది. ఎంత కళామయ హృదయమోయ్ నీది," అని మెచ్చుకున్నాడు కిశోర్ సాగర్ని. ఇదంతా నా ప్రయోజకత్వమే అనుకుంటున్నావా మిత్రమా! కాదు బాబూ! అంతా ఇంటావిడగారి ప్లానే. ఎటొచ్చీ ఆవిడగారి ఆజ్ఞానిర్వాహకుణ్ణే నేను," అన్నాడు సాగరు చిలిపిగా.

కోపంగాచూసింది సుషుమ్న భర్తవైపు.

ఆ పొదరింటి పేరు పూలపల్లకి – ఆరుగురూ అందులో కూచుని సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు – తోటకాపరి వెంకన్న పనసతొనలూ చెరుకుముక్కలూ అరిటాకుల్లో పెట్టి తెచ్చాడు – కొబ్బరి బొండాలు పగలకొట్టి నీళ్ళిచ్చాడు.

"అమ్మగోరూ! మాంచి నేతతాటికాయలు కొట్టుకొత్తా రేపు – మరి ఇస్త్రీ దొరలు తింటారా?" అని అడిగాడు సుషుమ్నను.

"ఓ యస్ – మేము రెడీ – ఏవి తినటానికైనా – పెడుతూండటమే మీపని," అన్నాడు సంపత్ నవ్వుతూ.

తోటను పరిశీలనగా చూసివస్తా మని వెళ్ళారు జంటలు రెండూ చెరొక

వైపుకూ - వెంకన్న మాత్రం లేఖమ్మ గోర్ని విడిచిపెట్టకుండా కబుర్లేసుకుని కూచున్నాడు. అతని భావాల్లోని నైర్మల్యాన్నీ - మాటల్లోని యాసనూ గమనిస్తూ అప్పుడప్పుడూ ఊఁ కొడుతోంది లేఖ.

"మరండీ-శశిరేఖమ్మగోరూ! ఇంక రెండుమూడ్రోజుల్లో మన నల్లావు ఈనుద్దండీ-ఇంక చూస్కో- నా సామిరంగా!" అన్నాడు వెంకన్న సంబరంగా.

'నల్లావు ఈనితే నాకంత ఒరిగేదేమిటో,' ననుకుంటూ ప్రశ్నార్థకంగా చూసింది లేఖ.

ఈసారి రేఖమ్మగారివైఖరికి వెంకన్న చాలా దిగులుపడ్డాడు. "భలే జున్నండీ దానిది - మన సుసుమనమ్మగోరు వండితే ఇంకా బావుంటది," అన్నాడు.

"అహా - జున్నంటే నాకు చాలా యిష్టం." అంది లేఖ. వెంకన్న ముఖం చేటంతైంది.

"తాగ లెప్పుడైనా భోంచేశారా దొరసానమ్మగోరూ? రేపటాల మాంచి పాకంలో కాల్చి తవఁకు రుచిచూపిస్తానుండండి," అన్నాడు.

"ఇంకా సేపటికి జొన్నంబలి తిన్నారా? సీమచింతకాయలు తిన్నారా? అనికూడా అడుగుతాడు వెంకన్న. నిజానికి అసలు రుచిగల పదార్థాలు అవ్వే అనుకోండి. కానీ మీలాంటి సుకుమారులు..." అని అర్ధోక్తిలో ... వెనకాలే నుంచున్న కిశోర్.

గిరుక్కున వెనక్కి తిరిగి "మీరిక్కడే ఉన్నారే?" అంది వ్యంగ్యంగా.

"మరి యెక్కడుంటా ననుకున్నారు? ఇటువేపు మీ అన్నా వదినా అటువేపు మీ చిన్నమామయ్యా చిన్నత్తయ్యా తోట చూడ్డానికట వెళ్ళారు. నేను ఏ జంటవెనక వెళ్ళను చెప్పండి. మీరేమో నాతో మాట్లాడక నేపోతిరి. మీ దగ్గిరిగా కూర్చుని వెంకన్న మాటలైనా విందామంటే మీరు కోప్పడతారేమోనని భయమేసింది. అందుకనే ఇంతదూరంగా నుంచుని వింటున్నాను;" చిలిపిగా నవ్వాడు కిశోర్.

లేఖకు అత న్నేమనాలో తోచింది గాదు - కాస్సేపు ఆలోచించింది. 'వరకట్న పిశాచి'ని గూర్చి మాట్లాడదామనుకుంది. అతనంత దురుసుగా ఎందుకు వ్రాశాడో అడగాలని ప్రయత్నము.

ఇంతలోకి అతనే అడిగేశాడు - 'నా మీద కోపమా?' అని.

మృదుస్వరంతో ఆ కంఠంలో ఒలికిన లాలిత్యానికి అదోలా అయిపోయింది లేఖ. తను ఎందుకలా అయిపోతోందో అర్థంగాకముందే "ఛ - ఛ - కోపమెందుకూ?" అంది ప్రసన్న ముఖంతో, ఆకర్షణా ప్రవాహంలో కొట్టుకుని




పోతున్న మనస్సుని ఎదురీది తెచ్చుకోవాలని ప్రయత్నిస్తూ.

''అయితే అదృష్టవంతుణ్ణి.''

తనకు తెలియకుండానే సిగ్గుపడింది లేఖ. ''ఏమండీ - ఇంత మంచివారుగదా మీరు; ఆ వ్యాసా లట్లా వ్రాశారేం?" అని అడిగి చటుక్కున నాలిక కొరుక్కుంది. కాకపోతే ఎవరో ముక్కూ-మొహం ఎరుగని పురుషుణ్ణి - అందులో తన ప్రతిస్పర్ధిని పట్టుకుని 'మీరు మంచి వాళ్ళు' అనట మేమిటీ అని.

ఇది గ్రహించిన అతగాడి అధర బింబాలపై క్షణకాలం చిరునవ్వువెన్నెల చిందులాడింది.

"ఇంతకూ నేను మంచివాణ్నేగదా- పోన్లెండి - మీరు వ్రాసిన వ్యాసాన్ని బట్టే జవాబుకూడా వ్రాశాను - 'పురుషలందరూ డబ్బుకు బానిసలే - ఏ మగవాడికీ విశాలదృక్పథం లేదు - స్త్రీల నేడిపించటమే వాళ్ళపని' అని. మమ్మల్నందర్నీ కలిపి తీవ్రాతి తీవ్రంగా దుయ్యబట్టలేదూ మీరుమటుకు - అక్కడికి మీ ఆడవాళ్ళంతా మంచివాళ్ళయినట్లు!" ఉద్వేగంగా అన్నాడు కిశోర్.

"ఇప్పటికీ నా నమ్మకం అదే. చేతనైతే కాదని నిరూపించండి చూద్దాం. కష్టం వద్దనే సహృదయుణ్ని నేనింత వరకూ చూడలేదు వినలేదు!" లేఖ దృఢ స్వరంతో సమాధానం చెప్పింది.

"అట్లాంటి సహృదయు లున్నారని

నేను నిరూపిస్తాను. అంగీకరిస్తారా? నేనే మీకు నిదర్శనంగా నిలుస్తా నని ప్రతిజ్ఞ చేస్తున్నాను. సరేనా!'' ఆవేశంగా అన్నాడు కిశోర్.

"ఊరికే ఆడపిల్లల దగ్గిర ఉపన్యాసాలు దంచటంకాదు; ఉట్టుట్టి ప్రతిజ్ఞలు చెయ్యటమూకాదు. ఋజువు చేసిననాడు. అప్పుడూ...''

"ఊఁ. అప్పుడూ? అప్పు దేం చేస్తారు మీరు? దాసోహ మంటారా?" ఒళ్ళు తెలియని ఆవేశంలో ఆమె చెయ్యి పట్టుకుని అడిగాడు.

కిసలయ సుకుమారమైన ఆ జవరాలి చేయి నలిగిపోయింది. గబుక్కున చెయ్యి ఇవతలకు లాక్కుని ఒక్కవిసురున వెనక్కి తిరిగింది విద్యుల్లేఖ - ఆమె పూలజడచివర పెట్టిన బంగారపు జడకుచ్చులు 'మా యజమానురాలి చేతి కింత కష్టం కలిగిస్తావా?' అని మందలిస్తున్నట్లు సున్నితంగా అతని చెక్కిలిని స్పృశించి త్రుటికాలంలో మాయమైనాయి.

ఇదంతా వ్రాయడాని కింత సేపు పట్టిందిగాని క్షణంలో జరిగింది. జడకుచ్చుల మందలింపుతో ప్రకృతిస్థుడైనాడు కిశోర్. తన ఆవేశానికి సిగ్గుపడ్డాడు.

విద్యుల్లేఖ కాస్త దూరంగా నుంచుని "అప్పుడా? అప్పు దేం చేస్తానో చూద్దురుగా!. మీ పెళ్ళిరోజుదాకా ఓపికపట్టండి. అస లందాకా వస్తేగదా-మాట తప్పుతాననే భయంమాత్రం మీ కక్కర్లేదు. మీ పెళ్ళికి పిలవండి మరి నన్ను-హుఁ సిరిరా మోకా లొడ్డు మగవాడు ఉంటాడేమో చూడాలని నాకూ కుతూహలంగా వుంది - అయినా ఇంత ఆవేశ పరులేమిటండీ మీరు! ఉచితానుచితాలు కూడా మర్చిపోతే ప్రమాదంసుమా!'' శాంతంగా అన్నది విద్యుల్లేఖ.

"క్షమించండి," అంటూ మందహాసం చేసి "మనిద్దరికీ వైరమైనా మనచేతులకు మాత్రం సఖ్యమేనండోయ్." అదుగో మీ అన్నయ్యావా శ్వాస్తున్నారేండి," అన్నాడు కిశోరుడు.

* * *

నగరంలోని ఇంటికి తిరిగి వచ్చేశాక మరిచిపోదా మనుకుంటూనే కిశోర్ ప్రతిజ్ఞను గురించి ఆలోచిస్తోంది విద్యుల్లేఖ- "నిజంగా - అతను కట్నం లేకుండానే పెళ్ళి చేసుకుంటాడా? ఏమో చూడాలి. అతని భార్య యెట్లా వుంటుందో? ఎట్లా వుంటే నా కెందుకులే అని సరిపెట్టుకోబోయేది. మళ్ళీ కాస్సేపటికి, "ఏ ధనవంతుల ఏకైక పుత్రికనో పెళ్ళి చేసుకుంటాడేమో - వేరే కట్న మెందుకూ? అప్పుడు ఆస్తంతా తనదే ఔతుంది," మళ్ళీ ఆలోచన లతనిమీదకే మళ్ళేవి.

తల్లీ దండ్రీ యెంతో బలవంత పెట్టి, లేఖను పెళ్ళిచూపులకు ఒప్పించారు. ఎండవేటి చేంతాడంతపొడుగున పెళ్ళి




కొడుక్కూ_ పెళ్ళికీ సంబంధించిన షరతులన్నీ ఏకరువుపెట్టి వీటికి మీ రంగికరిస్తేనే పెళ్ళిచూపులకు ఒప్పుకుంటానన్నది. 'సరే' నన్నాడు తండ్రి _ పెళ్ళికుమారుడిగురించి షరతులు పెడుతున్నప్పుడు ఆ యువతి హృదయంలో సుపరిచితుడైన ఒకపురుషమూర్తి స్నిగ్ధ మధురమందహాసంతో నిండిపోయి వున్నాడు. కానీ ఆమె దాని అర్థాన్ని ఇదమిత్థంగా తెలుసుకోలేకపోతోంది. మనస్సులో మాత్రం అశాంతి. శైలబాల ఈ మనిషి అవస్థ చూసి నవ్వుకుంటూ సుషుమ్నకు ఉత్తరం వ్రాసి పడేసింది.

సాదావాయిల్ చీర కట్టుకుని రోజూ కంటే నిరాడంబరంగా తయారై తన గదిలో కూర్చుంది లేఖ. ఇంతలోకే శైలబాల సుషుమ్ననూ అన్నపూర్ణమ్మగార్నీ తీసుకుని ఆ గదిలో కొచ్చింది.

"వచ్చావా సుషుమ్నా! అని కుర్చీలోంచి దిగ్గున లేచి ప్రక్కనున్న ఆవిణ్ణి చూడంగానే అయిష్టంగా మళ్ళీ కూలబడింది_తప్పకుండా నాకు జడేయించటం కోసమే ఈవిణ్ణి తీసుకొచ్చివుంటుం దీ సుషుమ్న," అనుకుంటూ సీరియస్‌గా చూసింది సుషుమ్నవైపు.

"లేవమ్మా పెళ్ళికూతురా! అవతల ఆయన యెదురుచూస్తున్నాడు," అంటూ లేఖ చెయ్యి పుచ్చుకుంది సుషుమ్న.

"కురే _ ఆయన హృదయమే 'నే తాళలేనే' అని గోలపెడుతూ ఉండి వుంటుంది," స్వానుభవాన్ని పురస్క_

రించుకుని అంటూ, శైలబాలకూడా రెండవచెయ్యి పుచ్చుకుంది.

"సంతోషించాంగానీ చేతులు వద లండి; నేను రాగలను. అంటూ చిరాగ్గా ముందువరండాలోకి వచ్చింది లేఖ – తీరా చూస్తే అక్కడ కూర్చున్న దెవరు? ఎవరూ – విద్యాసాగర్, కిశోర్, మరో ముసలాయనా. కళ్ళు నులుముకుని మళ్ళీ చూసింది. నిజమే – కిశోర్ ఆమెవైపు చూసి మందహాసం చేశాడు – ముసలా యన విద్యుల్లేఖ నొకసారి పరిశీలనగా చూసి, బావుంది – పేరుకు తగినపిల్లే," నంటూ సంతృప్తిపడ్డాడు.

"మా అబ్బాయి మొదట్నుంచీ పిల్లను చూడక్కర్లే దంటూనే వున్నాడు. ఆ( – అన్ని విషయాలూ నచ్చినట్టే – ఆ( – అబ్బాయ్ ఏమంటావ్ ?" అంటూ కిశోర్ వైపు తిరిగా డాయన.

"అంతా బాగానే వుందండీ. కానీ కట్నం సంగతే. వీరు పాతికవే లిస్తా మంటున్నారు. యాభై వేలకు తక్కువ తీసుకోదలుచుకోలేదు నేను," అన్నాడు కిశోర్ కొనకంట విద్యుల్లేఖను చూస్తూ.

డబ్బు విషయం తర్వాత చూసు కుందాం; ముందు పిల్ల నచ్చినట్లేగదా – అమ్మాయికికూడా ఇష్టమే నంటున్నా డుగా మా సాగరం – ఇహ కుదిరిపోయి నట్లే." నవ్వాడు పట్టాభిరామయ్యగారు సంతోషంతో.

"ఊ(హూ( – కుదురనట్లే – నాకు ఆయన నచ్చలేదు." అనేసి గిరుక్కున వెనక్కు తిరిగి తనగదిలోకి వెళ్ళిపోయింది లేఖ – వెళ్ళేటప్పుడు కిశోర్ వేపుకే చూడ లేదు. కిశోరు హృదయం ఆనందంతో ఉజ్జ్వలమైంది.

సాగర్ అతనివైపు చూసి "చూశావా కిశోర్! తన ఆశయానికి పీసమెత్తు భంగం వచ్చినా సహించదు మా లేఖ. ఏ విషయంలోనూ నీకు తీసిపోదని ఋజువైంది గదా! ఇహ పదలోపలికి. మా లేఖకు సంజాయిషీ యిచ్చుకో," అంటూ కిశోరుని విద్యుల్లేఖ గదిదగ్గిరికి తీసు కెళ్ళాడు.

కాబోయే వియ్యంకు లిద్దరూ ఈ విషయమే గమనించకుండా పెళ్ళి మాటలలో పడిపోయారు.

విద్యుల్లేఖను తీవ్రంగా మందలిస్తోంది సుషమ్న. దనలక్షమ్మ "ఇహ ఈ జన్మకు పెళ్ళిచేసుకోవుటే తల్లీ! అంతా మాఖర్మ. రత్నంలా పిల్లవాడుంటే నచ్చ లేదంటావేమిటీ," అని కళ్ళనీళ్ళు పెట్టు కుంటోంది.

ఈ హడావుడి అంతా వింటూ గది గుమ్మందగ్గిరే నిలబడిపోయారు సాగర్ కిశోర్‌లు.

ఇంతలో శైలబాల గబగబా లోపలికి వెళ్ళి "అత్తయ్యా! నిన్ను మీ వియ్య పురాలు – అన్నపూర్ణమ్మగారు రమ్మం టోంది. వాకిట్లో వుం దావిడ," అంటూ అవతలివేపు వాకిట్లోంచి ధనలక్షమ్మను తీసుకెళ్ళింది.




"అన్నట్టు మీవాళ్ళకు కాఫీ టిఫిన్లేనా పంపిస్తాను లోపలికి వెళ్ళి," అంటూ వెళ్ళిపోయాడు సాగర్.

"నామాట విను లేఖా! ఈ మంకు పట్టు నీకు మంచిదికాదు; కిశోర్‌లాంటి వీరుడు మళ్ళా దొరకడు _ కట్నానికి భయపడి పెళ్ళి మానేయడానికి మన కేం ఖర్మం అసలు? యాభై వేలుకాదు ఎనభై వేలిస్తారు మీనాన్న. చెప్పు లేఖా! నీకు కిశోర్ అంటే ఇష్టం లేదూ? నా ముఖం చూసి చెప్పు _ అతను నీకు నచ్చ లేదా?" సుషుమ్న శక్తివంచన లేకుండా హితబోధ చేస్తోంది.

"సుషుమ్నా!" గర్జించింది విద్యుల్లేఖ. ఇహ నా కేం చెప్పద్దు. డబ్బు ఉంది గనక కట్నమిచ్చి పెళ్ళిచేసుకుని సుఖపడే హక్కు నా కుందన్నమాట. బీదవాళ్ళైన కన్యలు జీవితానందాన్ని పొందటానికి అనర్హులు _ అదేగా నువ్వు చెప్పేది _ ఎందుకంటే వాళ్లు కట్న మిచ్చుకోలేరు మరి. బ్రహ్మరుద్రాదులు దిగివచ్చినా సరే నేను డబ్బిచ్చి వరుణ్ణి కొనుక్కోను. ఆజన్మబ్రహ్మచర్యమైనా చేస్తానుగానీ _ హుఁ" _ కోపావేశంతో ఆమె ముఖమూ పెదవులూ వణికిపోతున్నాయి. 'ఈ కిశోర్ యెంత మోసగాడు _ ఎంత దగా

కోరు' అని మనసులో ఇందాకట్నించీ ఒకటే తపనగా వుం దామెకు.

"ఆఁ – ఆఁ – పిలిచా రాః వచ్చేవచ్చే" – నిజంగా అనత లెవరో పిలుస్తున్నట్లే గబ గబా వెళ్ళిపోయింది సుషుమ్న.

ఇది సంకేతంగా భావించి లోపలికి వచ్చాడు కిశోర్. "గుడ్ లేఖా ! నిన్నభి నందిస్తున్నాను. నమ్మిన ఉత్తమ సిద్ధాంతంకోసం నన్నే తిరస్కరించ గలిగావు. అసలు తమాషా ఏమిటో తెలుసా ? ఇది నీ కో పరీక్ష. నీ దృఢ సంకల్పాన్ని పరీక్షించడంకోసం ఆడిన అంతర్నాటకం. ఇందులోగనక నువ్వు గెలవకపోతే–అంటే నామీది యిష్టంకొద్దీ నువ్వు కట్నమివ్వటానికే ఒప్పుకుంటే నిన్ను చేసుకోవటానికి ఒప్పుకునేవాణ్ణి కాదు నేను. ఈ నాటకానికి సుషుమ్నగారు సూత్రధారిణి. ఆడపిల్లల్లో నూటికి పది మందిచొప్పున నీలాంటివాళ్ళుంటే ఈ కట్నాలసమస్య నిమిషాలమీద నశించి పోతుంది. ఊఁ, నా ప్రతిజ్ఞ నెరవేర్చు కోవడం అయిందమ్మాయ్ ! ఇప్పుడు చెప్పుమరి. నా కేమిస్తావ్ ?'' అన్నాడు. అతని పెదవుల నాశ్రయించుకుని ఎప్పటి చిరునవ్వే వెలుగులీనుతోంది.

చకితురాలై నిలబడిపోయింది లేఖ. వెంటనే తేరుకుని నమ్మలేనట్లు చూసింది.

ఇంకా అపనమ్మకం దేనికీ ? నే నిక్కడే వుంటానుగానీ నువ్వెళ్ళి సుషుమ్నా సాగర్ శైలగార్లలో ఎవ్వరి నైనాసరే అడిగిరా – సామాన్యులు కాదు బాబూ మీవాళ్ళు. నీకు పెళ్ళి చెయ్యడానికి అద్భుతమైన నాటకం ఆడారుట. నాకూ తెలీ దసలు. నిన్ననే చెప్పాడు సాగర్. నేను ఊరుకోవడ మెందుకని అంతర్నా టకం ఆడాను. అసలు నాటకానికి ప్రాతి పదిక వేసింది శైలబాలా సంప త్కుమార్‌లు – రక్తికట్టించింది సుషుమ్నా సాగర్‌లు – చివరికి ముఖ్య ఫలం సాధించిందేమో మన మిద్దర మూనూ. ఆ నలుగురు పుణ్యాత్ము లకూ మనం ఆజన్మాంతం ఋణపడి ఉండాల్సిందే. కట్నం పుచ్చుకోకూడదని నాకు సిద్ధాంత ముంది. అబ్బ ! ఎంత మందిని పెళ్ళిచూపులు చూశానో లెక్క లేదు. అందరూ నేను పెట్టిన పరీక్షలో తప్పిపోవడమే. నాకు భయమేసింది తెలుసా – ఇక మా అమ్మకు అర్హురాలైన కోడలు దొరకదేమో అని నా పూర్వ పుణ్యంచేత భాగ్యదేవతవు నువ్వు సాక్షా త్కరించావు – నువ్వేగెలిచావులే మొత్తా నికి. ఇంతకూ ఆ రోజు నీకు పూలజడ వేసి, నీ అలంకరణ చూసి మురిసిపోతూ మా అమ్మ నిన్ను ఆశీర్వదించిందిటగదా – ఆ ఆశీర్వాదఫలమే నీ గెలుపు. మాటల్లో పడి అసలుసంగతి మరిచిపోతున్నాను. ఏదీ నా బహుమతి ?" అంటూ చెయ్యి చాపాడు కిశోర్.

విస్ఫారిత నేత్రాలతో అతని విశాల హృదయంమీద చూపు లనే నల్లకలువల



మాల అలంకరిస్తూ "మీరే చెప్పారుగా దాసోహం అనమని. నన్ను నేను సమర్పించుకుంటున్నాను. ఇంతకంటే మీ సహృదయాని కేం బహుమానం యివ్వకోగలను. మగవాళ్ళల్లో నూటికి ఒక్కరైనా మీలాంటివాళ్ళుంటే ఈ ఘోర వరకట్న పిశాచం ఇంత తీవ్రంగా తాండవం చేసేది కాదు. ఎన్ని వేలమందికో మీ రొకరున్నారు — కట్నం తీసుకోకూడదనే సిద్ధాంతమున్న ఉత్తమ విద్యావంతులు. మిమ్మల్ని తప్పుగా అర్థం వేసుకున్నాను. క్షమించరూ నన్ను?" అమాయకంగా, ముగ్ధంగా అడిగింది విద్యుల్లేఖా కుమారి.

"నాకో చిన్న బహుమతి యివ్వవోయ్," అంటే ఇంత పెద్ద ఉపన్యాసం యిచ్చావేమిటీ? నాకేం అక్కర్లేదు ఈ ఉత్తుత్తి మాటలన్నీ."

"మరేం కావాలండీ బాబూ!"

"అడిగింది యిస్తావా మరి."

'ఆ — కట్నంతప్ప యేదైనాసరే;' — ఊఁ చెప్పండిమరి."

"....................."

"ఛీ — పొండి..." సిగ్గుపడిపోయి ఏంచెయ్యాలో తెలీక అతని వక్షస్థలంలో తల దాచుకుంది విద్యుల్లేఖ.




(గత సంచిక తరువాయి)

భర్త చావుకేక పెట్టి గిలగిలా తన్నుకుంటోంటే భార్య, లేచి పారిపోతోన్న ముద్దాయిని స్వయంగా చూసింది. అటో దిటోమని ఏడుస్తూ పదిమందికీ చెప్పింది. ముద్దాయి విసిరిన బాణంకూడా కోర్టువారి ఎదట వుంది.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ కథనం బలంగా సాగింది. చిలవలూ పలవలూ పేర్చి చెప్పి చెప్పి — రుమాలుతో మొహం ఒత్తుకుంటూ— "యువరానర్! ముద్దాయిమీద హత్యాభియోగాన్ని సమర్థిస్తూ ప్రభుత్వం సేకరించిన సాక్ష్యాన్ని తమముందుంచుతున్నాను. ప్రభుత్వానికి మొదటిసాక్షి హతుడి రెండోభార్య కొండమైనను పిలిపించండి," అంటూ గుమాస్తావేపు చూశాడు.

"కొండమైనా! కొండమైనా! కొండమైనా!" ముసి ముసి నవ్వులు నవ్వుతూ, అధికారంగా దీర్ఘం తీస్తూ— ఖంగు ఖంగున గంటకొట్టినట్టు మూడుసార్లు అరిచాడు కోర్టుబంట్రోతు.

కొండమైన బెదురుతూ బెదురుతూ వచ్చింది; పాదాలకి జానెడెత్తుగా రంగు రంగుల పరికిణీ కట్టుకుంది గుమ్మటంలా. మెడనిండా పూసలదండలూ— చెవులకి పెద్దపెద్ద పోగులూ — చూడటానికి కొంచెం వింతగా వుంది.

భయపడుతూ భయపడుతూ బోనెక్కి నించుంది. ఇరవై రెండేళ్ళకి మించి వుండవు. బలంగా పొంకంగా వుంది. మిలమిలా మెదులుతోన్న ఆ కళ్ళల్లో ధైర్యంగా వుండాలని చేసే ప్రయత్నం కన్పించింది.

"చెప్పు— దేవుని ఎదట ప్రమాణం చేసి నిజం చెబుతాను అనూ!" అంటూ విసుక్కున్నాడు బంట్రోతు.

కొండమైన జడ్జీకేసి దేవుడి బొమ్మని చూసినట్టు చూసింది. తలతిప్పి బంట్రోతుని పురుగుని చూసినట్టు చూస్తూ— నాలుగుముక్కలూ చిలకలా పల్కింది— "నిజవేఁ సెబ్తాను. అబద్ధ వేందుకు




సెప్పాల ?" అంటూ ఎదురుప్రశ్న వేసింది.

ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

కొండమైనకి ధైర్యం వచ్చింది– "నిజం మీకు తెల్దేటి ? తండ్రిని చంపిన దురమార్గుణ్ణి ఏంచేసినా పాపం నేదు. బలుసులమ్మకి బలివ్వాల. ఎంతగోరం– చేసిండు ! నా కల్లారా చూసినాను," అంది గబగబా.

"మిస్టర్ శంకరం ! యూ కెన్ ప్రొసీడ్ !" అంటూ ఆజ్ఞ జారీచేశారు కోర్టువారు.

"ఎస్, యువరానర్ !" అంటూ క్రాస్ ఎగ్జామినేషన్‌కి సిద్ధపడ్డాడు శంకరం.

కోర్టు హాలంతా నిశ్శబ్దమైంది. జడ్జీతో సహా అందరూ జూనియర్ శంకరాన్ని గమనిస్తూ కూర్చున్నారు.

శంకరం కొంచెం ఇబ్బందిగా గొంతు సర్దుకుని – కొండమైనకేసి చూస్తూ అన్నాడు– "చూడమ్మా ! నిన్ను నేను కొన్ని మాట లడగాలి; సరిగ్గా జవాబులు చెప్పు."

"ఏటడుగుతారో అడగండి. నాకేటి భయం ?" బింకంగా చూసింది కొండమైన.

శంకరానికి కొంచెం నవ్వొచ్చింది– "నీ కేం భయంలేదు. అందుకే సాక్ష్యం యివ్వటానికి వచ్చావు. సరే ! ఒకమాట చెప్పు. అర్ధరాత్రి బాణం వేసి పరిగెడుతోన్న వ్యక్తిని నువ్వెలా పోల్చగలిగేవు ?"

"పోల్చలేనేంటి ? నా కేం గుడ్డా ?"

"ఏమో ! ఎవర్నో చూసి పొరపడ్డావని నేనంటే ?"

[illegible] కట్టబొయ్యారడ. చచ్చిన మారాజు మాటో?– "రావుడే... రావుడే... సంపేసినాడే!" అని గావు కేక లెట్టిండుగందా?"

"మీ గూడేనికి పెత్తందా రున్నాడా?"

"ఉండడా?"

"అతని పేరేమిటి?"

"రావన్న."

"గూడెంలో అందరూ ఏవని పిలుస్తారు?"

కొండమైన కొంచెం ఆలోచించింది– "ఈ పెశళ్లన్నీ ఎందు కేంటి? నాను కళ్ళారా చూసినానుకదా?"

"నీ కళ్ళమీద నీకు నమ్మకం వుండచ్చు. మా కేం నమ్మకం? అడిగిందానికి సరిగ్గ చెప్పు. మీ పెత్తందార్ని కూడా రావుడూ అంటారుకదా?"

"అవునూ. అయితే...?"

'సమాధానాలు రాసుకుంటున్నారా లేదా,' అన్నట్టు జడ్జీకేసి చూశాడు శంకరం.

"ప్రొసీడ్ మిస్టర్ శంకరం!" కలం ఆడించాడు జడ్జీ.

శంకరం మళ్ళా సాక్షిని చూస్తూ అడిగాడు.

"నీ భర్త కో తమ్ముడున్నాడా?"

"ఉన్నాడు."

"అతని కో కొడు కున్నాడా?"

"ఉన్నాడు."

"అతని పేరేంటి?"

""రావుడే! రావులోరి పేరు."

"ఓ నెల్లాళ్ళకిందట నీ భర్తా ఆ రాముడూ మొక్కజొన్న చేలో కొట్టుకున్నారా లేదా?"

"ఓయబ్బ! ఎప్పటూసో?"

"ఎప్పటిదైతేనేం? పగబట్టటానికి అది చాలదా?"

"ఇది మరీ సోద్దెం! అప్పు దేదో మాటా మాటా వొచ్చి సెయ్యీ సెయ్యీ కలుపుకున్నారుగానీ,– నిండు పేణాలు నిలువునా తీసుకుంటాడా?"

"మరి నీ సవతికొడుకు మాత్రం తండ్రిప్రాణా లెందుకు తీస్తాడు?"

"ఆ ఎదవ వూసెత్తకండి. ఒల్లు కంపరం పుడద్ది. తండ్రిని సంపి నన్ను వల్లో పడేసుకుంద మనుకున్నాడు దుష్ట."

చూడు కొండమైనా! నువ్వే అతన్ని వల్లో వేసుకోవటానికి ప్రయత్నించావని అత నంటున్నాడు."

"ఓ లమ్మో! ఎంత నిందేసిండు!" దవడలు నొక్కుకుంది కొండమైన.

"నువ్వు నీ సవతికొడుకు గుడిసెలోకి అప్పుడప్పుడూ వెళ్తూవుంటావా లేదా?"

"ఏం? ఎత్తే ఏం? నీళ్ళు తెచ్చుకుంటానికి దారి అదే కాబట్టి ఒకసారి తొంగిచూసి 'బాగున్నావేంట్రా?' అని పలకరించి వస్తావుంటాను."

"నీభర్త చచ్చిపోయేరోజు పొద్దుట కూడా వెళ్ళావు కదూ?"



"ఏమో! యాదస్తునేదు."

"పర్వాలేదు. నెమ్మదిగా గుర్తు తెచ్చుకో. రావుడి గుడిసెలోకి వెళ్ళి 'ఆ ముసలిముండాకొడుకుతో ఏగలేను. ఎటన్నా తీసుకుపో' అని పోరుపెట్టావు. కదూ?"

"అయ్య దేవుడో! ఆడే నన్ను బలవంతం చేసిండు. 'సీ! ఎదవా!' అని లగెత్తుకొచ్చినా."

"ఇప్పుడేగా జ్ఞాపకం లేదన్నావ్?"

కొండమైన తడబడింది.

శంకరం కఠినంగా చూస్తూ అన్నాడు — "నీ సవతికొడుకు నీ మాట కాదన్నాడనే కక్షకొద్దీ ఈ అబద్ధపు సాక్ష్యం చెప్తున్నావు. సీతర్తని చంపింది ఎవడో ఇంకో రాముడై వుంటాడు. సమయం దొరికిందికదా అని ఆ నేరం ఈ అమాయకుడిమీదకి నెంటావు."

"అయ్యబాబో: ఇదే వన్నేయం!" అంటూ నెత్తిబాదుకుంది కొండమైన, శంకరం కేసి ముద్దాయిని చూసినట్టు చూస్తూ.

"దట్సాల్ యువరానర్! ఈ సాక్షిని అడగాల్సిం దేమీలేదు." అంటూ కూర్చున్నాడు శంకరం.

తర్వాత మరోరెండురోజులు ప్రాసిక్యూషన్ సాక్షుల్ని పరీక్షించాడు శంకరము. చాలావరకు ముద్దాయికి అనుకూల సాక్ష్యం సేకరించగలిగాడు. సాక్ష్యం ముగిసింది.

ఆర్గ్యుమెంటు ప్రారంభమైంది.

పబ్లిక్ ప్రాసిక్యూటరు ప్రభుత్వాభియోగాన్ని బలపరుస్తూ ముద్దాయి శిక్షార్హుడని మనవిచేసి కూర్చున్నాడు.

శంకరం ఆర్గ్యుమెంటు ముక్తసరిగా చెప్పాడు— "మే యిట్ ప్లీజ్ యువ

రానర్!...ఈ కేసుగురించి ఒక్కమాటలో చెప్పాలంటే మరో సారంగధర నాటకం."

"వెల్ సెడ్ శంకరం! వెల్ సెడ్," అన్నాడు జడ్జీ అభినందిస్తోన్నట్టు తల తాటిస్తూ.

"ముద్దాయి అమాయకుడనీ, నిర్దోషి అనీ నేను ఋజువు చెయ్యబోవటంలేదు. ప్రభుత్వాభియోగానికి సరియైన సాక్ష్యం లేదనీ - ముద్దాయే నేరస్థుడని గుచ్చి నిర్ణయించటానికి తగినంతఆధారం లేదనీ - మ రెవరేనా ఈ నేరం చేసివుండటానికి అవకాశం వుందనీ - నేను చూపించ గలిగితే చాలు."

"ఎగ్జాక్ట్లీ!...యూ ఆర్ కరెక్ట్!"

వుత్సాహంతో ప్రారంభించాడు శంకరం -

"ముద్దాయి ఈ బాణం ఎం.ఓ.వెం. 2 తో హతుణ్ణి కొట్టిచంపాడని అభియోగము. కానీ అది నూటికీ నూరుపాళ్లూ కల్పన. హతుణ్ణి చంపిన బాణం యిది మాత్రం కాదని నేను ఋజువు చెయ్యగలను," అంటూ పబ్లిక్ప్రాసిక్యూటర్ కేసి చూశాడు శంకరం.

ఆయన తల తాటించి వూరుకోవటముతో తన ఆర్గ్యుమెంటు సాగించాడు - "శవపరీక్ష చేసిన డాక్టరుగారు-'పూంచ్ సర్టిఫికెట్టు - పోస్టు మార్టమ్ రిపోర్టు' పంపిచారు. హతుడి గుండెమీద గాయం లోతు నాలుగంగుళాలు. నిటారుగా కత్తి గుచ్చినట్టు తెగిన కట్పూండ్."

"బాణంకూడా కత్తిలాగే కోస్తుంది," ఖయ్యిమన్నాడు ప్రాసిక్యూటరు.

"కానీ ఈ బాణానికి వున్న అలుగు పూర్తిగా నాలుగంగుళాలు లేదు."

"లేకపోతే నేం? బలంగా గుచ్చితే ఎంతలోతుకైనా దిగుతుంది;" మొహం చిట్లించాడు ప్రాసిక్యూటరు.

"నిజమే. కానీ ఆ దిగిన బాణాన్ని వెనక్కి లాగినప్పుడే మౌతుందో కొంచెం ఆలోచించండి. ఈ బాణము అలుగుకి రెండువైపులా చంద్రవంకలా మెలికలు తిరిగివున్నాయి మొనలు. ముద్దాయి కక్షకొద్దీ హతుడి గుండెల్లో ఈ బాణం గుచ్చినప్పుడు నాలుగంగుళాల లోతు దిగిం దనుకుందాం. ముద్దాయి పారిపోయాడు. ఎవరో వచ్చి బాణాన్ని పైకి లాగేశారు. అప్పుడేమవ్వాలి? గాయానికి రెండుపైపులా మాంసం చర్మం చీలికలై వుండాలి. లేకపోతే బాణం పైకి వూడిరాదు. కానీ గాయం అలా వున్నట్టు డాక్టరుగారి సర్టిఫికెట్టులో రాసిలేదు."

"యువర్ఆర్గ్యుమెంట్స్ వెరీగుడ్! వెరీగుడ్!" అన్నాడు జడ్జీ వికసించిన మొహంతో.

శంకరం వుత్సాహంతో విజృంభించాడు - "యువరానర్! ఇది కేవలం. ముద్దాయిమీద కక్షతో మోపబడిన నేరం.



హతుడి గుండెల్లోంచి నిజంగా వూడదీసిన బాణాన్ని తెచ్చి హతుడి దగ్గిర పెట్టారు. అనుమానం రాకుండా గాయంలోంచి కారుతోన్న రక్తం పూశారు. ఈ బాణంమీద ముద్దాయి పేరూ ఏవేవో గుర్తులూ వున్నాయి. దాన్ని ఆధారం చేసుకుని పోలీసులు ముద్దాయిని అరెస్ట్ చేశారు—

"ముద్దాయే దోషి అనటానికి ఎలాంటి ఆధారమూ లేదు. సాక్ష్యంలో ఏమాత్రం అనుమానం వచ్చినా ఆ అనుమాన ప్రయోజనాన్ని ముద్దాయికే వినియోగించాలని శాస్త్రనిబంధన. కోర్టువారు ముద్దాయిని కరుణించగలరని నా విశ్వాసం," అంటూ కొన్ని హైకోర్టు తీర్పులుకూడా వివరించి "దట్సాల్ యువరానర్!" అంటూ ముగించాడు.

ముద్దాయిని ఎంతమాత్రం కరుణించకూడదని వాదిస్తూ ప్రాసిక్యూటరు చివరి వరకూ ప్రయత్నించాడు.

నాలుగురోజుల తర్వాత తీర్పు చెప్పబడింది.

"ముద్దాయే నేరస్థుడని నిస్సందేహంగా ఋజువు కానందున ముద్దాయిని విడిచిపెట్టక తప్పదు," అంటూ తీర్పు చదివాడు జడ్జీ. చిట్టచివర శంకరాన్ని వుద్దేశిస్తూ— "మిస్టర్ శంకరం! కొంచెం వినండి," అంటూ ఆఖరిపేరా చదివాడు—

"ఈ తీర్పు ముగించేముందు నేనో విధి నిర్వర్తించాలి. ఈ కేసులో ప్రత్యేక శ్రద్ధవహించి ముద్దాయితరుపున వాదించి నిజానిజాలు చూపించి— న్యాయసిద్ధికి పాటుపడిన యువకుడు శంకరానికి నేను కృతజ్ఞత చూపిస్తున్నాను. అతడి సహా

యమే ' లేకుంటే ఈ కేసులో నేను న్యాయం సాధించలేకపోయేవాడిని. ఐ వన్స్ ఎగెయిన్ థాంక్స్ ది యంగ్ ఫ్రెండ్ మిస్టర్ శంకరం ఎట్ ది బార్ అండ్ విష్ హిజ్ సక్సెస్ ఆల్వేస్."

''థాంక్స్ యువరానర్ !" అంటూ సవినయంగా తల దించాడు శంకరం.

''కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ శంకరం!'' అంటూ చిరునవ్వుతో అభినందించాడు ప్రాసిక్యూటరు.

శంకరం పొంగిపొర్లుతోన్న సంతోషంతో – లాయర్ల సందర్శి తప్పించుకుంటూ గబగబా కోర్టు బయటికి వెళ్ళాడు.

వరండాలో తచ్చాడుతోన్న రాముడు అమాంతం వచ్చి శంకరం కాళ్ళమీద పడిపోయాడు. సాష్టాంగపడి ' పాదాలు రెండూ కళ్ళకి అద్దుకుని లేచి – మాట్లాడలేనంత కృతజ్ఞతతో దీనంగా చూస్తూ నించున్నాడు.

శంకరం వాడిచెయ్యి పట్టుకున్నాడు. లోకంలో వున్న అనాధలందరికీ తను అండగా నిలబడగల నన్నంత ధైర్యం కల్గింది.

"ఒక్కోసారి భరించలేనంత కష్టాలూ– నిందలూ వచ్చి పడతాయి. ధైర్యంగా నిలబడాలి మనం," అన్నాడు రాముణ్ణి ఓదార్చుతూ.

"దొరా! నన్ను రచ్చించినావు. భగు మంతుడివి నువ్వు.'' అన్నాడు రాముడు చెమర్చిన కళ్ళతో.

"మరేం ఫర్వాలేదు. ఇక నీ కేం భయంలేదు. తిన్నగా మీవూ రెళ్ళిపో !" అంటూ ధైర్యం చెప్పాడు.

రాముడు కాస్సేపు వూరుకుని – "సేతిలో సిల్లిగవ్వ నేదు. ఎలా ఎళ్ళమంటావు?" అన్నాడు అమాయకంగా.

"ని న్నెక్కణ్ణించి తీసుకొచ్చారో అక్కడ వదలటం పోలీసువారి డ్యూటీ! కోర్టాఫీసులో నీ దారిఖర్చులకు డబ్బిస్తారు. వెళ్ళి జడ్జీగారి గుమాస్తాని అడుగు." అంటూ రాముడికి వివరాలు చెప్పి పంపించి తను బార్ రూమ్‌లోకి వెళ్ళాడు శంకరం.

ఓ పావుగంటకల్లా రాముడు వెళ్ళినవాడు వెళ్ళినట్టే వుత్తచేతుల్తో వెతుక్కుంటూ వచ్చాడు. బొటనవేలికి రాసిన సిరా చూపించి – "కాయితంమీద అంటించి పొమ్మన్నాడు. డబ్బా గిబ్బా లేదన్నడు," అంటూ ఏడుపుమొహంతో ఆపద్బాంధవుడికి మొరపెట్టుకున్నట్టు చెప్పాడు.

శంకరానికి చాలా కోపం వచ్చింది.

రాముణ్ణి వెంటబెట్టుకుని గుమాస్తా దగ్గిరికి పెళ్ళాడు. శంకరం మాట్లాడకముందే – గుమాస్తా శంకరాన్ని నిష్ఠూరంగా చూస్తూ– "ఏవిటండీ మీరు మరీనూ. అడ్డమైనవాళ్ళకీ యిలా మప్పితే మే మెలా బ్రతకాలండీ?'' అంటూ రుస రుస లాడాడు.





"ఇంతకీ మీ రతని కివ్వాల్సిన డబ్బి స్తారా లేదా? చెప్పండి."

"వేలిముద్ర పడేశాడుగా? ఎప్పుడో యిచ్చేశాను ఫొమ్మనండీ!" అన్నాడు గుమాస్తా విర్లక్ష్యంగా.

"మీ రంతా ఆరితేరినవా ళ్ళండీ! జూనియర్లని మీ రెక్కడ ఖాతరుచేస్తారు లెండి!" అంటూ శంకరం బయటికి వచ్చేశాడు.

జేబులోంచి రెండు రూపాయలు తీసి రాముడి కిస్తూ — "అలా కాస్త బయటికి వెళ్ళి కుడివేపున భోజనాల హొటేలుంది. అన్నం తిని రా! ఈ లోపులో నేనునీ పని చూస్తాను," అంటూ గేటు దాటించి హోటలుకి దారి చూపించి వెనక్కి వచ్చాడు.

బార్‌రూమ్‌లో కూర్చుని జడ్జీ కో పిటీషన్ రాసి ఛాంబర్స్‌లోకి పంపించాడు.

అది చదివిన జడ్జీ మహోగ్రుడై గుమాస్తాని పిలిపించి ఛడామడా తిట్టి పోశాడు— "నీ వుద్యోగంకాస్తా పీకేస్తే ఎవడితో చెప్పుకుంటావయ్యా?" మహా గడ్డుప్రశ్న! గుమాస్తా కిక్కురుమన లేదు. తిట్లన్నీ కమ్మగా తిన్నాడు. తన సీటులోకి వెళ్ళి వెళ్ళగానే రాముడి దారి ఖర్చులడబ్బు బంట్రోతుతో శంకరం దగ్గిరికి పంపించేశాడు.

రాముడు కడుపునిండా తిని భారంగా నడుస్తూ వచ్చాడు — "మొదనైతే పెట్ట నండు దొరా! కాసు చూపించిన. కిమ్మనలే. తిన్నంతా పెట్టిండు," అంటూ

హోటల్లో అన్నం తిని వచ్చినందుకు ఘనకార్యం చేసినట్టు చెప్పాడు.

శంకరం చిరునవ్వు నవ్వుతూ – "పోనీలే. అసలు పెట్టాడు. ఆc, నీ డబ్బిచ్చేశారు; తీసుకో. జాగ్రత్తగా వెళ్ళు. డబ్బు జాగ్రత్తగా చూసుకో." అంటూ అప్పగింతలు చెప్పి – ఎలా వెళ్ళాలో నూరిపోసి గేటు వరకూ స్వయంగా వెళ్ళి పంపించాడు – రాముడు కన్నీళ్ళు చిప్పిల్లేంతగా మనసు వెళ్ళ బెట్టుకుని కోటిదండాలు పెట్టి మరీ కదిలాడు.

శంకరం భారంగా వెనక్కి తిరిగాడు. సీనియర్ అభినందనపరంపరలో మునిగితేలి, రూమ్ కొస్తూనే శ్యామల కో వుత్తరం రాశాడు, చేటభారతంలా. ఎప్పటికప్పుడు మనస్సంతా విప్పుకుని శ్యామలకి వుత్తరాలు రాయటంకూడా తన కర్తవ్యాలలో ఒకటి అన్నట్లుగా చేస్తాడు శంకరం.

* * *

సీనియర్ ప్రత్యేకాభిమానంతో శంకరానికి సెషన్స్ కేసులుకూడా అప్పగించటం ప్రారంభించాడు.

శంకరం విజయచరిత్రంతా శ్యామలకు తెలుసు. అయినా ఎప్పటికప్పుడు – "మీ ఆదర్శ జీవితం ఎలా వుంది ?" అంటూ ఆప్యాయతా – హాస్య ధోరణీ మేళవించి అడుగుతూవుంటుంది. నిజమే ; జీవితం అంటే ఇంతేనా ? ఏదో క్లూ దొరకబుచ్చుకుని ముద్దాయి తరుపున వాదించి కేసులు గెలిపిస్తూవుండటం ఒక్కటేనా ఆదర్శజీవితానికి నిర్వచనం? తను వ్యక్తిగతంగా ఎవరికో ఏదో చెయలేడా ? తన జీవితానికి యింకా ఏదో గొప్ప మార్పు రాదేం ?

* * *

ఆరోజుకి కోర్టు గొడవలన్నీ ముగించుకుని, కాయితాలన్నీ ఎక్కడి వక్కడ సర్ది – స్నానానికి వెళ్ళాడు శంకరం. పనికుర్రాడు కారియర్ విప్పి అన్నం వడ్డించాడు. భోజనం ముగించి కారియర్ యిచ్చి కుర్రాణ్ణి పంపించేసి గేటు వేసి తిరిగివచ్చి చీడీలమీద కూర్చున్నాడు.

వెన్నెల పుచ్చపువ్వులా వుంది.

ఆకాశం అంతా గాజుపలకలా నిర్మలంగా కాంతులీనుతోంది. చందమామకేసి చూసినకొద్దీ చూడా లనిపిస్తోంది.

శంకరం స్థిరంలేనట్టు లేచి పచార్లు సాగించాడు. మనస్సు చాలా చికాకుగా అశాంతిగా వుంది. ఒళ్ళంతా భారంగా జ్వరంవచ్చినట్టు వేడిగా వుంది. ఎవరేనా వచ్చి నవ్వుతూ హాయిగా చొరవగా మాట్లాడితే బావుండు ననిపించింది. ఎక్కడెక్కడి వాళ్ళో మనసులో మెరుపుల్లా మెరిసి మాయమౌతున్నారు. ఎప్పటెప్పటి సంఘటనలో మస్తిష్కంలో అడ్డదిడ్డంగా కొట్టుకులాడుతున్నాయి.

ఎప్పుడో చిన్నప్పుడు తిరపతయ్యే



గొడ్లసావిడి కెదురుగా చింతచెట్టెక్కి ఆడుకునేరోజుల్లో ఎర్రటిపరికిణీ కట్టుకుని పరిగెత్తుకుంటూవచ్చి చెట్టుకింద నిలబడి చింతకాయలకోసం చేతులు చాచే బంగారం ... కొట్టవచ్చినట్టు కనిపించింది కళ్ళల్లో. చిన్నప్పుడే బంగారం... నల్లగా వున్నా... నొక్కులజుట్టూ అదీ ఎంతో బావుండేది. పైటలు వేసుకుంటోన్నప్పుడు కూడా చూశాడు. చాలా అందంగా వుంది. ఇప్పుడైతే యింకా అందంగా వుంటుందేమో! పెళ్ళిగిళ్ళీ అయిపోయివుంటుంది. అవును ఆడపిల్లలకి ఎదిగీ ఎదక్కుండానే పెళ్ళిళ్ళు చేసేస్తారు.

బంగారం స్మృతి దానంతటదే మాయమై — తర్వాతెప్పుడో తను కాలేజీలో చేరిన కొత్తల్లో — వారాలు చేసుకునే రోజుల్లో — అన్నంవడ్డిస్తూ మీది మీదికి ఒంగుతూ — జడో — పైటకొంగో మీదపడేస్తూ మొహంలోకి గుచ్చి-గుచ్చి చూస్తూ — అదోలా నవ్వే ఆవిడ ... గుర్తొచ్చింది — పేరేమిటో జ్ఞాపకంలేదు. 'ఈవిడ సిగ్గుపడదేం?' అని తను చాలా ఆశ్చర్యపడేవాడు. ఆవిడ ఎందుకు సిగ్గుపడేదికాదో ఆలోచించి అర్థం చేసుకుంటేమాత్రం యిప్పుడేం ఆశ్చర్యంగా లేదు. తర్వాత్తర్వాత అలాంటి ఆడవాళ్ళని అప్పుడప్పుడూ చూస్తోనే వున్నాడు.

ఇంటర్ చదివేరోజుల్లో — ప్రాక్టికల్స్ చేస్తోన్నప్పుడు ఒక డిమాన్‌స్ట్రేటరు బల్లకి అటువైపుగా నించుని ఏవేవో

సర్దనపంత` చొరవగా చేతులమీద చేతు లేస్తూ వుండేది. ఒంగి శ్రద్ధగా డిసెక్ట్ చేస్తోంటే లేచేసరికి భుజం తగిలేలా దగ్గిరగా చూస్తూ నిలబడివుండేది!

అప్పుడంతా అవ్యామోమయం! ఎలాంటి వూహాలకీ – అపోహాలకీ తావు లేనంత పసిమనస్సు అది! ఆలోచిస్తోన్నకొద్దీ చాలా లోతులు అంతుచిక్కుతోన్నట్టు తోస్తోంది. ఒకప్పుడు అతి సహజంగా కన్పించిన అనేక సంఘటనల్లో – నిజంగా ఎంతో కృత్రిమత్వం వుంది కనీసం దాన్ని గుర్తించనైనా గుర్తించకుండా ఎన్నో ఘట్టాలు దాటవేసుకొంటూ వచ్చాడు తను

ఆలోచనలన్నీ ఎక్కడికక్కడ తెగి చిక్కులు పడుతూ మరీ చిరాకు పెట్టాయి శంకరాన్ని. ఏదో జ్ఞాపకం వచ్చినట్టు గబగబా గదిలోకి వెళ్ళి బుల్ బుల్ తెచ్చుకుని వరండా చివర వెన్నెట్లో కూర్చున్నాడు.

ఏదో గుర్తువచ్చిన పాట వాయిస్తూ చందమామలోకి గుచ్చిగుచ్చి చూస్తోంటే వెన్నెల క్షణ క్షణానికీ మరీ తెల్లగా కన్పిస్తోంది.

శంకరం అలవాటుగా పాటవెనక పాట వాయించుకుంటూ కూర్చున్నాడు.

హఠాత్తుగా శంకరందృష్టి గేటు వేపుకి మళ్ళింది. ఉలిక్కిపడి బుల్ బుల్ ఆపుచేశాడు. ఎవరో అమ్మాయి గేటు పట్టుకుని నిలబడివుంది. తెల్లటి పైట చెంగు రెపరెపా గాలిలోకి ఎగురుతోంది.

కొంచెం సిగ్గుపడ్డాడు శంకరం. ఏదో సరదాకి వచ్చీరాకుండా తను వాయించుకుంటోంటే ... ఎవరో వినటానికి రావటంకూడానా?

వాయించటం మానినా ఆ అమ్మాయి కదలలేదు. అలాగే గేటు పట్టుకుని నిలబడివుంది. ఒక్కక్షణం శంకరానికేమిచెయ్యాలో తోచలేదు. బుల్ బుల్ కిందపెట్టి లేచాడు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి గేటుకి కొంచెం దూరంగా నిలబడ్డాడు – "ఎవరు కావాలండీ?"

జవాబులేదు. అంత సంభాషణముఖీ అడిగినా మాట్లాడకుండా అలాగే నించుంది. ఇంకో అడుగు దగ్గిరికి వెళ్ళాడు – "మీకెవరైనా కావాలా?" అన్నాడు కొంచెం గట్టిగా.

ఆ అమ్మాయి తలెత్తి – కళ్ళెత్తి – శంకరం మొహంలోకి చూసింది మూగగా.

వెన్నెల్లో – తెల్లబట్టల్లో ఆమె మెడా, మొహమూ, చేతులూ సొజ్జాగ్గా మెరుస్తున్నాయి. జుట్టు బాగా లేగి గాలికి ఎగురుతోంది. జుట్టయినా సర్దుకోకుండా శంకరాన్ని తదేకంగా చూస్తోంది. అంత ఏకాంతంగా సూటిగా – ఒకమగవాణ్ణి – అపరిచితుణ్ణి చూస్తోన్నా, ఆ



చూపుల్లో సిగ్గుగానీ కలవరంగానీ కన్పిం చటంలేదు.

శంకరాని కేం తోచలేదు. ఏదో గట్టిగా అడగాలని తిన్నగా చూశాడు.

"మీరు వాయిస్తోంచే ఎంతో బావుంది;" హఠాత్తుగా అంది. నెమ్మ ఓగా స్వచ్ఛంగా అంది. ధైర్యంగా గంభీరంగా అంది.

శంకరం కొంచెం తేరుకుని— "మీరు... ఎవరికోసం వచ్చారు?" అన్నాడు.

"మీరు వాయిస్తోంటే నా కెంత బావుందనుకున్నారూ? మళ్ళా వాయించ రాదూ?" ప్రాధేయతగా చూసింది శంకరం కళ్ళలోకి.

శంకరం నిజంగా సిగ్గుపడ్డాడు.

"అప్పుడే మానేశారుగానీ కొంచెం వాయిస్తే మీ దేం పోయిందీ?" నిష్ఠూరంగా అంది తల తిప్పుతుండా.

పెద్దింటి పిల్లలా వుంది. మెడలో సన్నటి గొలుసూ, కుడిచేతి కో తెల్లరాతి వుంగరం వున్నాయి. మాటకూడా శుద్ధిగా వుంది. ఈ రాత్రివేళ యిలా ఒకర్తీ రావటం నిజంగా పాటకేనా?

ఆ అమ్మాయి అలా నిలబడేవుంది ఎదురుచూస్తూ.

శంకరాని కెందుకో భయంగానూ వుంది, ఉత్సాహంగానూ వుంది. కంగారుగా అన్నాడు— "అబ్బే! అసలు నాకు బాగా వాయించటం రాదు. ఏదో... అలా... తోచటంలేదనీ... అలా..."

ఆ అమ్మాయి కుతూహలంగా

చూసింది _ "ఓసారి నాకది చూపిస్తారా? నేను వాయిస్తే ఎలా వుంటుందో?"

"మీకూ బుల్ బుల్ వాయించటం వస్తుందా?"

"దాన్ని బుల్ బుల్ అంటారా? భలేవుంది."

తెల్లబోయాడు శంకరం. ఏమిటీ అమ్మాయి?

ఆ అమ్మాయి గేటుపట్టుకుని నించునే వుంది. ఇంత బహిరంగంగా వెన్నెల్లో గేటుదగ్గిర ఈ అమ్మాయీ _ తనూ...

"చూడండీ! ఇప్పుడు నా కేం బాగా లేదు. నిద్రొస్తోంది. మీరు యింటికి..."

"ఛీ! యింటిదగ్గి రెపరున్నారు? చక్కగా మీరు వాయిస్తోంటే వింటూ యిక్కడే వుండిపోతా."

అదిరిపడ్డాడు శంకరం. అమ్మాయి మొహంలోకి పరకాయించి చూశాడు. ఆ అమ్మాయికూడా అంతసూటిగానూ చూసింది. ఆ చూపుల్లో సహజత్వ మేమీ లేదు. జవాబుకోసం చూస్తోనేవుంది కళ్ళెత్తి.

అబ్బ! ఆ మొహంలో అందం ఎక్కువై ఆలా పెద్ద పెద్ద కళ్ళలోంచి పొంగివచ్చి తనని ముంచెత్తుతోన్నట్టు, అలా చూస్తోన్నకొద్దీ చూడబుద్ధి వేస్తోంది శంకరానికి.

హఠాత్తుగా తోచింది "ఈ అమ్మాయికి... కొంచెం ... ఏమో... అలాగే వుంది. పాపం;" అప్రయత్నంగానే గేటు తీశాడు _ "రండి."

శంకరం వెనక నెమ్మదిగా నడిచి వెళ్ళింది. కంగారుగా వరండా లైటు వేశాడు శంకరం. గబగబా గదిలోంచి చాప తెచ్చి గేటు ఎదరగా వరండాలో పరిచాడు. చెప్పకుండానే చాపమీద కూర్చుంది.

"మీ పేరేమిటి?" అమ్మాయిని ధైర్యంగా మాటల్లోకి దించాలని బుల్ బుల్ ఒళ్ళోకి తీసుకుంటూ అడిగాడు శంకరం.

"మీ పేరో?" నిర్లక్ష్యంగా అడిగింది.

"నాపేరా? _ శంకర్!"

"శంకరా? శంక రేవిటి? టింకర్ లాగా? రామూ అయితే బావుంటుంది."

ఒక్కక్షణం ఆ అమ్మాయికేసి నిదానంగా చూసి _

"మీ పేరేమిటో చెప్ప లేదేం?" అన్నాడు అనునయంగా.

"నా పేరు... గృహలక్ష్మి!"

తెల్లబోయాడు శంకరం. నమ్మబుద్ధి కాలేదు.

"ఛీ! గృహలక్ష్మి కాదండీ! అబ్బ!... నా పేరేమిటో గుర్తురావటం లేదు." మొహమంతా చిట్లించుకొంటూ విసుక్కుంది.

శంకరం జాలిగా చూశాడు. ఇంత చిన్న వయస్సులో ఏమిటీ ప్రారబ్ధం? ఎంత దురదృష్టవంతురాలు! శంకరం చంటిపిల్లన్ని చూసినట్లు ఆ అమ్మాయిని అభిమానంగా చూస్తూ వుండిపోయాడు.



''వాయించరేం?'' చూసి చూసి నిర్మోహమాటంగా చిరాకుపడింది అమ్మాయి.

శంకర తేరుకొని బుల్‌బుల్ మెట్లు నొక్కుతూ ఓ సినిమాపాట ప్రారంభించాడు. వాయించిందే వాయిస్తూ ఐదారు నిముషాలవరకూ కాలం దొర్లించాడు.

అంత సేపూ నిశ్శబ్దంగానే కూర్చుంది అమ్మాయి. పాట అయినా వెంటనే ఒక్కసారి అమ్మాయికేసి చూసి మరో పాట ఎత్తుకున్నాడు.

అమ్మాయి సగంలో లేచి నించుంది హఠాత్తుగా.

"నేను వెళ్ళిపోతాలెండి."

తెల్లబోయాడు శంకరం - "వెళ్ళిపోతారా? పాట వింటానన్నారుగా?"

"వద్దులెండి. నాకేం బాగాలేదు.' గబగబా మెట్లుదిగి చకచకా నడుస్తూ గేట దగ్గిరికి వెళ్ళిపోయింది.

"ఉండండి, వుండండి; నేను వస్తున్నా."

బుల్‌బుల్ మంచంమీద పడేసి - గది తలుపులు వేసి తాళం నొక్కి పరుగులాంటి నడకతో వెంటబడ్డాడు శంకరం. అ అమ్మాయి ఎక్కడా ఆగకుండా ఒక్క మాటకూడా మాట్లాడకుండా నడిచి పోతోనేవుంది. శంకరంకూడా మౌనంగ నడక సాగించాడు.

హఠాత్తుగా ఆగింది - "అదీ! జ్ఞాపకం వచ్చిందండీ! నాపేరు భారతలక్ష్మి." అంది శంకరాన్ని చూస్తూ. "ఏం నాపేరు బావుందా?"

"బావుందండీ! చాలా బావుంది."

ఆ పేరుకూడా నమ్మలేదు శంకరం.

"మీరు మళ్ళా ఓ మంచి పాట వాయించరాదూ?"

"అబ్బే! మనం చాలా దూరం వచ్చేశాం."

"అయితేమాత్రం...?"

"రేపు వాయిస్తారెండి."

"నాకూడా నేర్పరాదూ?"

"అలాగే."

అయిష్టంగానే కదిలింది.

సందు మలుపు తిరిగి మెయిన్ రోడ్డు ఎక్కేసరికి జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు, సినిమాకబుర్లు చెప్పుకొంటూ.

థియేటర్ ముందునుంచి వెళ్తోంటే లైట్లకేసి చూస్తూ మళ్ళా ఆగి – "నే నీ సినిమా చూళ్ళేదండీ! మనమిద్దరం సినిమా కెళ్దామా?" అంది ఆసక్తిగా.

శంకరం కంగారుపడ్డాడు. అటూ యిటూ చూశాడు. జనం కిటకిటలాడుతూ ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ నడుస్తున్నారు. తెలిసినవాళ్ళెవరూ కనపడలేదు.

"సినిమాకి ... మన మిద్దరం వెళ్తే బావుండదు. రేపు వెళ్ళండి మీరు," అన్నాడు కొంచెం విసుగ్గా.

ఆ అమ్మాయి ఎగాదిగా చూసింది. మొహం తిప్పుకుని లైట్లకేసీ, సినిమా బొమ్మలకేసీ చూస్తూ నించుంది.

"చూడండి ... అయినా నాదగ్గిర డబ్బులు లేవుగా?" శంకరం కొంచెం నెమ్మదిగా మృదువుగా అన్నాడు.

"డబ్బుల్లేవూ?...అలా చెప్పరేం?" అంటూ కదిలింది.

శంకరం కడుపునిండా గాలి పీల్చుకున్నాడు.

ఆ అమ్మాయి మళ్ళా ఆగి – డబ్బులెందుకులేవూ? మీరు మగవాళ్ళుకదా!" అంది ఆశ్చర్యపోతూ.

"పర్సు రూమ్‌లో వుండిపోయిందిగా! తీసుకోకుండా వచ్చేశాను;" మాట మారుస్తూ, "మీ యిల్లింకా ఎంత దూరం?" వీథిపొడుగునా చూస్తూ అడిగాడు శంకరం.

"అన్నట్టు మీ రెందుకొస్తున్నారూ?" కొత్తగా విస్తుపోయింది.

శంకరం తడబడ్డాడు – "అబ్బే; ఏం లేదు. మీకొంచెం...సాయంగా..."

"ఛీ! నాకెందుకూ సాయం! నే నేం పాపాయినా? కావాలంటే మీ యింటిదాకా సాయం వస్తా పదండి. మి మ్మల్ని



దిగబెట్టి వచ్చేస్తా," అంటూ వెనక్కి తిరిగింది.

"అబ్బే! అదికాదండీ! మీకు సాయం కాదు. మీయిల్లు చూద్దామనీ..."

"మా యిల్లేం చూస్తారు? మీ యిల్లు లాగానే వుంటుందిగానీ మాయిల్లేం తల్ల కిందులుగా వుంటుందా?''

శంకరాని కేం తోచలేదు.

ఆ అమ్మాయి ఒక్కడుగు కూడా ముందుకు వెయ్యటంలేదు. ఖరాగా నించుంది.

"అయితే...నన్ను...వెళ్ళిపొమ్మం టారా?...సరే! జాగ్రత్తగా వెళ్ళండి, అంటూ వెనక్కి తిరిగాడు.

"పోనీలెండి. మా యిల్లు చూపిస్తా ఇక్కడేగా? రండి." అంటూ అ కారంగా పిల్చింది.

శంకరం వెనక్కి వచ్చాడు.

ఆ అమ్మాయి చకచకా నడ సాగించింది, శంకరం వస్తున్నాడో లే వెనక్కి తిరిగి చూస్తూ.

ఓ ఫర్లాంగు దూరంలో హఠాత్తు ఓ యింటిముందాగి ... చొరవగా త పులు గెంటుకుని లోపలికి వెళ్ళిపోయిం

(సశేష




ాలుపెత్తు తలుపులు. ముందుకు పొడు చుకువచ్చిన లోహపు కొమ్ములు. ాకక్షణం ప్రసాదరావు ఆ గుమ్మం ముందు. నిలబడిపోయాడు. మత్తగజమైనా భేదించలేని ఆ యినుప తలుపులు, ఆ తలుపులకు అమర్చిన సూదైన

కొమ్ములు చూస్తూఉంటే, అతనికి ఏదో క్రొత్త ప్రదేశంలో ఉన్నట్లుగా ఉంది. విస్పష్టం కాని ఏదో అనుభూతి అతనిలో కదలి, ఒళ్లు గగుర్పొడిచింది.

ఆ గుమ్మానికి ఒక మూలగా ఉన్న చిన్న తలుపు తెరచుకుని, జైలర్ చిరునవ్వు ముఖంతో కనిపించిన తరువాత గానీ ప్రసాదరావుకు తెలివి రాలేదు. జైలర్ నవ్వుతూ, "గుడ్మార్నింగ్ సార్!" అన్నాడు. అతను ప్రతిగా శుభోదయం పలికి "సూపర్నెంటు ఉన్నారు గదా!" అని అడిగాడు.

"మీకోసమే ఎదురు చూస్తున్నారు సార్!" అన్నాడు జైలర్.

ప్రసాదరావు ఆ చిన్న తలుపు తెరచిన సందునుండా లోపలికి అడుగు పెట్టాడు. రెండడుగులు ముందుకు నడిచి, క్రొత్తగా కన్పిస్తున్న జైలు కాంపౌండు నలు దిశలా దృష్టి సారించాడు.

జైలర్ తన్కున తలుపు మూయగానే ప్రసాదరావు ఉలిక్కిపడ్డాడు. వెనుదిరిగి మళ్ళీ వింతగా కోటగుమ్మం వంటి ఆ గుమ్మం వెంపూ, గాజు ముక్కలతో కర్కశంగా కన్పిస్తున్న ఎత్తైన గోడవంకా, నిశ్శబ్దంగా... తప్పు చేసిన మనిషిమాదిరి వెలవెల బోతున్న లోపలి జైలు వైపూ చూచాడు. తను జైలర్ నుంచి జైలు సూపరింటెండెంటుగా ప్రమోషన్ అయి, ఛార్జి తీసుకోవలసిన రోజున జైలు తన కంటికి ఇట్లా విచిత్రంగా కనిపిస్తుందనుకోలేదు. అంతేకాదు, ఈ ఎత్తైన తలుపులూ, గాజు పెంకుల గోడలూ, ఇనప ఊచల కొట్లూ, మానవుడిని నిర్దాక్షిణ్యంగా బంధించి వేస్తున్న ఈ చిత్రదృశ్యం అతనికి ఎంతైనా అనుభూతిని ప్రసాదిస్తున్నది.

ప్రస్తుతం సూపర్నెంటుగా వున్న వ్యక్తికి పరదేశ యాత్రావకాశం కలగడంతో జైలర్లలో సీనియరైన ప్రసాదరావుకు ప్రమోషన్‌పై కొత్త జైలుకు బదిలీ అయింది.

గది గుమ్మంలో నిలబడగానే, లోపలనుంచి సూపర్నెంటు, తీయని కంఠస్వరంతో — "హల్లో! కొత్త సూపర్నెంటుగారూ! రండి-రండి!" అని స్వాగతవచనాలు పలికారు. ప్రసాదరావు ఆయనకు నమస్కరించాడు. రెండడుగులు నడిచి, గది గోడలు పరికించి — "నేను రావడం కొంచెం ఆలస్యమైందనుకుంటాను," అన్నాడు, వినయం ఉట్టిపడే కంఠస్వరంతో.

లేదన్నట్లుగా తలాడించాడాయన. కొత్తగా తన స్థానంలో అడుగిడబోతున్న అతని భుజంపై ఆదరంగా చేయివేసి, "ప్రసాదరావుగారూ! మరి

ఒక్కసారి పైలురౌండ్ కొట్టివచ్చి, ఛార్జ్ తీసుకోవచ్చు," అన్నాడు.

ప్రసాదరావు మౌనంగా కుర్చీలో కూచున్నాడు మాటలు రానివాడి మాదిరి ఆయన ముఖంలో దృష్టి నిలిపి రెండు క్షణాలు గడిపాడు. తరువాత మెల్లగా—"ఉదయంనించీ నా ఎడమ కన్ను అదిరిపోతూ ఉందండీ! ఏదో భయం మనసంతా అలుముకొని, చాలా కొత్తవిధమైన అనుభూతిని కలుగజేస్తూఉంది. ఈవేళ ఏదో విశేషం జరిగేటట్లే ఉంది," అన్నాడు.

ఈ మాటలు వింటూనే సూపర్నెంటు విరగబడి నవ్వాడు. అతని నవ్వు చిత్రంగా, సుడులు తిరుగుతూ, ఆ గది గోడలమధ్య ప్రతిధ్వనించి పోయింది. రెండు క్షణాలు గుడ్లప్పగించి సూపర్నెంటును చూచాడు ప్రసాదరావు. ఆ క్షణంలో అతని కంటికి ఆయన యమధర్మరాజులాగా, మానవ రూపాన్ని ధరించిన రాక్షస రాజు మాదిరి కన్పించాడు.

"మీరు భలే చిత్రంగా చెబుతున్నారు. ఎడమకన్నదిరితేనేం-కుడికన్నదిరితేనేం; అసలు అటువంటివి పట్టించుకుంటే మన బతుకు సాగినట్లే," అన్నాడు సూపర్నెంటు.

ఆ రోజు చార్జి తీసుకోవడం ప్రసాదరావుకు యిష్టంగా లేదు. అయినా తప్పనిసరి. ఆయన ఆ రోజే రిలీవై పోవాలి.

"చార్జి కాగితాలు సైపు చేయించారా?"

ప్రసాదరావు ప్రశ్నకు ఆయన పాజిటివ్ గా సమాధానం యివ్వగానే, "అయితే చార్జి తీసుకున్న తరువాత రౌండ్ కొడదాం," అన్నాడు ప్రసాదరావు

సూపర్నెంటు కుర్చీలో కూర్చుని, ఫైలు బయటికి లాగి, నాలుగు కాగితాలు తీశాడు. ఓ పది నిమిషాల పర్యంతం ఆయన ఏదో విషయాలు - చెప్పవలసిన వన్నీ - ప్రసాదరావుకు చెప్పాడు. ఆయన చెప్పిన వన్నీ మౌనంగా వింటున్నాడే గాని అతనికి మనసు నిలవడం లేదు. చిత్రమైన ఆత్రుత దేహమంతా అలుముకొని మనసును డోలాందోళితం చేస్తున్నది. తెలియరాని పిచ్చిఆలోచనలు అస్పష్టంగా దూరంగా అగుపించి మాయమౌతున్నాయి.

చివరిమాటలు చెబుతూ— "మీ బాధ్యత గుర్తించి ప్రవర్తిస్తే-యిబ్బందులేమీ ఉండవు. పాక్షిక బుద్ధి ఎంతమాత్రమూ లేక, నిమిత్తమాత్రంగా మీ ధర్మాన్ని నిర్వర్తించుకుపోతే, మీ దారికి మరి అడ్డేమీ నిలవదు. ఇంతకన్న నే నేం చెప్పగలను!" అనేసి, ఆయన ముగించాడు. ప్రసాదరావు




నిట్టూర్చాడు. సూపర్నెంటు వంక యిబ్బందిగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

ఇద్దరూ లేచారు. జైలర్ వారి ననుసరించాడు. ఒక్కొక్క గది చూసుకుంటూ వాళ్ళిద్దరూ ముందుకు నడవసాగారు. ఎన్నడూ చూడని ఒక కొత్త లోకంలో నడయాడుతున్నట్లుగా అనుభూతి నందుతున్న ప్రసాదరావు సూపర్నెంటుతో వేగంగా నడవలేకపోతున్నాడు. ఆయన యిది గమనించి, చటుక్కున ఆగి, "ఏమండీ! మీ రేదో ఫీల్ అవుతున్నారు. ఏమిటి - కొంచెం చెబుతారా!" అని అడిగాడు.

ప్రసాదరావు నవ్వలేదు ఆయన ముఖంలోకి చూచి, ఏం జరిగిందా అని ఆలోచించాడు. ఏముంది ఏం జరగలేదు. క్రొత్త ఉద్యోగంలోనికి ప్రవేశిస్తున్నానన్న ఉత్సాహంతో కనులు విప్పిన అతనికి లోకం నవవధువులా కన్పించింది బాలభాస్కరుని లేతకిరణాలు ప్రకృతిని గిలిగింతలు పెట్టి, క్రొత్త అందాలను చూపించాయి. కాని, బయలుదేరే వేళకు ఎడమకన్ను ఎక్కువగా అదరింది. ఇప్పటికీ అదరుతూనే ఉంది. అంతేగాక ఎవరో విధవావిడ ఎదురు. జైలులో ప్రవేశిస్తూండగా గుండె దడదడ లాడింది.

"సహజంగా నే పిరికివాడిని కాదు.

కాని, ఎందుకో చెప్పలేనంతగా ఆత్రం కలుగుతోంది. ఉదయం నించీ చెప్పుకో దగ్గ సంఘట నేమీ జరగనేలేదు," అన్నాడు మెల్లగా ప్రసాదరావు.

సూపరెంటెంటు అతన్ని సానుభూతితో చూచాడు.

భుజంమీద చేయి వేసి, "ఖులాసా తెచ్చుకోండి! ఒక్కోసారి అనవసరంగానే భయపడిపోతూఉంటాం. శకునాలపై నమ్మకం పెట్టుకోడం ఏమంత మంచిది కాదు," అని, "నడవండి — కాస్సేపు రిక్రియేషన్ రూమ్‌లో కూచుందాం," అన్నాడు.

రిక్రియేషన్ గది చాలా చిన్నది టేబిల్ చుట్టూ నాలుగు కుర్చీలూ— ఒక మూలగా క్యారమ్‌బోర్డూ—

"మీకు క్యారమ్స్ వచ్చుగదా!" అడిగా డాయన.

ఇద్దరూ క్యారమ్స్ ఆడేందుకు కూర్చున్నారు. ఈ లోగా జైలర్ కాఫీలు పట్టించుకొచ్చాడు. కాఫీ త్రాగి, సేదదీరిన తరువాత, తనకు సహజమైన చలాకీతనంతో—"రండి సార్! మిగత జైలుభాగ మంతా చూచినద్దాం," అన్నాడు ప్రసాదరావు.

ఇద్దరూ తిరిగి బయలుదేరారు. ఖైదీల గదులన్నీ చూచారు. అంత వరకూ ప్రసాదరావులో లేచిన ఆత్రం అణగిపోయి, ఆలోచనలు రేకెత్తాయి. ఆ క్షణంనుండీ జైలుబాధ్యత లన్నీ అతనివే గనుక ప్రసాదరావు తన కప్పగింపబడిన ఫైళ్ళ గురించి ఆలోచిస్తున్నాడు. ఖైదీల నందరినీ అతను పరికించి చూడలేదు.

జైలంతా తిరిగి వారు—ఆవరణలో ఒక మూలగా ప్రత్యేకంగా ఉన్న ఉరిశిక్షా ప్రదేశానికి తిరిగివచ్చారు. అక్కడికి రాగానే, అంతవరకూ ఏవేవో విషయాలను వివరించి చెబుతున్న సూపరెంటెంటు కొన్ని క్షణాలు మౌనం వహించాడు. ఆ గది ఖాళీగా వుంది. ఒక మూలగా ఉరిశిక్ష అమలుపరచే సాధనాలన్నీ భద్రంచేయబడిఉన్నాయి. గది మధ్యగా లోతైన గోయి ఉంది.

"ప్రసాదరావుగారూ! ఈ గది గురించి నేను చెప్పవలసిం దేముంది! మీకే తెలుసు," అన్నా డాయన.

ప్రసాదరావు గది నొకసారి పరికించాడు.

"ఎక్కువ సేపు ఇక్కడ నిలబడలేను. రండి—వెడదాం," అన్నాడు సూపరెంటెంటు.

బాధ్యతల నన్నింటినీ ప్రసాదరావు భుజంమీద వేసి, సూపరెంటెంటు వెళ్ళిపోయాడు. ఆఫీసుగదిలో ప్రసాదరావొక్కడే కూర్చుండిపోయాడు. అతనికి ఆ కొత్తగదిలో ఊపిరాడలేదు. మెల్లగా నడుచుకుంటూ రిక్రియేషన్ రూంలోకి వచ్చి కూచున్నాడు. స్ట్రైకర్‌తో బ్లాక్‌ను గట్టిగా కొట్టాడు.



అది ఎదురుగ్గా వున్న రిమ్‌ను తాకి, వెనగ్గా వచ్చి, తలుపు నొకదాన్ని చిందరవందర జేసి హాల్‌లో పడిపోయింది.

ప్రసాదరావు మెల్లగా కాళ్లు కదుపుతూ గదిని పరికించాడు. ఒక మూలగా చుట్ట చుట్టబడి నిలబడి ఉన్న షామియానా అతని కళ్ళ బడింది.

షామియానా! రంగు రంగుల అందమైన పాత షామియానా! ఆ షామియానా మీదినుండి అతని దృష్టి మారలేదు.

“షామియానా!” అని గొణుకున్నా డతను.

కూచున్న ప్రసాదరావు లేచి నిలబడ్డాడు. మెత్తగా షామియానాను స్పృశించాడు. అతని వేళ్ళక్రింద పాత షామియానా మెల్లగా కదిలింది.

అతనికి షామియానాను చూస్తే పెళ్లి జ్ఞాపకం వస్తుంది అతను పెళ్ళి చేసుకో

లేదు. పెళ్ళంటేఅసహ్యం ప్రసాద రావుకు. తండ్రి పదేపదే పెళ్ళి చేసుకో మని చెప్పినా అతను వినిపించుకోలేదు.

ప్రసాదరావుకు బాల్యం గుర్తుకు వచ్చింది. అతని తండ్రికి షామియానా అంటే చాలా యిష్టం. అందుకే, కూతురు వివాహానికి ఆయన కొబ్బరి ఆకుల పందిరి బదులు షామియానా వేయించారు. అతనికి బాగా గుర్తు— 'షామియానా' ను చూచి అదేమిటో అడిగినప్పుడు, అతని తండ్రి నవ్వుతూ "దీన్ని షామియానా అంటార్రా" అని, "ఏదీ, నువ్వను చూద్దాం," అన్నాడు. తన కా మాట నోరు తిరగలేదు. అస్తవ్యస్తంగా పలికినప్పుడు, విన్న వాళ్లు నవ్వారు.

పెద్దెదిగిన తరువాత ఎప్పుడేనా షామియానా కళ్ళబడితే—అతనికి చిన్న నాటి ఈ సంఘటన గుర్తుకు వస్తుంది వెనువెంటనే అక్కయ్య పెళ్లికూడా!

అక్కయ్య పెళ్లినాటి కింకా అతనికి ఊహ రాలేదు. వెర్రి ఉత్సాహంతో ఆ బాల్యంలో అతను పెళ్లిరోజున ఎన్నెన్నో గమ్మత్తులు చేశాడు.

కాబోయే బావగారిని కాల్చుకు తిన్నాడు. విడిదిలో జనం తన పేరెత్తి తేనే హడలిపోయేలా చేశాడు. తను ఇంత అల్లరిపిడుగని అతనికే అంతకు ముందు తెలియదు.

పెళ్లికొడుకు మెల్లగా తనను చేర బిలిచి, "బావగారూ! సీమటపా కాయ లాగా ఇలా పేలిపోతుంటే ఎట్లా? మరీ యింత అల్లరి చేయకూడ," దనితనను బుజ్జగించడం అతనికి బాగా గుర్తుంది.

అప్పట్లో—తండ్రి చాల సంపాదించి, నిలవచేశాడు. జగద్వ్యాపారానికి మూలసూత్రమైన ధనం ఇంధనంగా పనిచేసి ఆయన పరువు ప్రతిష్టలను పెంచింది. ఆయన పేరు రఘురా మయ్య. ఇద్దరే బిడ్డలు—కూతురు, కొడుకు. ఒక్కగా నొక్క కూతురు గనుక అపురూపంగా పెళ్ళి జరిపించా లని అనుకున్నా డాయన. కలవారికిచ్చి చేస్తే, కన్నకూతురు కలకాలం కల కల లాడుతూ కాపురం చేస్తుందని తలంచా రాయన. ఆస్థిలో సగం కట్నంగా యిచ్చి, వైభవోపేతంగా వివాహం ఏర్పాటు చేయించారు.

షామియానా వెనుక దాగిన కథ నంతా జ్ఞాపకం చేసుకుంటూ ఉంటే, ఎదురుగ్గా జైలర్ ప్రత్యక్షమయ్యాడు. ఆలోచనల గొలుసు తెగిపోయింది. ఒకింత చిరాగ్గా! చూచాడు ప్రసాదరావు

"క్షమించండి, ఒక ముఖ్యమైన విషయం చెప్పడం మరచిపోయాను. సూపర్నెంటుగారుకూడా హడా విడిలో మఱచిపోయినట్టున్నారు..." అని ఆగాడు జైలర్. ప్రసాదరావు అతనిమీదనే దృష్టి నిలిపాడు.




"ప్రియా ! నిన్ను పెళ్ళాడనని చెప్పటానికి నాకు నోరాడటంలేదు. ఈ కేసు విస్కీ యిచ్చిపోతున్నాను. నన్ను మర్చిపోవటానికి ప్రయత్నించు !"

"ఈ రోజు సాయంకాలం నాలుగు గంటలకు ఒక ఉరిశిక్షను అమలు జరుపవలసిఉంది."

ఉలిక్కిపడ్డాడు ప్రసాదరావు.

"ఉరిశిక్షకు సంబంధించిన ఫైలు ఆఫీసుగదిలో టేబిల్ మీదే ఉంది..."

సూపరెన్టెంటు ఎడమకన్ను అదిరింది. అతను గడియారం వంక చూచాడు. మూడు గంటల ఇరవై అయిదు నిమిషాలు.

"నాలుగు గంటలకా?" అడిగాడు.

"యస్ సర్ ! మీరు ఆ ఫైలును ఒకసారి చూస్తే..."

జైలర్ మాట పూర్తి కాకుండానే ప్రసాదరావు లేచి నిలుచున్నాడు. రెండడుగులు ముందుకు నడిచి, ఆగాడు.

"ఫైలంతా పరిశీలించేందుకు వేళ లేదు. అన్ని ఏర్పాట్లూ చేయించండి," అన్నాడు.

చిరునవ్వుతో-"ఏర్పాట్లన్నీ చేయించాను సార్ ! మరో పది నిమిషాల్లో డాక్టరు వస్తారు. అంతా రెడీ!" అన్నాడు జైలర్.

జైలర్ చిరునవ్వు అతనికి సహించలేదు. ఉరిశిక్షా వ్యాపారంలో చిరున

వ్వేమిటి? మృత్యువు కబళించ పోతున్న ఒక అమాయకుని వెంపు చూచి, అతని అదృష్టాన్ని పరిహాసించేందుకా ఆ చిరునవ్వ? జైలర్‌పై అతనికి కొంచెం కోపం వచ్చింది. అతని చూపుల్లో అది స్పష్టమైంది. అయినా, నిగ్రహించుకున్నాడు.

"బ్రీఫ్‌గా కేసు గురించి చెప్పండి. పాపం! ఆ అమాయకుడి సంగతి తలచుకుంటేనే జాలి కలుగుతున్నది," అని జైలర్‌వంక చూచాడు సూపర్నెంటు.

జైలర్ మళ్ళీ నవ్వాడు-అన్నాడు గదా-"ఉరిశిక్షకు లోనయ్యేది అమాయకుడు కాదు సార్! అమాయకురాలు."

ఈసారి అదరిపడ్డాడు సూపర్నెంటు. 'స్త్రీ' అని గొణిగాడు మెల్లగా.

జైలర్ సూపర్నెంటును పరీక్షగా చూచాడు. ముఖంమీది చిరునవ్వును దాచేసుకుని, "మీరు చార్జి తీసుకున్న రోజున ఒక స్త్రీని ఉరి తీయడం దారుణం," అన్నాడు.

ఇంతవరకూ ప్రసాదరావు ఆలోచన ఆ విధంగా పోలేదు జైలర్ మాటలతో అతను మరీ క్రుంగిపోయాడు. గాఢంగా నిట్టూర్చి, జాలిగా చూచాడు జైలర్‌ను. తను చార్జి తీసుకునే ప్రథమ దివసమైనాగాని - అంతిమ దినమైనా గాని-ఉరిశిక్షను రద్దుచేసే అధికారం తనచేత ఉన్ననాడు-ఎంతటి దారుణానైనా మార్చివేయగలడు తను! కాని, ఇప్పుడు - ఏం లాభం?

"చెప్పండి," అన్నాడు.

జ్ఞాపకం చేసుకునేందుకు రెండు క్షణాలు వెచ్చించి, మెల్లగా జైలర్ చెప్పసాగాడు.

"భర్త త్రాగుబోతు, నిరుద్యోగి. ఏవో చేతిపనులు చేస్తూ భార్య సంపాదించేది. భార్య సంపాదన అంతా అతని త్రాగుడుకే సరిపోయేది కాదు. ఒక కూతురు. కూతురును కాన్వెంటులో చేర్పించిందామె. భర్తను బామాలి అతనిచేత త్రాగుడు మాన్పించాలని చూచింది. అత నో రోజు తప్ప తాగి, భార్యమీద కత్తి దూశాడు. కాని, ఆమె అతని గుండెల్లో పొడిచింది. అతను చచ్చిపోయాడు. ఆమెకు ఉరిశిక్ష విధింపబడింది. పదిరోజుల క్రితం న్యాయస్థానం ఉరిశిక్షను విధించింది. సార్! మన మిప్పుడు అమలు జరపాలి."

రిక్రియేషన్ రూమునుంచి వాళ్ళిద్దరూ ఆఫీసుగదివెంపు నడుస్తూ ఉన్నారు. జైలర్ చెప్పినదంతా విన్న తరువాత ప్రసాదరావులో ఆలోచనలు చెలరేగాయి.

అగ్నిసాక్షిగా తనను వివాహమాడిన భర్తను భారతనారి హత్యచేసింది. దైవసమానుడైన భర్త గుండెల్లో

కత్తి గుచ్చి, అతని ప్రాణాన్ని బలిగొన్నది భార్య. భార్యా భర్త లన్న తరువాత ఎంతైనా అనుబంధ ముంటుంది. వైవాహిక బంధం పెంచిన మమత రెండు నిండుగుండెలనూ ఏకం చేస్తుంది. వారి ప్రేమకు గుగుతుగా ఆడపిల్ల కూడా కలిగింది. భర్త తాగిన మైకంలో భార్యమీద కత్తి ఎత్తడంలో ఆశ్చర్యం లేదు. అసలే అతను చాతకానివాడు. భార్య సంపాదనమీద బతుకుతున్నవాడు. అతను నలుగురి ముందూ తల దించుకునే నడవాలి. అంతేగాక, మహామ్మారి తాగుడుకు అతను బానిస. సహజంగా సున్నితమైన మానవత్వం అతనిలో నశించిపోయి ఉంటుంది. అందుకే భార్యపై అతను కత్తి యెత్తగలిగాడు. కాని, జరిగిం దేమిటి? అతను హత్య చేయబడ్డాడు. నిజంగా చూస్తే-భర్తను ఖూనీచేసిన ఆ స్త్రీ శిక్షార్హురాలే అనిపించిం దతనికి. అంతవరకూ భర్త మాటకు ఎదురాడని ఆమె, స్వార్థపరురాలై భర్త చేతిలోని కత్తితోనే అతని ప్రాణాలను బలిగొన్నది.

దంతాలను తాటించాడు ప్రసాదరావు. చెవులదగ్గర కండరాలు పొంగి, అతని కళ్ళలో ఎర్రజీరను నిలిపాయి. జైలర్ అది గమనించకపోలేదు.

స్త్రీకి ఉరిశిక్ష అంటే చాలు-ఒక విధమైన చలనం కలగకపోదు మనిషిలో అనుకున్నా డతను.

ఇద్దరూ ఆఫీసుగదిలో ప్రవేశించారు. మరి నిలబడడం సాధ్యం కాదన్నంత నిరుత్సాహంతో ప్రసాదరావు కుర్చీలో కూర్చుండిపోయాడు. జైలర్ రెండు క్షణాలు ఆయనను పరీక్షగా చూసి, "నేను వెడుతున్నాను సార్! మీరు ఓ పదినిమిషా లాగి రండి!" అన్నాడు.

అత నేమీ చెప్పలేదు. జైలర్ గది గుమ్మం దాటడం గుడ్లప్పగించి చూస్తూనే ఉన్నాడు. అయిదు నిముషాల పర్యంతం అత నట్లా ఆలోచిస్తూ ఉన్నాడు. ఏం గుర్తొచ్చిందో ఏమో - "చూడండి," అని అటు చూచాడు. అక్కడ జైలర్ లేడు. ప్రసాదరావు చూపులు అతనికోసం దేవులాడాయి. వెనువెంటనే లేచి, గబగబ నడక ప్రారంభించాడు.

పెద్దపెద్ద అంగలతో నడుస్తూ అతను గదులన్నీ దాటి చివరిగదిని సమీపించబోతూ టైము చూచాడు.

ఒక హంతకురాలు ఈలోకాన్ని విడిచిపోయేందుకు మరొక్క పది నిమిషాలు మాత్రమే ఆమె చరిత్రలో మిగిలిఉన్నాయి. ఈ పదినిమిషాలూ ఆమెను చాల భయంకరంగా గడుస్తాయి. నిమిష నిమిషానికీ భయం భయంకరంగా ఆమె కళ్ళముందు నర్తిస్తుంది. ఆమె నరనరమూ చావు మీది భయంతో గజగజ లాడిపోతూ ఉంటుంది.

గదిలో ప్రవేశించబోతున్న వాడల్లా ప్రసాదరావు ఆగిపోయాడు. తనను చూడగానే జైలర్ తన వెంపు పరుగెత్తుకు రావడం అతను గమనించాడు.

"అంతా రెడీ సార్! రండి," అన్నాడు జైలర్, ప్రక్కకు ఒదిగి నిలబడి, అతనికి దారి విడుస్తూ.

అతను కదలలేదు. దృష్టి చలించడం లేదు. జైలర్ గమనించాడు. అతని దృక్కు లన్నీ ఆమె మీదనే కేంద్రీకరించబడివున్నాయి.

ప్రసాదరావు రెండు కళ్ళూ ఆమెను నిశితంగా పరికిస్తున్నాయి. ఆమె–వయస్సెంతో చెప్పడం కష్టమే. అందంగానే ఉన్నది–మరీ చిన్నపిల్లగా కనిపిస్తున్నది. ముందుగా ఆమె కళ్ళపై దృష్టి నిలిచిందాతనికి. వేదనాభారంగా ఆమె కనురెప్పలు వాలి ఉంటాయనీ, బ్రతుకు మీది తీపితో ఏడిచి ఏడిచి కళ్లు ఉబ్బి ఉంటాయనీ అత ననుకున్నాడు. అతని ఊహ తప్పైంది. ఆమె కనులు ప్రశాంతంగా ఉన్నాయి. పెదవులపై చిరునవ్వు లీలగా మెదలుతూఉంది. ఆమె తల వాల్చుకుని నిలబడలేదు. సహజంగానే చూచునిఉంది.

ప్రసాదరావుకు ఆశ్చర్యం వేసింది. మరికొన్ని క్షణాల్లో చచ్చిపోనున్న ఆమెకు ఇంత ధైర్యమా? చావంటే ఇంత నిర్లక్ష్యమా? కొంచెం అనుమానంతో అతను జైలర్‌ను ప్రశ్నించాడు–"ఆమె ఎవరు?" అని.

"ఆమే సార్! మీనా. ఉరి తీయవలసింది ఆమెనే."

ఫైలులో అతను చూచింది ఆమె పేరు మాత్రమే. ఆ పేరును ఒకసారి లోలోపల అనుకున్నాడు అంతవరకూ ఆమె యెడల అతనిలో రేగిన ఆలోచనలన్నీ మాయమైపోయాయి. ఆమె యెడల ఏర్పడిన కోపం, అసహ్యం–జాలిగా రూపొందాయి. ఆమె రూపసి. ఆ స్ఫురద్రూపం అతనికి జాలిని కలిగిస్తున్నది. విచారవిహీనమైన ఆమె వదనంమీద నిలిచిన అతని దృష్టి చలించడం లేదు. ఆమెను చూస్తున్న కొలదీ అతనిలో జాలి పెంపొందుతున్నది.

నిజంగానే ఆమె అమాయకురాలిలా ఉన్నది. ఎట్టి అనిశ్చలాన్నీ ఎరుగని ఆమె కళ్ళూ, చిరునవ్వుముద్ర చెరగని ఆమె ముఖభంగినూ ఆమె అమాయకురాలని చాటి చెప్పుతున్నాయి. ఇంత అమాయకురాలు కట్టుకున్న భర్తను ఎలా హత్య చేయగలిగిందో అతనికి సుతరామూ అర్థం కాలేదు. ఆమె ముఖంచూస్తూ ఉంటే, హంతకురాలని ఎంత మాత్రమూ అనిపించడంలేదు.

ఒకటి జరిగి ఉంటుంది. భర్త తాగిన మైకంలో ఆమెపై కత్తి ఎత్తిఉంటాడు. ఎంత పతిభక్తిగలదైనా, భర్తకు ఎంతగా ఎదురు చెప్పనిదైనా, ఆమెకూ




"మోరలిష్టు"

ప్రాణమంటే తీపి ఉండకపోదు. ఆ మోహంతో ఆమె అతని చేతుల్లోనుండి గింజుకొని ఉంటుంది భర్తకా- తాగిన స్థితి, అందునా అస్థిరచిత్తుడు ఆ గింజులాటలో పొరపాటున అతని చేతిలోని కత్తి అతని గుండెల్లోనే దిగిపోయి ఉంటుంది ఆమె హత్య చేయగా చూచినవా ళ్ళున్నారా!!! 'నువ్వు హత్యచేశా'వని ఆరోపించినపుడు ఆమె మౌనం వహించిఉంటుంది.

జైలర్ హెచ్చరించాడు. ఆలోచనలు వాటి దారిని అవి నడుస్తూఉండగా సూపర్నెంటు మెల్లగా నడిచి తన స్థానాన్ని చేరుకున్నాడు. అక్కడ చేరినవా రందరూ లేచి నిలబడ్డారు గౌరవసూచకంగా అతను కూచున్నాడు మిగతవారూ తమ స్థానాల్లో కూచున్నారు.

ఆమెకు చెరొకవైపున ఇద్దరు పోలీసులు నిలబడ్డారు. జైలర్ ఆదేశాన్ననుసరించి ఆమె ఉరితీయుబడేప్రదేశానికి కొనిరాబడింది. ఆమె-గదిమధ్యలో గోతిపై అమర్చబడిన బల్లపై నిలబడింది ఆమె కంటిముందు పూర్ణ చంద్రాకారంలో ఉరిత్రాడు మెల్లగా కదలుతూ- వేలాడుతూ ఉంది. భయ కర సంగీత లహరులు అదృశ్యస్థల నుంచి తేలివస్తూ, సన్నివేశాన్ని భీభత్స చేస్తున్నాయి. లావాటి ఒక ఆసామీ ఆమెకు అతిసమీపంగా నిలబ ఉన్నాడు.

ప్రసాదరావు ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు. వధ్యపీఠం ముందు నిలబడ్డ పశువులా అతని కంటికి ఆమె కనిపించినప్పుడు, ప్రసాదరావు గుండె జాలితో నీరైపోయింది న్యాయస్థానం ముందు తలవంచిన ఒక అమాయకురాలు, మరి నోరు విప్పక తప్పిదాన్ని తలమీద వేసుకుని, తన కంఠాన్ని చిరునవ్వుతో ఖడ్గంకిందకు చేర్చినట్లు అనిపించి, అతను నిలువెల్లా వణికాడు. అతని ఎడమకన్ను బగబ అదరిపోయింది. ఎడమభుజంమీద ఎవరో చరిచిన ట్లైంది.

ఇంతకుముందు అతను జైలర్‌గా ఉండగా ఉరిశిక్షలను కొన్నిటిని అమలుపరిచాడు. అప్పట్లో అతని కింత బాధ కలుగలేదు. ఒక స్త్రీకి ఉరితీయడం అతనెప్పుడూ చూచినవాడుకాదు అంతేగాక — తను సూపరింటెంటుగా ప్రమోషనైనరోజున, ఒక ఆడబిడ్డకు తన ఆధ్వర్యంలో ఉరి తీయించడం అతనికి గొప్ప బాధను కలిగిస్తున్నది.

తన స్థితి గమనించి, తను నిర్వహించవలసిన బాధ్యతనంతా జైలరే సరిచూచుకుంటున్నాడు. నాలుగు గంటలు పూర్తి కావడానికి మరొక్క నాలుగు నిమిషాలు తక్కువ.

ప్రసాదరావు కళ్ళు మూసుకుని కూచున్నాడు. ఎంతగా ధైర్యాన్ని కొనితెచ్చుకోవాలన్నా సాధ్యం కావడంలేదు. గుండె ఎంతో వేగంతో కొట్టుమిట్టాడుతూఉన్నది.

జైలర్ కంఠం వినిపించింది.

"శ్రీమతి మీనా! న్యాయస్థానం మీకు విధించిన శిక్షను అమలుపరచే క్షణాలు దగ్గరపడ్డాయి. మరి నాలుగు నిమిషాలుమాత్రం మిగిలాయి. మీకు చివరికోరిక ఏదైనా ఉంటే వెల్లడి చేయవచ్చు."

ఆమె ఏం మాట్లాడుతుందో వినాలని ప్రసాదరావు వేచివున్నాడు. ఆమె కంఠస్వరం ఎంతకూ వినిపించక పోయేసరికి, కళ్ళు విప్పి చూచాడు. ఆమె పెదవులపై చిరునవ్వు చెరిగి పోలేదు. కళ్ళల్లో ప్రశాంతత దూరం కాలేదు.

ఈసారి — సూపరింటెంటు ప్రసాదరావు. సహజ గంభీర కంఠస్వరంతో అడిగాడు —

"మీకు చివరికోరిక ఏదైనా ఉంటే — విన్నవించుకోవచ్చు"

అతని కంఠస్వరం విని ఆమె ఎదురు చూపులు చూచింది. ఆ తరువాత మెల్లగా చెప్పింది —

"నా కేమి కోరికలేదు. నే నిచ్చిన వాఙ్మూలంలోనే నా చివరి కోరిక ఏమిటో వివరించాను. అంతకన్న నా కేమీ కోరికలేదు ......"

ఆమె ఎంతగా ధైర్యాన్ని అవలంబించినా, గొంతు వణకింది. ఆమె

మాటలు వింటూనే ప్రసాదరావు చలించాడు. ఆ కంఠస్వరం వింటూనే అతని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. హృదయంలో కంపన బయలుదేరింది. అతను మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

ఆ తరువాత జరగవలసిన కార్యక్రమాన్ని అతను మనోనేత్రంతో చూడసాగాడు. జైలర్ కంఠం మళ్ళీ విన్పించింది.

"అయితే - దైవప్రార్థన చేసుకోండి - టైం పూర్తికావచ్చింది."

ప్రసాదరావు లోపల్లోపల అనుకున్నాడు - "దేవుడు" అని.

నిర్ణీతవేళకు - సరిగా - ఉరితీయబడే వ్యక్తి కంఠానికి ఉరితాడు తగిలింపబడుతుంది. సూపరెన్టెంటు సూచన యిచ్చినవెంటనే కాళ్ళకింది బల్ల తొలగింపబడుతుంది సరిగా గోతిలోనికి ఆవ్యక్తి చటుక్కున దిగగానే - కంఠం చుట్టూ ఉరితాడు బిగుసుకుపోతుంది. క్రమంగా త్రాడు బిగుస్తూఉంటే, కళ్లు వెళ్ళుకువస్తాయి. ప్రాణం గిజగిజలాడుతుంది. ఊపిరితిత్తుల గొంతు బిగుసుకుపోతుంది. బయటిగాలి లోపలికి ప్రవేశించదు; లోపలగాలి బయటికి పోదు. కొన్నిక్షణాలు అతిప్రశాంతంగా - గిలగిల కొట్టుకొంటూ, ఊపిరాడక, ప్రాణభయంతో, గట్టుమీది చేపపిల్లమాదిరి, అమాయకంగా, దీనంగా, భయంకరంగా విలవిల్లాడతాయి, ఆ క్షణాల బాధకు-పిదప-ప్రశాంతత.

ప్రసాదరావు చేతిలోనిబెత్తం ఎపుడు కదలిందో, ఆమె కాళ్ళకిందిబల్ల ఎప్పుడు తొలగింపబడిందో - కళ్ళు తెరచిచూస్తే...కంఠాన్ని కౌగలించుకున్న ఉరితాడు ఆధారంగా ఆ స్త్రీ కోమల సుందర శరీరం వేలాడుతూ కనిపించింది. ఒక్కసారి యుద్ధభేరి మ్రోగినప్పటిలా గుండెల్లో ఏదో పెటిల్లున మ్రోగినట్లయింది. ఆశబ్దం గిరగిరా తిరుగుతూ గుండెగదుల్లో తారాడుతున్నట్లు అనిపించింది. కొన్ని క్షణాల అనంతరం, అతను తిరిగి కళ్ళువిప్పి చూచాడు. ఆమెముఖాన్ని అతను చూడదలుచుకోలేదు. అయినా అతని చూపుల బారినుంచి ఆదృశ్యం తప్పిపోలేదు. కళ్ళు పైకి ఉబ్బినా అందులో ప్రశాంతత విరిసేఉంది బాధ ముఖంనిండా పరుచుకున్నా సహజంగా ఆమె పెదవులపై ఉండే చిరునవ్వు చెరిగిపోలేదు. కంఠంచుట్టూ కండరాలు ఉబ్బిపోయాయి. అతను చూడలేక ముఖం త్రిప్పుకున్నాడు.

అతనిలో ఏదో తెలియరాని కంపన బయలుదేరింది. ఇప్పుడు తనువు వణకడంలేదు; ఆలోచనలు సాగడంలేదు గుండె అదరడంలేదు. అతనిలోని మానవుడు చలిస్తున్నాడు. కొన్ని క్షణాలు నిజంగానే అతనికి ఊపిరాడలేదు.

జరగవలసినదంతా జరిగిపోయింది. మెల్లగా ఆమె కళేబరం క్రిందికి దించబడింది. డాక్టర్ పరీక్ష చేశాడు. జైలర్ చేయవలసిన కార్యక్రమమంతా పూర్తి చేశాడు. డాక్టర్ మరిముగ్గురువ్యక్తులు సంతకాలు చేశారు. చివరగా – అన్నీ పరిశీలించి, ప్రసాదరావూ సంతకం చేశాడు.

"చూడండి – ఇక ఇక్కడ నిలబడలేను. జరగవలసినదంతా సక్రమంగా జరిపించాకద! మిగతా కార్యక్రమం ఏమిటో సరిచూడండి. నేను ఆఫీసు గదిలో ఉంటాను. అవసరపడితే రండి," అని జైలర్‌తో చెప్పి, డాక్టర్ దగ్గరా– మిగతా వ్యక్తులందరివద్దా శెలవు తీసుకుని ప్రసాదరావు మెల్లగా నడుచుకుంటూ బయలుదేరాడు.

యంత్రం మాదిరి మెల్లగా అతను గదిలోకి వచ్చాడు. నిరాలోచనంగా కుర్చీలో కూర్చున్నాడు. కిటికీలోంచి సాయంకాలపు నీరెండతోబాటుగా లోపలికి వస్తున్న గాలి అతనికి కాస్త ప్రశాంతతను కల్గించింది. నిండుపాటి నిట్టూర్పు విడిచిపుచ్చాడతను.

అతనికి పెళ్ళికాలేదు. వైవాహిక జీవనంలోని మాధుర్యం కొంచెమైనా అతనికి తెలియదు. ఎన్నడూ ఊహాలోనైనా అతనట్టి ఆనందాన్ని అందిపుచ్చుకోవాలని ప్రయత్నించలేదు. పెళ్ళంటేనే అతనికి నిజంగా అసహ్యం. చిన్నతనంనుంచీ వివాహం యెడల అతని కట్టి వైముఖ్యం ఏర్పడిపోయింది. ఇదమిత్థంగా దానికి కారణం యిదని అతను చెప్పలేకపోవచ్చు.

ఆలోచన లేమీ అతని ఎదురుగా నిలబడడం లేదు. సాయంకాలపు చల్లని గాలినుండి అతడు విశ్రాంతిని కోరుతున్నాడు. ఉదయంనుండీ అత డనుభవించిన రంపపుకోతను విస్మరించాలని ప్రయత్నిస్తున్నాడు.

తలవాల్చుకుని అతను టేబిల్ మీదికి చూచాడు. ఎర్రని పాడ్‌లో ఫైలు కన్పించింది. అతను కుర్చీలోంచి లేచి నిలబడి గదిలో ఇటూయిటూ పచార్లు ప్రారంభించాడు. ఎర్రపాడ్ మళ్ళీ పామియానాను గుర్తుచేసింది. పామియానా అతని బాల్యాన్ని గుర్తుచేసింది.

అతనికి మళ్ళీ ఆలోచనలు కన్పించాయి. కిటికీలోంచి అస్తమించబోతున్న సూర్యుడు కనిపించాడు. నీరెండలో – తప్పు చేసినవాళ్ళ మాదిరి తలలు వాల్చుకుని నిలబడ్డ చెట్లు కనిపించాయి. టేబిల్ మీది ఎర్రపాడ్‌లో ఫైలు కనిపించింది.

ఎంత వద్దనుకున్నా ప్రసాదరావు కాళ్ళు టేబిల్ దగ్గరకు నడిచాయి. చేతులు పాడ్‌ను విప్పాయి. ఫైలు పెద్దదిగానే కన్పించింది.

నిర్నిమిత్తంగా ఒక్కొక్క పేజీ



"డబుల్ బెడ్"

అతను తిరగవేయసాగాడు. అతను చదవడం లేదు. ఒక్కొక్క పేజీ తిరగ వేస్తున్నాడు. అక్షరాలు కనిపించటం లేదు. దృష్టి పేజీలమీద లేదు. ఉరి తీయబడ్డ తరువాత, కనుగుడ్లు వెళ్ళుకు వచ్చి. కంఠమంతా ఉబికి ప్రాణం పోయిన ఆ స్త్రీ ముఖమే అతనికి కన్పిస్తున్నది.

ఆమె తప్పు చేసిందో లేదో తనకు తెలియదు. ఆ హత్యకు బాధ్యురాలు ఆమె ఔనో కాదో తను నిర్ణయించలేదు. న్యాయస్థానం మాత్రం ఆమె హంతకురాలని ఉరిశిక్ష విధించింది. న్యాయస్థానం విధించిన ఈ శిక్షను తను అమలుపరచక తప్పలేదు. తన విధి తను నిర్వర్తించితీరాలి.

ఆమె చివరికోరిక కోరలేదు. చివరి కోరిక అనగానే అతని చేతికి ఫైలు లోని చివరి పేజీలు కనిపించాయి. న్యాయస్థానంముందు ఆమె నాలుగు ముక్కలు మాత్రం చెబుతూ, తన చివరికోరికను వెల్లడించింది. ప్రసాదరావు ఆమె వాంగ్మూలాన్ని శ్రద్ధగా పరికించాడు.

తను హత్య చేసినట్లుగాని, లేదా మరెవ్వరైనా గాని హత్యకు కారణమని గాని ఆమె వివరించలేదు. అసలు హత్య గురించే ఆమె మాటల్లో లేదు. తన చివరి కోరికను మాత్రమే వివరించింది. న్యాయస్థానంలో తన అపరాధాన్ని గురించి ప్రశ్నించినప్పుడు ప్రతి ప్రశ్నకూ మౌనం వహించింది మౌనంవల్ల ఏ ప్రశ్నకూ సమాధానం చేకూరదు. అతిప్రయత్నంమీద ఆమె చెప్పింది—నేను అపరాధినని న్యాయస్థానం నిర్ణయిస్తే నేను తలవంచుతాను

ఇంతకన్న నే నేమి చెప్పలేను," అని.

చివరి కోరికను వివరిస్తూ ఆమె చెప్పిన విషయం గమనించి, ప్రసాద రావు ముఖంలో రంగులు మారాయి. అతనిలో ఆత్రం చెలరేగింది.

బాంకులో తన పేర గల డబ్బంతా తన కుమార్తెకు చెందవలెననీ, ఆ పిల్లను తన తండ్రికి అప్పగించవలెననీ ఆమె కోరింది.

ప్రసాదరావు కళ్లు కుంచించుకు పోయాయి. పాపం! కన్నబిడ్డ భవిష్యత్తును పరిరక్షించవలసిన తన బాధ్యతను పూర్తిగా నిర్వర్తించకుండానే ఆమె మరణించింది. ఆ మాతృహృదయము ఎంతగా క్షోభించిపోయిందో! అంతేకాదు—తన బిడ్డ పెద్దదైగిన తరువాత - తన కన్నతల్లి హంతకురాలై ఉరిశిక్షకు పాలుపడిన దన్న సంగతి తెలిసి-నలుగురిలోనూ తలెత్తుకు తిరగలేక, అటువంటి తల్లి కడుపున పుట్టినందుకు తనను తను నిందించుకుంటూ ఎంతగా కుమిలిపోతుందో ఊహించుకొంటే, ఆ కన్నతల్లి హృదయం తుత్తునియలై పోతుంది. అయినా, గుండె కోతకు బదులు ఆమె ముఖంమీద చివరి క్షణంవరకూ చిరున వ్వుండనే ఉన్నది. మీనా స్త్రీ కాదు. అబలకాదు.

ప్రసాదరావు చూపులు మీనా ఇచ్చిన ఆమె తండ్రి చిరునామా దగ్గర ఆగిపోయాయి. అతను ఆ చిరునామా మరోసారి చదివాడు. అతని గుండె లొక్కసారి గతుక్కుమన్నాయి.

వేగంగా నడుస్తున్న కారుచక్రాలు గోతిలో పడినప్పుడు కారు కుదిపినట్లు గుండె గతుక్కుమంటే అతను ఉలిక్కిపడ్డాడు.

ఆమె తండ్రి పేరు రఘురామయ్య. ఆ చిరునామా...

ప్రసాదరావు కుర్చీలో కూర్చోలేక పోయాడు. ఫైలును చేత్తో పట్టకో లేకపోయాడు.

అతనికి తండ్రి గుర్తుకు వచ్చాడు. తన ఒక్కగా నొక్క కుమార్తెను అల్లారుముద్దుగా పెంచి, పెద్ద జేసి, కలిగినవా రింటి కోడలిగా చేయాలని వివాహం నిశ్చయించి, ఘనంగా పెళ్లి ఏర్పాట్లు చేయిస్తే — ఆ రాత్రి ఆ కూతురు ఆకస్మాత్తుగా తను ప్రేమించిన ఎవరో కుర్రాడితో లేచిపోతే, తను చేసిన తప్పేమిటో తెలియక భోరుభోరున ఏడుస్తున్న తన తండ్రి కళ్ళముందు కనిపించాడు.

షామియానా కళ పెళ మంటూ ఊగిసలాడటం కనిపించింది.

ప్రసాదరావు ఈ నగ్నసత్యాన్ని భరించలేకపోయాడు. 'మీనా' గా మారిపోయిన తన సోదరిని తలుచుకుని రెండు చేతులూ ముఖాన్ని కప్పుకుని — "అక్కయ్యా!" అని భోరుమన్నాడు.

——

# చురుకైన అబ్బాయి

నాకేసి జాలిగానూ, చీదరింపుతోనూ చూశాడు.

"మీ ముసలాళ్లు మీకే అన్నీ తెలుసనుకుంటారు. నిజం చూస్తే మీకన్న మాకే ఎక్కువ తెలుసు" అన్నాడు చురుకైన కుర్రాడు.

"ఎందువల్లను ?" అన్నాను.

"మీరు పెద్దవాళ్ళు. మేం చిన్నవాళ్ళమూ గనక."

"మేమూ ఒకప్పుడు చిన్నవాళ్ళమేగా ?" అన్నాను.

"అప్పుడు మీకు మీ ముసలాళ్ళకన్న ఎక్కువ తెలుసేమో ?"

"ఆయేటి కాయేడు మీదపడ్డకొద్దీ తెలిసింది కాస్తా హరించిపోతుందా ఏమిటి ?"

"తెలియటానికి అనుభవంతో ఏమీ సంబంధం లేదు. పెద్దయినకొద్దీ మీరు దొంగవాళ్ళుగా తయారై మా కుర్రవాళ్ళని మోసం చెయ్యటానికే ప్రయత్నిస్తారు. ఏ పాతికేళ్ళో రాగానే మీరు చచ్చిపోతే ప్రపంచం ఎంతో బాగవుతుంది."

చురుకైన కుర్రాడి అంచనా ప్రకారం నేను చచ్చిపోయే అర్హత సంపాదించి ఓ పుష్కరం అయింది.

"పాతికేళ్ళు నిండితే నువేం చేస్తావు ?" అన్నాను.

కుర్రాడి మొహం చూస్తే, అడగరాని ప్రశ్న అడిగినట్టు తోచింది.

"ముసలాణ్ణి కాకుండా ఉండటానికి ప్రయత్నిస్తాను. చేతకాకపోతే చచ్చిపోతాను."

కుర్రాడి ధైర్యసాహసాలకి లోటు లేనట్లు కనిపించింది. నాకంటె నయమే. నాకింకా చావాలని లేనేలేదు.

విషయం మార్చాను.

"నీ కన్ని విషయాలూ తెలుసునా ?" అన్నాను.

"ఓ!" అన్నాడు కుర్రాడు.

నిట్టూర్చి, "ఎంత అదృష్టం! ఎప్పుడు నేర్చుకున్నావు ?" అన్నాను.

కొడవటిగంటి కుటుంబరావు

కుర్రాడు మరింత అసహ్యంగా నాకేసి చూసి, "మీ ముసలాళ్ళకు ఎంత చెప్పినా తలకెక్కదు. ఈ విషయాలు నేర్చుకుంటే రావు. అవి తెలియవలసిందే." అన్నాడు.

"ఎట్లా తెలుస్తాయ్?" అన్నాను.

"తలకాయ ఉంటేసరి," అన్నాడు కుర్రాడు.

"తలకాయ ఉన్నంత మాత్రానికే అన్వేషించకుండా, పరిశోధించకుండా నిజం తెలుస్తుందా?" అన్నాను.

కుర్రాడు వింతగా, "నిజ మేమిటి?" అని అడిగాడు.

నిజమంటే ఏమిటో చెప్పటానికి కూడా నాకు తెలివితేటలు లేవనేని బయటపడింది. నేను ఏడుపుకుంటూ, "ప్రత్యక్షానుభవం వెనక వుండే సత్యం!" అన్నాను.

"అటువంటి దేమీ లేదు," అన్నాడు కుర్రాడు.

"మరి సిద్ధాంతా లెట్లా చేస్తాం?" అన్నాను.

"ఏం సిద్ధాంతాలు?" అన్నాడు కుర్రాడు తిరస్కారంగా.

"సిద్ధాంతాల కేం బోలెడన్ని ఉన్నై. భూమి గుండ్రంగా – నారింజపండులాగుందని ఒక సిద్ధాంతం. భూమీ ఇతర గ్రహాలూ సూర్యుడిచుట్టూ తిరుగుతున్నాయని మరో సిద్ధాంతం. శాస్త్రజ్ఞులు చాలా సిద్ధాంతాలు చేశారు. రాజనీతిజ్ఞులు కూడా అనేక సిద్ధాంతాలు చేశారు. ఎంతో పరిశోధన చేసి, ఎంతమంది జుట్లో నెరిస్తేనేగాని ఈ సత్యాలు బైట పడలేదు."

"వొట్టిది! అన్నీ అబద్ధాలు! పచ్చి పంచుప! శాస్త్రజ్ఞు లయేదీ, రాజనీతిజ్ఞు లయేదీ, ఎవరికిష్టమైన విషయాలు వాళ్ళు నమ్ముతారు. ఎవరి అభిరుచి వారిదీ. భూమి గుండ్రంగా లేదని నాకు తెలుసు. సూర్యుడే భూమిచుట్టూ తిరుగుతున్నాడు. నా యిష్టం నాది!"

"శాస్త్రజ్ఞులు చేసిన కృషి యావత్తూ వృథాయే?"

"ఉష్కదండగ."

మళ్ళీ నాకు గోడ అడ్డయింది. పక్కకు తిరిగాను.

"పోనీ. నువ్వు చెప్పినట్టే అనుకుందాం. ఎవరి యిష్టం వచ్చినట్టు వాళ్ళనుకునేపక్షంలో, అభిప్రాయభేదం వస్తే ఎవరి అభిప్రాయం సరియైనట్టు? ఎవరిది తప్పయినట్టు?"

"ఎవరి అభిప్రాయం వాళ్ళకు రైటు."

"మా ముసలాళ్ళు తెలివితక్కువవారన్నావే? మా అభిప్రాయాలు మీకు రైటేగా?"

"కావలిస్తే అట్లానే అనుకోవచ్చు. మీ అభిప్రాయాలు తప్పని మా కుర్రాళ్ళకి తెలుసుగా?"

"నేను అనుకునేదానికన్న నువ్వను




కునేది ఎక్కువ నిజమని నీ అభిప్రాయం. అవునా, కాదా?"

"అవును," అన్నాడు కుర్రాడు.

"అయితే నిజమంటే ఏమిటి?" కుర్రాడు చిక్కడనుకున్నాను.

"నే ననుకునేది!" అన్నాడు కుర్రాడు.

"నే ననుకునేదే నిజమని నేనూ అంటాను. ఇన్నిరకాల నిజాలకి ప్రపంచంలో స్థాన ముందా?"

"లేనప్పుడు మాతో ఏకీభవించని వాళ్ళని చంపేసి, మా నిజమే చలామణిలో ఉంచుతాం."

అదీ సబబుగానే వుంది.

"మీ ముసలాళ్ళతో అభిప్రాయ భేదాలు వస్తే మమ్మల్ని చంపేస్తావు? బాగానే వుంది; మీ సాటికుర్రాళ్ళతోనే అభిప్రాయభేదం వస్తే?"

"వాళ్ళనీ పాతేస్తాం. మీ ముసలాళ్ళ మాటలు విని చెడిపోయేకుర్రాళ్ళుండరనా?"

"ఏమాట వింటే బాగుపడేటట్టూ - నీమాట వినకపోతే చెడిపోయినట్టూనా?"

"నా దృష్టిలో అంతేగా?"

"ఇంతమందిని చంపెయ్యాలంటే నీకు కొంతమందయినా మద్దత్తుండాలిగా; మీ సమాజానికి నాయకు డెవరు? ఇంతమందిలో ఎవరి అభిప్రాయాలు

ఆమోదించాలో నీ కెట్లా తెలుస్తుంది ?" అన్నాను.

"వాద స్తంగా మాట్లాడకు. నేనే నాయకుణ్ణి. నాతో ఏకీభవించిన వాళ్ళం దరూ నాతో వచ్చేస్తారు.

"వాళ్ళు ఎక్కువమంది లేకపోతే?"

"ఎందుకుండరూ ?'' మొదట్లో ఓ పాతికమందిమి ఉన్నప్పటికీ ఒక్కొక్క రినీ అడలగొట్టి మాలో కలుపుకుంటాం. ఈ విధంగా ఎన్నిలక్షలమందిమైనా అవుతాం. అప్పుడు మా విశ్వాసాల కెవరూ ఎదురు చెప్పలేరు. చెప్పిన వాళ్ళని చంపేస్తాం."

"నువ్వంత బలవంతుడి వయ్యే లోపల మిగతావాళ్ళు మీ అభిప్రాయాలు ప్రచారం చేయకుండా అడ్డుపడితే ?"

"ఏమిటీ ? నా అభిప్రాయాలు నేను ప్రచారం చేసుకునే హక్కుకూడా నా కివ్వరా ?''

"నీకు డెమాక్రసీలో ఎంత విశ్వాస ముంది !" అన్నాను.

"కొంతవరకూ డెమాక్రసీ మంచిదే. కొంతవరకూ ఏదైనా మంచిదే."

చురుకైన అబ్బాయి చెప్పిన అభిప్రా యాలన్నీ ఒక దండ గుచ్చాను.

"అయితే నీరకం నిజం అమల్లోకి రావాలంటే ముందు ముసలోళ్ళంతా ఆత్మ హత్య చేసుకోవాలన్నమాట; ఆతరువాత స్వేచ్ఛగా లాఠీలతో నీ విశ్వాసాలను నువ్వు ప్రచారం చేసుకుంటూంటే, నీ బలం తన బలంకంటే హెచ్చిపోయ్యే వరకూ ప్రపంచం చూస్తూ ఊరుకోవా లన్నమాట; ఇట్లా లాఠీ ప్రయోగంతో సాధించిన ఐకమత్యంతో నీ మతం వారంతా కలిసి మీతో ఏకీభవించనివా రందర్నీ హత్యచేసేసి, నిజంస్థాపించేస్తా రన్నమాట ! అన్వేషణలూ, పరిశో ధనలూ, తర్కమూ, అనుభవమూ, సిద్ధాంతాలూ, వాటి సంస్కరణా ఏమీ అవసరం లేదన్నమాట ! తెలివితేటలూ, నిజం తెలుసుకునేశక్తి, నీ ప్రపంచంలో పుట్టుకతోనే వస్తాయన్నమాట; ఈ ప్రపంచాని కంతకీ అధినాయకుడివి నువ్వన్నమాట ! నీతో ఏకీభవించలేనివా రంతా ముసలితనం వచ్చిందని గుర్తించి, ఆత్మహత్యలు చేసుకోవాలన్నమాట !" అన్నాను.

"అందులో తప్పేముంది ? అందరూ నే చేసే ప్రత్నమే చేస్తున్నారు. అయితే వాళ్ళకి సరిఅయిన అభిప్రాయాలు లేక, పద్ధతులు లేక ఓడిపోతున్నారు. నేను జయిస్తాను. ప్రపంచాన్నంతా నా పాదాల కిందపెట్టి తొక్కేస్తాను," అన్నాడు.

నా కెంతో ఆవేశం వచ్చినట్టయింది. అప్రయత్నంగా వాడిపీక పట్టుకుని, "వెధవా ! నిన్నిప్పుడు పీక నులిమేస్తే ఏంచేస్తావు ? నీ రాక్షసత్వమంతా బయట పెట్టుకోవటాని కిప్పుడే సాహసించటం నీ పొరపాటు; కొంతకాలం ఆగవల సింది !" అని వాడిపీక నొక్కెయ్య సాగాను.




"ముద్దాయి వీరయ్య సోమయ్యగొంతు పిసుకుతున్నప్పుడు మీ రేంచేస్తున్నారు?"
"నన్ను సాక్ష్యం వేసుకుంటారని భయంవేసి కళ్ళు మూసుకున్నాను సార్ !"

"నన్ను చంపుతావట్రా, ముసలి పీనుగా; నీ చేతులు పడిపోనూ; చిన్న పిల్లవాణ్ణి చేసి నీ పిశాచబలం నామీద చూపిస్తావుట్రా ?" అని కుర్రాడు అరవ సాగాడు. నలుగురూ చేరారు. కుర్రాణ్ణి విడిపించారు. "నీ కేం పొయ్యేకాలం ? లేతవెధవని పట్టి గొంతు పిసుకుతావా ? నీకు పిల్లల్లేరా ?" అని అడిగారు.

కుర్రాడు నాకేసి గర్వంగా చూసి, మెడ తడుపుకుంటూ, "చూసుకో, నా తడాఖా ? ప్రపంచమంతా నాపక్ష ముంది. ఇందాకట్నుంచీ ప్రపంచం తరపున వకాల్తా తీసుకుని మహా పేలావు. ఇప్పుడు పేలు!" అంటూ ఠీవిగా నడిచి వెళ్ళిపోయినాడు.

చుట్టూ పోగయిన వాళ్ళలో నాకేసి చూసినవాళ్లు లేరు. అందరూ వాడు వెళ్ళిన దిక్కే చూస్తున్నారు. అందరి మొహాల మీదా ఆప్యాయంగా చిరునవ్వు తాండ విస్తున్నది.

"కుర్రా డెవరోగాని ఎంత ముద్దొస్తున్నాడు! అన్న దో ముసలితొక్కు."

"చాలా చురుకైన కుర్రాడు. ముందు ముందు పైకొస్తాడు!" అన్నాడు పళ్లలేని ముసలాయన.

పాముపిల్ల ప్రాణంతో తప్పించుకు పోయింది — అయితే ఏం ? నేనూ ఇంకా జీవించేఉన్నాను. నాదీ మొండి ప్రాణమే; ఇంతట్లో చావను ? ఈపాము నాకందేసరికి బాగా కోఱలు పెరిగి బుస కొడుతూ ఉంటుంది. నేను మంచి దుడ్డు కర్ర పెటుక్కోవాలి. చేతులతో పనికాదు.

— —

# ఆత్మహత్యా మహాపాతకం కాదు, కాని...

ప్రపంచంలో ఏ యే పనులనైతే మనం చేయకూడదని పెద్దలు శాశించారో ఆ పనులనే కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో (అవసరాన్ని బట్టి అన్ని సందర్భాలనూ ప్రత్యేక సందర్భాలే అని దాటుకుపోవచ్చును!) మనం చేయ వచ్చుననే ధీమానూ, ధైర్యాన్నీ కూడా మనలో కలిగించారు, ఆ పెద్దలే...

అబద్ధ మాడకూడదని శాశించిన పెద్దలే కొన్ని కొన్ని సందర్భాలలో-వారిజాతులవద్దా, వైవాహికాల్లోనూ, ప్రాణవిత్తమానభంగ సమయాల్లోనూ (ఈ ఆఖరు పరిస్థితిని అన్ని విధాలా ఉపయోగించుకోవచ్చును, పిడుక్కీ, బియ్యానికీ కూడా!) నిస్సంకోచంగా అబద్ధం ఆడవచ్చునని తెలియపరిచి వున్నారు ఇలాగే ఇతర విషయాల్లో కూడా ..

వ్యభిచరించడం మహా పాపమని మనకు తెలుసును. కాని...

పెళ్ళాం చచ్చిపోయిన పెద్దమనిషి అవసరార్థం వ్యభిచారానికి దిగడానికి లైసెన్సు పొందివున్నాడు-అతడికోసం ప్రత్యేకం సానికులం వెలిసింది.

పోతే...

వంశం నిలుపుకోవడంకోసం భర్త కానివాడితో వ్యభిచరించవచ్చునని మహాభారతం ఢంకా బజాయించి చెబుతూంది...

అటువంటిపరిస్థితి-అంటే, లేకుండా-నిష్కారణంగా వ్యభిచరించేవాళ్ళలో కూడా కొంతమంది దుమార్గు లేననీ, అటువంటివారికి ఏ పాపం చుట్టుకోదనీ కుంతీదేవి, అంజనీదేవి తమ జీవితాల్తో చాటి చెబుతున్నారు.

ఎక్కడికి ఈ నీతుల జాబితా? వీటికి అంతేమిటి? వీటిని ఎన్నో తయారు చేసి ఉంచారు. వీటన్నిటినీ అతిక్రమించి, ప్రవర్తించడానికి తగిన పరిస్థితులనూ, అవకాశాలనూ కూడా వెంటనే సిద్ధం చేసివుంచారు.

ఫలితం...

నీతులు నీతులలాగనే వుండిపోయి నాయి; నిర్వచనాలు హెచ్చిపోయి నాయి-అన్ని కాలాలలోనూ, అన్ని సందర్భాలలోనూ అందరూ, అన్ని శాసనాలనూ అతిక్రమిస్తూనే ఉన్నారు ఈ అతిక్రమణ చర్యలకు ప్రత్యేక కారణాలు చూపిస్తూ, తాము ప్రత్యే కంగా దుమార్గులమేనని అంటూ దాటుకుపోతూనే వున్నారు. పురాణ

యం. యస్. మూర్తి




కాలంనాడు నిర్మితమైన శాసనాల మాట అటుంచి, ఈ రోజున నేటి పరిస్థితులకు అనుగుణ్యమైన ఒక కొత్త చట్టం వొకటి ఏ దేశంలోనైనా వెలువడటం చాలు; దాన్ని ఏ విధంగా అతిక్రమించి దాటుకుపోగలం అని చూసేవారే ఎక్కువమంది గాని, దానిలో పరమార్థానికి కట్టుబడి వుందామని ఒక్కడూ ప్రయత్నించడు...

దీనినిబట్టి చూస్తే మానవతత్వానికి ఈ నీతి నియమాలూ, అడ్డు షరతులూ, సహింపరానివని, అవశ్యం అతిక్రమింపదగినవనీ తెలియవస్తుంది. డిగ్రీభేదంగా అందరూ అన్ని నియమాలనూ అతిక్రమించేవారే— పెద్దా, చిన్నా; పెద్దమనిషి, పామరూ కూడా. అందుకే కాబోలు 'చట్టా లన్నీ అతిక్రమింపబడటం కోసం తయారుకాబడినవే' అన్నాడు ఒక పండితుడు!

ఆత్మహత్య మహాపాతకమన్నారు పెద్దలు. ఈనాటి ప్రభుత్వాలు కూడా 'Every man is for the State' ప్రతి మనిషి కూడా ప్రభుత్వ వ్యవస్థ కొరకే ఉద్దేశింపబడినాడు అంటున్నాయి. అంటే ప్రభుత్వానికి ప్రతి వ్యక్తితోనూ అవసరం వుంది కాబట్టి, అతడు తన ప్రాణాలను తీసివేసుకోడానికి స్వేచ్ఛగలవాడు కాదని భావం.

కాని, దీనికి ప్రతిగా ప్రభుత్వం కూడా ప్రతి వ్యక్తికీ అవసర మైనదానిలా - అంటే ఉపయోగకారిగా వుంటుందా? అని కొన్ని కొన్ని సందర్భాలలో అడ్డు ప్రశ్న వేయవలసి వుంటుంది.

ప్రతి వ్యక్తికీ, అతడి అవసరాన్ని బట్టి అన్ని సౌకర్యాలూ అమరుస్తాం అనేకమ్యూనిస్టు నినాదాలను అటుంచి ఇతర ప్రభుత్వాలను గురించి చర్చిస్తే ప్రతి మనిషీ కూడా ప్రభుత్వ వ్యవస్థ కొరకే ఉద్దేశింపబడినాడు అనేదాన్ని చులాగ్గా కొట్టిపారవేయవచ్చు.

అమెరికన్ నావెలిస్టు అప్టన్ సింక్లెయిర్ అన్నమాట లివి. అతడి స్వస్థలం అమెరికాలోని పాసడెనా నగరం. ఆ వూరికి మధ్యగా ఒక అందమైన నది ప్రవహిస్తూంది. దానిమీద మరీ అందమైన ఒక బ్రిడ్జి. ఆ వంతెన మీంచి సాయంకాలం వేళప్పుడు భాగ్యవంతులైన స్త్రీపురుషులు వేలకొద్దీ తమ కార్లలో విహారానికి వెడుతూంటారు. ఆ వంతెన మీదనుంచే ఒక సంవత్సరం- ఆ మధ్య ధరలమాంద్యం-'డిప్రెషన్'- రోజుల్లో 80 మంది నిరుద్యోగులు అమాంతంగా క్రిందకు దూకి తమ ప్రాణాలను నదీ గర్భానికి అర్పించారు...

ఒక సంవత్సరంలో ఒకేవొక ఆ బ్రిడ్జి 80 మంది అభాగ్యులను తమ కష్టాలనుండి విముక్తిని కలిగించింది.

ఇదిచూసి, పేపర్లలో పెద్ద కల్లోలం చెలరేగినాక మ్యునిసిపల్ వారు ఆ బ్రిడ్జికి అటూ ఇటూ మనిషి పడడానికి వీలు లేనట్టుగా ఇనపతీగెలు కట్టేరు.

ఆ పరిస్థితులలోనే అప్టన్ సింక్లెయిర్ పై వాక్యాలను అంటూ ఇంకా ఇలా అన్నాడు-'ఆత్మహత్య చేసుకోవడం తప్పు' అనీ, ఇది ఆత్మహత్య చేసుకునేవాడి మానసిక దౌర్బల్యాన్ని సూచిస్తుందనీ నేను వప్పుకుంటాను. పిడుక్కీ, బియ్యానికీ ఆత్మహత్య చేసుకోకూడదని మాట నిజమే. కాని, ఏ మానవుడైనా ఆత్మహత్యా పర్యంతం వెళ్ళడానికిఒకేవొక కారణం ఉంటుంది. అది ఆర్థిక క్షీణత-ఇతర కారణాల వల్ల కలిగే ఆత్మహత్య ఉద్దేశాన్ని నిరోధించడానికి అవకాశా లనేకం వున్నాయి. కాని, ఆర్థికంగా మనిషి తల ప్రేలాడేస్తే వాడికి విమోచన ప్రభుత్వమేనా కల్పించాలి, లేకపోతే ఆత్మహత్యేనా...

నిజానికి, ఆత్మహత్యకు పూనుకోవడంవంటి మనోదౌర్బల్యం మరొకటి వుండబోదు.

మొగుడు కొడితే, ఆడది నూతికి దౌడుతీస్తుంది.

తను ప్రేమించిన స్త్రీ తనను నిరసనచేస్తే, యువకుడు విషంపాత్ర నోటముందర పెట్టుకుంటాడు.

కొంతమంది ఏవో దీర్ఘవ్యాధులతో




"ఏమండోయ్! అవి ఆడవాళ్ళసీట్లు; లేవండి"

---

బాధపడుతూ, అవి ఎంతకూ కుదరక, తమకూ, ఇతరులకూ దుర్భరమైన ఈ జీవితాన్ని కొనసాగించే కంటే అరనిముషంలో బలవంతంగా ప్రాణాలు తీసుకోవడం మంచిదని నిశ్చయించుకుంటారు.

కొంతమంది ఆర్థిక క్లిష్టపరిస్థితులలో చిక్కుకుని, బయటపడటానికి ఏ గత్యంతరం కానక తమ ప్రాణాలను తాము తీసుకుని విముక్తి పొంద బోతారు.

కొంతమంది కేవలం ఇతరులను బెదిరించడానికీ, రగడాయించడానికీ ఆత్మహత్య చేసుకుంటామంటారు.

ఇంకా ఇలాంటి పరిస్థితులు అనేకం వుంటాయి—ఒక వ్యక్తిని ఆత్మహత్యకు పురికొల్పేవి.

ఇలాంటి విషయాలు అన్నిట్లోనూ ఆత్మహత్యకు దిగేముందు బాగా నిదానించి, ఆలోచించడం అవసరం. బుద్ధి పుట్టగానే నూతికీ, ఏటికీ, నల్లమందు కొట్టుకీ, నూనె గానుగకూ, పరుగెత్త కూడదు.

బాగా ఆలోచించి చూసినపిమ్మట ఇంకొక్క అరనిముషంకూడా ప్రాణాలతో వుండటం దుర్భరం అని మీకు తోస్తేనే, మీరు మీ చేతులతో మీ ప్రాణాలను తీసుకుందుకు సిద్ధపడండి.

ఏమైనా, ఎలైనా పిడుక్కీ, బియ్యానికీ మాత్రం మీరు ఆత్మహత్యకు దిగ

కండి. అది నిజంగా మహాపాతకమే!

మీరు దమ్మిడీకి కూడా కొరగాని వారైతే—

ఏ పని చేసైనా సరే—ఏ వెధవపని చేసైనా సరే—గుప్పెడు మెతుకులు సంపాయించుకోలేకపోతేనూ—

మీకు సహాయం చెయ్యడానికి ఏ వెధవా కూడా పూనుకోవటంలేదనీ, పూనుకోడనీ తోస్తేనూ—

మీ ప్రాణమేనా తీసుకోవాలి లేకపోతే ఎదుటివాడి ప్రాణమేనా తీయాలి అనే గండగత్తెర పరిస్థితి వస్తేనూ—

మీకు రోగం ఇక ఎన్నటికీ తిన్న బడదనీ, ఇప్పుడు వుండే పరిస్థితులలో మీరు బ్రతికి వుండటం మీకూ, మిమ్మల్ని అంటిపెట్టుకున్న వారికీ దుర్భరమని తోస్తేనూ—

మీవల్ల లోకానికీ, లోకంవల్ల మీకూ అణుమాత్రమైనా లాభంగాని, సుఖంగాని లేదనీ, వుండబోదనీ ఘంటా పథంగా ఋజువైతేనూ—

పై పరిస్థితులు నిజంగా మీరు అనుకున్నంత క్లిష్టంగానూ ఉంటే, ఉన్నాయని మీరు ఋజువు చేయగలిగితే—

ఓ నిర్భాగ్యజీవీ! ఇక మీరు ప్రపంచం నుంచి వెళ్ళిపోవచ్చును—అటువంటి పరిస్థితులలో మిమ్మల్ని ఆగమని చెప్పడం నిజంగా మహాపాతకమే!

ఇంక అంతమట్టుకు వచ్చాక మీరు అవలంబించవలసిన పద్ధతులు...

కత్తులతో నరుక్కోకండి—కొన్ని కత్తులు సరిగ్గా తెగవు;

త్రాడుతో ఉరిపోసుకోకండి—చాలా సేపు కొట్టాడితేతప్ప ఈ విధంగా చావు సునాయాసంగా లభించదు;

నూనె, నల్లమందు, ఇలాంటి సాధనాల జోలికి పోకండి. అవి మీ కష్టాలను సునాయాసంగా పోనొట్టవు;

నూతిలో పడకండి — ఒక్కొక్కప్పుడు చావరు సరిగదా, గాయాలు అవుతాయి ఒళ్ళంతా;

సునాయాసంగా ప్రాణం తీయలేని ఏ విధానాన్నీ అవలంబించకండి;

పిస్తోలుతో ఘామ్మనిపించండి;

లేకపోతే ఎత్తయిన కొండమీంచి కిందకు దూకండి;

లేకపోతే క్షణంలో ప్రాణాలను తీసే రసపిపాదులను వేటినో ఉపయోగించండి.

చావు తప్పనిసరి అయితే సుఖంగా, వొళ్లు అలవకండా హరి మనడం ఉత్తమం



# వెన్నెల విరిగి పడింది...




చల్లని గాలి మెల్లగ వీస్తున్నది.

చల్లని వెన్నెల జలపాతమై కురుస్తున్నది.

జాజిపూల వాసనలు గాలితో పరుగెడుతున్నవి.

గడియారం పదిగంటలు కొట్టింది.

ఇందిర నిదుర రాని కన్నులతో పెరటిలోని వెన్నెలవైపు చూచింది. పెరటిలో వెన్నెల పవ్వళించింది ఒయ్యారంగా.

గాలి గట్టిగా వీచింది.

ఒక తీయని స్వరం గాలిలో కదిలి వచ్చింది.

ఒక్క ఉదుటున లేచి గది కిటికీ దగ్గరకు పరుగెత్తింది ఇందిర. కిటికీ లోంచి ఆత్రుతగా పెరటివైపు నున్న మేడపై గదివంక చూచింది.

'మనసున మల్లియలు

విల్లి విరిసాయి' — మేడపై గది లోంచి చల్లని వెన్నెలలో కదిలి జాలువారుతోంది అతని నోటినుండి తీయని పాట. తేనెజల్లు సన్నగ కురిపిస్తోంది వెన్నెల.

గదిలోనున్న విద్యుద్దీపకాంతిలో అతను కిటికీ ముందు కదలటం చూచింది ఇందిర.

కిటికీ చువ్వలకు మరీ దగ్గరగా కదలి, చువ్వలకు బుగ్గల నాచ్చి, ఆకాశం వైపు చూచింది ఇందిర. చల్లని చువ్వల చల్లదనం ఆమెలో తీయని అనుభూతిని కలిగించింది. చల్లగాలి ఒయ్యారంగా కదులుతూ ఆమె నుదుటిపైని ముంగురులతో సయ్యాట లాడుకుంటూ, ఆమె బుగ్గలలో విరిసిన గులాబీల అందాన్ని చూచుకుంటోంది.

అతని పాట ఆగిపోయింది.

గాలిలో కదిలే కొబ్బరాకులు, వర్షపు చుక్కలు నేలపై పడే శబ్దాన్ని చేస్తున్నాయి. గాలి కూనిరాగాలు తీస్తోంది.

మేడ గదిలోని విద్యుద్దీపాన్ని చూస్తూండిపోయింది ఇందిర. ప్రకాశరావు మంచంమీద కదిలిన శబ్దమైంది.

ఇందిర వెనుతిరిగి చూచింది ప్రకాశరావుని.

"ఇందూ! ఇంకా నిద్రపోలేదా?" అని అడిగాడు ప్రకాశరావు ఇందిర వైపు

'ఊర్వశి'

బద్ధకంగా చూచి. ఆతను పందిరిమంచం మీద హాయిగా పడుకున్న వెన్నెల వడిలోకి జరుగుతూ "ఊహూఁ! నిద్ర రాలేదు," అంది కిటికీవైపు తిరుగుతూ.

అత నింకేమీ అనలేదు. వెన్నెల పరుపుపై నిద్రకు ఒరిగాడు.

సన్నని తీవెలపై సన్నగ ఫిడల్ కమాను కదిలింది కాబోలు, సన్నగ విన వచ్చింది 'హంసా నందిని' రాగం. ఆనందంగా కిటికీవైపు చూచింది ఇందిర.

సృష్టిలో అత్యంత తీయనైన వస్తువు లందలి తీయదనం, అతి లలితంగా తీయబడి, వీనులు గ్రోలుటకు అనువుగా, వయోలిన్ తీవెలపైనుండి జాలువారుతూ చల్లని వెన్నెల సౌకుమార్యం ఒడలిలో నింపుకొని, మల్లిమొల్లల సువాసనలు ఒంటికి పట్టించుకొని స్రవంతిగా చేరు తోంది ఇందిర వీనులకు.

సంగీత స్రవంతిలో పయనిస్తూ చల్లని పిల్లతెమ్మరల ప్రేరితములై విసరబడిన సంగీతపు తుంపర్ల చల్లదన ముచే పరవశించిన మనసుతో ఇందిర గవాక్షం ముందు నిలబడిపోయింది, వయోలిన్ తీవెలపై ఒయ్యారంగా కదిలి వచ్చే కృతిని ఆలకిస్తూ.

గానంలో లీనమై, పాటలో పాటయై వయోలిన్ తీగలో తీగ అయి ఉండి పోవాలని ఎగసిపడింది ఇందిర మనసు. కోర్కెలతో ఉబికిన గుండెతో, మనసున విడిసిన కోర్కెలకు ప్రతిరూపాలనిపించి, సముద్ర తరంగములవలె చల్లగాలిలో హాయిగ కదిలే ముంగురులతో, వెన్నెలలో వెన్నెలై, చీకటి అందాన్ని కాటుకగా కళ్ళకు రంగరించుకొని, వెన్నెలకే వన్నె తెస్తూ, మరిగిన పాలపై విడిసిన పాల తరగలా నిలిచిపోయింది గవాక్షం ముందు ఇందిర.

హిందోళ రాగం ఎప్పుడు మొదలైందీ ఆమెకు తెలియదు. 'సామజవరగమన' కృతి హాయిగా సాగిపోతూనే ఉంది.

స్వరకల్పనలలోని హొయలు పరవసింప జేసాయి ఇందిరను. మనసు ఉరికలెత్తి నృత్యం చేసింది ఇందిరలో. ఆమె కళ్ళలో కాంతి కిలకిల నవ్వింది. పెదవులపై చిరునవ్వు మొగ్గలు తొడిగింది.

కృతి అయిపోయింది.

పాట గాలిలో మిగిలిపోయింది.

కొద్దిసేపుకు మిగిలింది కొబ్బరాకుల ధ్వని.

గాలిలో నిండింది పాటలో తీయదనం.

ఆమెలో నిండింది తీయని ఒక బాధ.

పాట చిలకరింపులలో మిగిలిపోయిన మధురపు పాటతుంపరులు ఆమె వీనుల పెదవులపై మిగిలి అప్పుడప్పుడు ఆమెకు రుచి చూపుతూ నిలిచిపోయాయి.

గాలి అదే కృతిని సన్నగా పాడు కుంటోంది.

మేడగదిలో దీపం ఆరిపోయింది.

యాంత్రికంగా పందిరిమంచాన్ని




"నీలగిరి ఎందుకూ ? పూరీ పోదాం పదండి."

చేరింది ఇందిర. ఇందిరలో అసంతృప్తి చూడలేక కిటికీదాటి నింగికెగసిపోయాడు చంద్రుడు.

ఆమెను, అతనిని దరిచేర్చి, తన బిగి కౌగిటిలోకి తీసికోవాలని ఉబలాట పడింది నిద్రాదేవి.

అశాంతి, అసంతృప్తి ప్రజ్వలింప జేసిన జ్వాలలు వేడి నిట్టూరుపుల రూపంలో వెలికి పోయాయి.

ఆమె బుగ్గల రెండు పెదవులు చమత్కరించాయి. ఆమె కది హాయికాదు; ఆమెకప్పుడు కావలసిన దదికాదు.

'సంగీత స్రవంతిలో మునిగితేలాలి. ఆతని గానంలో పరవశించిపోవాలి. ఆ గానంలో ఆమె ఏమైనా ఆమెకు పరవా లేదు. ఆమె కది కావాలి. చాల రోజుల నుండి నిరీక్షింపబడుతున్న అది కావాలి; స్వేచ్ఛగా రెక్కలు విప్పుకొని పరుగెత్తి పోవాలి. కోయిలగొంతులో తను పాట పాడాలి'— అది ఆమెలో విరిసిన కోరిక.

ప్రకాశరావు కౌగిలినుండి స్వేచ్ఛ పుంజుకొని, బలంగా ఊపిరిపీల్చుకొని, ఎదురుగావున్న గోడపై దృష్టి సారిం చింది. గోడమీద వ్రేలాడుతోంది దుమ్ము పట్టిన వయొలిన్ పెట్టె.

ఆమెలో పాతతలపులకు తలుపులు తెరుచుకున్నాయి...

చప్పట్లు మిన్నుముట్టాయి.

విద్యుద్దీపాల కాంతిలో ఫ్లాష్లైట్లు ఒక్కసారి మెరిసాయి. అధ్యక్షుని చేతిలో వెండికప్పు తళ తళ మెరిసింది. ఆయన కన్నులలో తృప్తి నవ్వింది.

సభలో కేరింతలూ, చప్పట్లూ మరల, మరల మిన్ను కెగిసాయి.

తృప్తినిండిన గుండెతో కప్పు నందు కుంది ఇందిర. ఆడిటోరియమ్ హర్ష ధ్వానాలతో ఉక్కిరిబిక్కిరైంది.

కప్పు నందుకుని ఇందిర వేదిక దిగి, సగర్వంగా స్నేహితురాం డ్రవైపు నడిచింది.

బహుమతులుపంచిఇచ్చిన అధ్యక్షుడు ఇందిర సంగీత ప్రతిభను. ఆమె పాండితీ ప్రకర్షను విశేషంగా పొగడి, ఆమె ఉజ్జ్వలభవిష్యత్తునకై దేవునకు కేలు మోడ్చాడు.

సగర్వంగా వయొలిన్వైపు చూచింది ఇందిర. ఆమె కన్నులలో కాంతి నిండి, ఆమెలో తృప్తి విరిసింది. మనసు పురి విప్పిన నెమలివలె నృత్యం చేసింది.

కాలేజీ ఆడిటోరియమ్ విడిచివస్తూ - అభినందించవచ్చినవా రందరికీ కృతజ్ఞ తలు తెలుపుకొని, వయొలిన్ పెట్టె పట్టుకొని రిక్షా ఎక్కింది ఇందిర. మనసున విరిసిన వెన్నెల ఆమె ఎదుట నున్నదంతా స్వర్గతుల్యంగా ఆమె భావించ ప్రోత్స హించింది.

దారిలో యామినితో మనసు విప్పి చెప్పింది ఇందిర :

"నేను వయొలిన్ వాయిస్తూంటాను. అతడు నా గానానికి పరవశించి నాముందు ఉండిపోతాడు. మా మీద వెన్నెల కురుస్తూంటుంది. ఆ వెన్నెలలో తడిసి పోతాము. సంగీతస్రవంతిలో జలకా లాడతాము; వెన్నెల జలపాతంలో తడిసి పోతాము; ఆ ఆనందంలో ఉక్కిరి బిక్కి రవుతాము. పువ్వుల పరిమళాలను సంగీతస్రవంతిలో రంగరించిపోస్తాము. చల్లనిగాలి మాపాట వింటూ పరవసించి నృత్యంచేస్తుంది. పాటలో పల్లవి నేనై పోతాను; అతడు నాతోపాటు గొంతు రాగ మాలాపిస్తాడు; సంగీతస్రవంతిలో ఈతపందాలు వేసికుంటాం; అందులోనే, అక్కడే ఉంటాం; ఆ అమృతా న్నే గ్రోలుతాం; అక్కడే ప్రాణాలు వదులుతాం —" మానసవీణ పలికే ప్రతి పలుకూ యామినిముందు వ్యక్తం చేసింది ఇందిర.

"నీ మనసు తెలిసి, నీ గానామృతాన్ని గ్రోలే భర్తను దేవుడు ప్రసాదించాలనీ, నీజీవితం స్వర్గతుల్యం కావాలనీ ఆ భగ వానుని కోరుతున్నాను. నీవు అటువంటి భర్తనే ఎంచుకో. సంగీత రసజ్ఞత తెలిసినవానినే నీ హృదయమందిరంలో నిల్పుకో. నీకు విజయం చేకూరాలని దేవుని మనసారా ప్రార్థిస్తున్నాను." అంది యామిని నిండుగ.

ఇందిర మధుర భావాల పందిరిలో పెళ్ళికూతురై పోయింది.




ఆమె తల్లిదండ్రులు, ఆమె అన్నదమ్ములు, అక్కయ్యలు, బావయ్యలు, వదినగార్లు అందరూ ఆమె సంగీతప్రజ్ఞ గుర్తించి గర్వించారేగాని, ఆమె మనోగతం తెలిసికొనలేకపోయారు.

'తనలో ప్రతిభ గుర్తించగల భర్త లభించాలి. సంగీత రసజ్ఞత తెలిసిన వారికే తన సన్నిధానంలో ఉండే అర్హత ఉంది. తనతోపాటు గొంతెత్తి పాడే భర్త కావాలి'_ ఇదీ ఇందిరకోరిక; ఇదీ ఆమెలో నిలిచిన కల.

అత్యంత శ్రమ కోర్చి నేర్చుకుంది సంగీతం_కాలేజీవేళలకు, సంగీతపాఠాల వేళలకు ఒప్పకపోయినా, దూరమైనా, భారమైనా, అన్నింటినీ ఓర్పుతో సరిదిద్దుకొని నేర్చుకుంది సంగీతం. సంగీత లక్ష్మి సాక్షాత్కారానికై తపసు చేసింది. ఆమె తపము ఫలించింది. సంగీతానికి రూపకల్పన చేసింది. భావాలను జీవింపచేసింది. ఆ భావాలను కదిలే బొమ్మలు జేసింది. సంగీతంలో నూతనప్రక్రియలకైన అన్వేషణలో తృప్తి సాధించుకుంది.

సంగీతమే జీవితమైంది.

స్వరకల్పనలే గమ్మత్తైన సమస్యలైనాయి. సంగీతసాధనే జీవితధ్యేయమైంది.

పరవసించిపోవటంలో ఆమెకు అన్నపానీయాలు లభించాయి.

కాలానికిఉండేవేగం ఆమెకు తెలియ లేదు. కాలేజీ వదలిపెట్టేసింది.

ఆమె వివాహం కుటుంబమందరి బాధ్యతైంది. పెళ్ళికుమారులకై అన్వేషణ గడిచింది. ఇందిర తన భావాలను వ్యక్తం చేసింది వరులముందు. అర్హత లేని వరులు పెళ్ళికి అంగీకరించలేక పోయారు.

ఆమెలో వెన్నెల మసక జారింది.

ఆమెలో అశాంతి మొక్క మొలిచింది.

కొన్నినాళ్ళకు ఆమె వివాహం ఒక సమస్యగా పరిణమించిం దా ఇంటిలో.

ఆమె కన్నది కలే అని నిర్ధారణకు వచ్చింది ఇందిర.

సంగీతగంధం లేని ప్రకాశరావును వివాహం చేసికోక తప్పలేదు.

అయినా ఒక ఆశ ఆమెలో గాలి పీల్చుకుంటూనే ఉంది.

సంగీతానికి తలూపని జీవి లేదనీ, సంగీతం ఆస్వాధించలేనివా రుండరనీ ఆమె నమ్మకం. అదే నమ్మకంతో ప్రకాశరావుకు సంగీతాభిరుచి కలిగించి, తనముందు నిలుపుకోవాలని ప్రయత్నించింది ఇందిర

'రాగాల భేధాలు తెలియకపోవచ్చు; తాళాల మార్పులు గుర్తెరగకపోవచ్చు; స్వరకల్పనలో మెలకువలు తెలియక పోవచ్చు; కాని, ప్రతి మానవుడు శృతి, అపశృతుల మధ్యగల కొట్టవచ్చినట్టు కనపడే తేడా గుర్తించగలడు. అపశృతి లేకుండ వెలువడే నాదాన్ని, సంగీతంగా గుర్తించి ఆస్వాదించకుండ ఉండలేడు_' అనుకునేది ఇందిర. కాని సంగీతమంటేనే చెవులు మూసుకునే ప్రకాశరావుకు శృతి, అపశృతులు గుర్తించే పాటి శ్రద్ధ ఎందుకుంటుంది?

'స, రి, గ, మ, ప, ద, ని'ల మధ్య సృష్టింపబడిన సంగీతం నిత్య జీవితంలో ప్రతిపాటకు ప్రాతిపదికగా ఉందనీ, రాగ, తాళ, భావాలతో వెలువడే ప్రతిదీ సంగీతమేననీ, సంగీతమనేది ప్రత్యేకంగా ఏదీ లేదనీ, గీతంలో స, రి, గ, మ లు దొర్లినంత మాత్రాన దానిని ద్వేషించేపని లేదనీ, ప్రతి కృతి ఒక్కొక్క మాదిరి లెఖలాంటిదనీ, నాటి నుండే నిత్యజీవితంలో కూనిరాగాలు తీసికొని, ఈలపాటలు పాడుకునేందుకు పాటలు ఉద్భవిస్తున్నాయనీ తెలియని మేధమేటిక్సు లెక్చెరర్ ప్రకాశరావుకు తెలియజెప్పలేకపోయింది ఇందిర.

నాటుగోడుమీద బండిని భుజాలపై వేసికొని పరుగెత్తే ఎడ్లమెడలో మువ్వలు సృజించేనాదంలో 'సంగీత' ముందనీ_

చెట్లు పుట్టలు దాటుతూ, రైలుపట్టాల మీద రైలుచక్రాలు చేసే ధ్వనిలో చక్కటి 'లయ' ఉందనీ_

జలజల రాళ్ళపైనుండి పారే నదీ నీరాలు చేసే శబ్దాలలో తీయని 'పాట' ఉందనీ _

తాటిచెట్టు చిట్టచివర ఒంటిగ విడివ

ఢీన తాటాకు చీలి సన్నగ సాగే గాలిలో లయబద్ధంగా ఆడుకుంటుందనీ - తెలియని ప్రకాశరావులో సంగీతాభిరుచి కలిగించటం సీటితో దీపాన్ని వెలిగించటం- అని అనుకుంది ఇందిర.

ఇందిరకు పెళ్ళయిన కొత్తలో ఒక నాడు:

ఆరోజు వెన్నెల పండుగ చేసికుంటోంది.

ఇందిరను పిలవడానికి వెన్నెల, ఇందిర ఇంటి డాబాపై తిష్ట వేసింది.

మంచంమీద తాంబూలం సేవిస్తూ వెన్నెల్లోకూర్చున్న ప్రకాశరావు గుండె మీద తల వాల్చిన ఇందిర అంది 'హాయిగా పాడుకుందామా?' అని.

"నేనా? నాకు పాటలు రావు. నీవు పాడు, నేను వింటాను."

"ఉండండి, వయోలిన్ తెస్తాను," అంది ఇందిర.

"అ దెందుకు ఇందూ మధ్యన?" అన్నాడు.

"నా గొంతు అంత శ్రావ్యంగా ఉండదు. వయోలిన్ మీద అయితే పాట పాడుకోడాని కేమీ ఇబ్బంది ఉండదు," అంది.

"బాగోకపోయినా ఫరవా లేదు. అలాగే పాడు. నీవుమాత్రం కదిలిపోకు," అన్నా డతను.

కొద్ది క్షణాలలో తెలిసికుంది ఇందిర- అతడికి కావలసినవి సినీమాపాట లనీ; ఏ త్యాగరాజుకృతీ అతన్ని మెప్పించ లేదు అనీ. మళ్ళీ ఏనాడూ అలాంటి కోరిక కోరలేదు అతన్ని. వెన్నెల రాత్రులు చాలా గడిచిపోయాయి. ఏ నాడూ వయోలిన్ నోరు మెదల్పలేక పోయింది. వయోలిన్ పాడుకోడానికి అవకాశమున్నా, నిరాశకొండల ఎదుట పాడుకోడానికి ఆమె మనసు అంగీకరించలేదు.

ఒక్కొక్కరోజు ఎవరో విద్వాంసుడు రేడియోలో గానం చేస్తుంటాడు. ఇందిర ఆ స్టేషన్ పెట్టుకొని వంటింటిలో పని చేసికోడానికి వెళ్ళిపోతుంది. కొద్దిసేపటిలోనే ఆమెకు 'సిలన్' రికార్డ్సు వినవస్తాయి. ఇందిర దెబ్బతిన్న పక్షిలా గిలగిల లాడుతుంది.

కాలం గడిచిపోతునేఉంది.

సిలన్ పాటలు, ఇంగ్లీషు ట్యూన్సు, ఆమె తీరని కోరికలను బందీ చేశాయి.

వయోలిన్ గోడ కెక్కింది.

వయోలిన్ పెట్టె దుమ్ము పట్టింది....

వారంరోజుల క్రితమే ఖాళీగా ఉన్న పెరటింటి మేడపై అతడు దిగాడు. అంతకుముందు చాలాకాలంనుండి ఆ మేడ ఖాళీగానే ఉంటోంది. ఒకానొక రోజు అనుకోకండా మేడపైనుండి సన్నగ వెలువడే వాయిద్యం విని పరుగులెత్తింది ఇందిరమనసు మేడమీదికి.

పగలు ఇంట నుండ డతను.

రాత్రి తొమ్మిది, పది గంటలకు ఇల్లు చేర్తాడు. ఒక గంటో, అరగంటో పాట పాడుకుంటాడు; తరువాత నిద్రపోతాడు.

ఆతని పాట వినగానే ఆమెలో ఆశ చిగిర్చింది. ఆమెలో కోర్కెలు మొల కెత్తాయి. అతని సంగీతం ఆమెలో శారదరాత్రులు పూచాయి.

ప్రతీరోజు అతని పాటకై వేచి ఉండటం, పాట వింటూ అవ్యక్తానందం అనుభవించటం, గీతం అయినవెనుక ఆమె తన దురదృష్టానికై అంగలార్చటం పరిపాటి అయిపోయింది ఇందిరకు.

'తా నున్నది నరకంలో, ఎదుట నున్నది స్వర్గం' అన్న తలంపు ఆమెకు వచ్చినప్పుడల్లా ఆమెలో తీవ్రసంచలనం కలిగేది. దాని పర్యవసానం, తా నున్న జీవితంపై రోతా. తను ఉన్న వాతావర ణంపై విసుగూ ఆమెలో భగ్గునమండేవి.

జ్ఞాపకాలను నెమరువేసికుంటున్న ఇందిరకు చాల రాత్రివరకూ నిద్ర పట్ట లేదు. మూడుగంటలు అయినతరువాత మగతనిద్ర పట్టింది.

నిద్రపోతున్న ఇందిరకు తీయని సంగీతం వినవచ్చింది. ఉలికిపడి లేచింది ఇందిర. మేడమీద గదిలో దీపం వెలిగి ఉంది. గదిలోనించి వినవస్తోంది వయో లిన్‌నుండి సంగీతం. ఇందిర మంచం మీదనుండి లేచి కిటికీముందు నిలబడింది. సంగీత సుధాంబుధి పొంగి పొరలి పోతున్నది. నెమ్మదిగా పెరటిలోకి వెళ్ళి నిలబడింది ఇందిర. చంద్రుడు మబ్బు పరదాలనుండి వెలువడి, అవి కనుచూపు మేరలో లేకుండా చూచుకొని, తారలతో హాయిగా ప్రణయగీతికలాలపిస్తున్నాడు. చల్లగాలిని కవ్విస్తున్నాడు. వెన్నెల జల పాతంలో స్వేచ్ఛగా జలకమాడుతున్న పూవులవైపు సిగ్గులేక ఒళ్ళంతా కళ్ళు చేసికొని చూస్తున్నాడు చంద్రుడు.

సంగీతం రసాస్థాయి నందుకుంది.

సంగతులలో చమత్కృతులను ఒక్క బిగిని చూపిస్తున్నా డతను. ఒక్కొక్క గమనంలో ఒక్కొక్క భావం, ఒక్కొక్క భావంలో ఒక్కొక్క రూపం, ఒక్కొక్క రూపంలో ఒక్కొక్క అనుభూతిని చూపి స్తున్నా డతను.

రాగస్థాయి పెంచటంలో ప్రతిభను అతిసున్నితంగా చూపిస్తున్నా డతను.

రబ్బరులా సాగే గాలిలో హాయిగా పయనిస్తున్నది గీతం. ఆ గీతంలో పయ నిస్తోందొక తీయని భావం. ఆ భావనలో మెరిసిందొక తీయని తలపు. అదేతలపు ఇందిరలో స్వేచ్ఛకు ప్రాణం పోసింది.

ఇంటిలోకి పరుగెత్తింది ఇందిర.

ధూళిధూసరితమైన ఫిడల్ పెట్టె గోడనుండి దింపింది. పెట్టె తెరచి ఫిడల్ అందుకొని పెరటిలోకి పరు గెత్తింది; చీరచెరగుతో ఫిడల్ గబగబా తుడిచి, అతనికి ప్రత్యర్థిగా నిలచి, పెర టిలో ఉండి, స్వరకల్పనలో తన స్వతంత్ర భావాలను, కల్పనలలో ఊహిం చని హొయలను వ్యక్తంచేసింది ఇందిర.

ఆమె పిలుపు నందుకొని అతను ఆమెకు చక్కటిసమాధానం చెప్పడంలో నిమగ్నుడైనాడు. ఆమె రూపొందించిన సంగతులకు తీసిపోనివానిని సృజించి విడిచిపెట్టా డతను.

అతను ప్రాణం పోసిన ప్రతి స్వర మునకు కళను దెచ్చింది ఇందిర.




పోటీ ముమ్మరంగా సాగిపోతున్నది.

ప్రకృతి ఊపిరి బిగబట్టింది

చంద్రుడు కంగారుగా చూస్తున్నాడు వారివైపు. ఆమెకు ఒంటినిండా చెమటలు పట్టేసింది. అయినా తన పట్టు వీడలేదు. తన ధీరత ప్రకటిస్తూనేఉంది.

అతను ఆగిపోయాడు. అది ఓడిపోడానికి గుర్తు.

విజయశంఖం పూరించి ఇందిర కూడా ఆగిపోయింది. అతను పరుగున మేడ దిగివచ్చాడు. ఇందిర ముందు వయోలిన్‌తో నిలిచాడు.

"మీరు నన్ను గెలిచారు. నేను మీతో ఓడిపోయాను," అని వయోలిన్ ఆమె ముందుంచి, ఆమెను సమీపించి "మీ సంగీతం నన్ను ముగ్ధుడిని చేసింది. నేను మీ దాసుడను. నాతో వచ్చేయండి. సంగీతసామ్రాజ్యంలో రాజ్యం చేదాం," అని అన్నాడు.

ఇందిర అతనివైపు భయంగా చూచి వెనక్కు ఒక్క అడుగు వేసింది.

"సందేహిస్తారేం? మీ మనసు నాకు తెలుసు. మీకు ప్రకాశరావు ఏది ఈలేదో దాన్ని నే నియ్యగలను. రండివెడదాం," అంటూ చెయ్యి పట్టుకున్నాడతను.

ఆమె నేదో అవ్యక్తశక్తి వెనక్కు లాగింది. "వద్దు. వద్దు, నన్ను వదలండి;" అంటూ కేకలు వేసింది.

"కోర్కెలు చంపుకొని ఎంతకాలం మసలగల రతనితో. వచ్చేయండి," అంటూ ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

"వద్దు, వద్దు; నన్ను వదలండి." అంటూ కెవ్వున కేకవేసి క్రింద పడి పోయింది ఇందిర.

"ఇందిరా ! ఇందిరా ! ఏమిటి ? కల గన్నావా ? కళ్ళు తెరువు," అంటూ భుజాలు గట్టిగా తట్టి అంటున్న ప్రకాశ రావు మాటలు విని కళ్ళుతెరచి చూచింది.

అంతా కల !

అయోమయంగా అతనివైపు చూచింది.

"కలగన్నావా?" అంటూ ఆమెముఖం మీది చమట తుడిచాడు ప్రకాశరావు.

ఏదో మాటాడబోయి మాటాడలేక ప్రకాశరావు చేతుల్లోకి ఒరిగిపోయింది ఇందిర.

ఉదయ పవనాలలో 'మలయ మారుతం'లో కృతి చల్లగ చేరింది ఇంది రను. హాయిగా సాగిపోతోంది కృతి. జోగుతున్న ప్రకృతి నిద్రలేచి హాయిగా ఆవులించింది పక్షుల కిలకిల రావాలకు తోడు, ప్రకృతి హాస్యం. పన్నీరు జల్లులాంటి తీయని కృతి క్రొత్త అందా లను కూర్చుతున్నాయి, ఇందిర మనసులో వెన్నెల ఉవ్వెత్తుగ ఎగసింది. కాని ఆ ఆహ్లాదం ఎంతోకాలం నిలువలేదు. కృతి వింటూంటే కలిగిన తీయని అను భూతి ఎందుకో ఒక్కసారి కొరడుబారి పోయింది. విరిసిన వెన్నెల ఒక్కసారి తిరిగి పడిపోయింది. మెరుపుతీవెలమధ్య నృత్యంచేసే మనసు ఒక్కసారి చీకటి అగాధాలలోకి జారిపోయింది.

మనసులో చీకటితుఫాను చెల రేగింది. సన్నటి తీవెలమీద హాయిగా సాగిపోయే 'హంసానందిని' రాగంలో ఇప్పుడు తీయదనంలేదు. ఆ గానంలో ప్రశాంతపు అలలు లేవు.

ఆ గానంలో విరిసిన ప్రతిస్వరం ఉధృతమై ఉవ్వెత్తుగ లేచే సముద్రపు టల — ఆ గానానికి ప్రాణమైన రాగం; ఆమెకు మూర్ఖమై వీచే తుఫానుగాలి — కమాను చూపే ప్రతి గమనంలోని మెలకువా, భూమిని మూటగట్టి మింగే ఉరుము సమానం.

ఆతని గానం ఆమెకు మత్తెక్కిం చటంలేదు. ఆమెను పిచ్చి ఎక్కిస్తోంది.

ఆతని గానంలో తీయని హాసంలేదు. ఆతనిగానంలో ఆమెకై పరిహాస ముంది.

ఆతని గానంయెడ ఆమెకు గౌరవం లేదు భయ ముంది.

ఉధృతమై, భీభత్సమై, వికటహాసం చేసే సముద్రపుటలలు ఒక్కసారి మిన్ను కుండిపోయాయి

ఆతని గానం ఆగిపోయింది.

అప్పుడే బద్ధకంగా ఆవలిస్తు ప్రక్కమీద పొర్లాడుతున్న ప్రకాశరావుక దగ్గరగా జరిగి అన్నది ఇందిర.

"మన మీ ఇల్లు మారిపోదాం," అని

——

# సనాతనపురం వాసులు

ప్లీడరు శైలేశ్వరబాబు హఠాత్తుగా కనిపించకుండాపోయారు. ఆయన కొంచెం ప్రాయం మిగిలినవాడు కూడా. ఇదే కారణం చాలు ఆ గ్రామస్థులు ఆందోళన పడటానికి, పత్రికలో ఆయన బొమ్మవేయించీ, సభలు చేయించీ, కవిత్వాలు రాయించీ సనాతన పురవాసులు అనాయాసంగా తమ ఉద్రేకాన్ని వెలిపుచ్చడానికి. కాని ప్రస్తుతం వారివేమీ చేయటానికి వీలులేకపోయింది. అందుకేతసే వారు ఒకరిచెవిలో ఒకరు చెప్పుకు సంతృప్తిపడ్డారు. ఎందుకంటే, అతనితోపాటు చాకలి శ్యామ కూడా కనపడకుండా పోయింది

ఊళ్ళో పెద్దలూ, శైలేశ్వరుడి హితైషులూ ఈ వార్తను అణిచివేయటానికి తమ కాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. హోల్‌దార్‌గారు కనపడ్డ వారికెల్లా శైలేశ్వరుడు కేసు విషయములో 'ఖుల్నా' పోయాడనీ, పోయేటప్పుడు తను చూచాననీ చెప్పుతున్నాడు.

ఇది సర్వ అబద్ధం — పళ్ళువచ్చిన హోల్‌దార్‌గారు ఇది ప్రచారం చేస్తున్నప్పటికీ, ఈ హోల్‌దార్‌గారే సాయంత్రము, ముసలి ఖాదుడీని కలుసుకున్నప్పుడు – 'ఛి, ఛీ! ఆఖరికి మన శైలేన్ ఇలాంటి పని చేశాడేం?' మెల్లగా అన్నాడు అతనితో.

ఈ విషయంలో ఖాదుడీ మహాశయుడుకూడా ఏమీ అభిప్రాయభేదం చూపించలేదు. ముక్కూమొహం కుదించుకుని – "అరే, ఆ సంగతెందుకు తెస్తావు, ఛా, ఛా!" అన్నాడు.

అన్నాడే కాని అంతటితో ఆగలేదు. మళ్ళీ వెంటనే మహా ఉత్సాహంతో – "సరేగాని, ఆ చాకలిదాని పేరేమిటో!" అన్నాడు.

ఈ విషయంలో ప్రతిచిన్న వివరమూ హోల్‌దారికి బాగా తెలుసునన్నట్టు ఆయన చెప్పిందాన్ని బట్టి తెలుస్తుంది. ఆయన ఆ చాకలిది ఉండే చోటూ, దాని ఆకారమూ, వయసూ, దాని స్వభావమూ, నడతా విషయమై పెద్ద ప్రమాణానికి పోకుండా చిన్న లెక్చరు ఇచ్చి, దానికి ఉపసహారంగా ఇలా చెప్పాడు – "శైలేన్ లోలోపల ఇంత కొండ జరుపుతున్నాడని ఎవరికి తెలుసూ? అంత పెద్దకొడుకూ, అంత పెద్దకూతురూ...."

ఖాదుడీగారు ఇక వినలేదు –

"ఛా, ఛా! లోకులు నవ్వుతారని కూడా లేదు!" అన్నాడు.

చాకలి శ్యామ లేచిపోయేనాటి కిందటిరోజున దాని మొగుడు పేరాయి చేతులో దెబ్బలు తిన్నదని, మల్లిక్ కక్కాయి ఎలాగో అతితెలివిగా ఈ సంగతి కూపీతీశాడు. మల్లిక్ కక్కాయి కూడా శైలేశుని మేలుకోరేవాడే. అతను చాకలి పేరాయిదగ్గరికి పోయి, "ఈ సంగతి ఎవ్వరిదగ్గరా బయట పెట్టమాకు, తెలిసిందా?" అన్నాడు.

పేరాయి ఆశ్చర్యంతో "ఏసంగతి?" అని అడిగాడు.

మల్లిక్ మహాశయుడు దిమ్మెరబోయి, మాటలు తడబడగా, అక్కడినించి తప్పుకుని వాళ్ళగుంపులో వచ్చి కలిసి, జరిగిన వ్యవహారం బయట పెట్టాడు. బయటపెట్టటమే తడవుగా అంతా మల్లిక్ మీద విరుచుకుపడ్డారు! ఎందుకు అతను చాకలి పేరాయి దగ్గరికి పోవాలి? ఏమిటీ తెలివితక్కువా?

మల్లిక్ చేసిన తెలివితక్కువపని సర్దటానికిగాను తెలివితేటలుగల ముఖర్జీగారు, తనకుదానై బయలుదేరి చాకలి పేరాయి దగ్గరికి పోవలసి వచ్చింది. అమాయకుడైన మల్లిక్ మీద లేని దోషం ఆరోపించి చెప్పవలసి వచ్చింది: "మల్లిక్ మాటలు ఏమీ పట్టించుకోమాకు; పేరాయి, అతను భంగుతాగి అని ఉంటాడు," అన్నాడు.

ఈ మాటుకూడా పేరాయికి ఆశ్చర్యము కలిగింది: "అంటే? ఏమిటి తమరు చెప్పింది?" అన్నాడు.

ముఖర్జీ పళ్లు ఇకిలించి—"అంటే నా? ఏమీలేదులే! — తెలిసిందా? ఆఁ?" అని ఆయన చల్లగా తప్పుకువచ్చి గుంపులో కలిసి – "అబ్బ! పేరాయి పిచ్చికుక్కలాగా తయారయాడోయ్! ఈమాటు మనమల్లిక్ తాచుపామును తొక్కాడు!" అన్నాడు.

ఇక అందరికీ కోపం వచ్చి మల్లిక్ మీద కత్తులు దూశారు! మల్లిక్ పాపం ఆ గుంపు వొదిలి ఒక్కడే తప్పుకు తిరగసాగాడు. పేరాయి ముఠావాళ్లు మల్లిక్ దూరదూరంగా తిరగటం చూసి, నవ్వుకున్నారు. ఈ మధ్య భంగులు ఎక్కువగా తాగుతూ వుండవచ్చుననికూడా అనుకున్నారు!

ఏమైనా కానివ్వండి, శైలేశ్వర బాబు బంధువులూ, హోల్ దారూ, ముఖర్జీ మొదలైన పెద్దలంతా ఒక్కటై, ఒక్కగొంతుతో శైలేశ్వర బాబు ఖుల్నా పోయిన విషయం సమర్థించటం మొదలుపెట్టారు. కాని లోలోపలమాత్రం భాదుడీ కుతూహలుడూ, ముఖర్జీ ఉత్తేజుడూ, హోల్ దార్ విస్మితుడూ, మల్లిక్ కుపితుడూ అయారు.

ఇది శైలేశుని హితులసంగతి. కాని సనాతనపురం చిన్నది కాదు. తర




తరాలనించీ, ఉన్న కుటుంబా లెన్నో ఉన్నాయి ఆ వూళ్ళో. కచేరిచావిళ్ళు కూడా రెండువున్నాయి ఆ వూళ్ళో. అంచేత అతనికి విరోధివర్గంకూడా ఉంది ఆవూళ్లో. శైలేశ్వరబాబు సత్యవాది, పరోపకారి. తనపని తాను చూసుకునేవాడు, గొప్పవాడు. వీటికి అనుగుణ్యంగానే అతని శత్రువర్గం కూడా ఎక్కువగానే ఉన్నారు. వారి కిప్పుడు మంచి అదను చిక్కింది. శైలేశ్వరుడూ – చాకలిదాని వ్యవహారమూ–దానికి ఇంకొంచెం కలర్ ఇచ్చి ప్రచారం చేయటం సాగించారు.

ఒకతను వచ్చి – "శైలేశ్వరబాబు ఖుల్నా పోయాడని చెప్పుతున్నాడే, హాల్‌దార్ గారు!" అన్నాడు.

హుక్కా రెండుమూడు పీల్పులు పీల్చి రాయ్‌మహాశయుడు – "ఐతే నువు పోయి హాల్‌దార్‌తో సూర్యుడింకా పొడవటం లేదని చెప్పు! – మాకంతా తెలుసు–" అన్నాడు.

తల ఎగురవేసి, మందహాసం చేస్తూ లాహిడీమహాశయుడు అన్నాడు: "ఎందుకండీ అంతకోపం! ఇట్లాంటి మాటలు హాల్‌దార్ కాకపోతే ఇంకెవరు చెప్పుతారు. అసలు వాళ్ళ ముఠావాళ్ళంతా అంతే. మిత్రా ఉన్నాడే – అన్నేళ్లు వచ్చినై–మొన్న

చాటుగా తాగి తిరిగుతున్నాడు. పైగా ఆయన పంతులట! ఖాదుడీమాత్రం తరుగా? ఆయన రోజూ తాళ్ళచెరువు దగ్గర తిరుగుతూంటాడు, ఎందుకూ?"

వృద్ధ గోస్వామి ఇంతవరకు ఏమీ మాట్లాడలేదు.

"అంతా శ్రీవైష్ణవులే!" అన్నాడు ఈమాటు క్లుప్తంగా.

'ఈమాటు శ్రీవైష్ణవుడు చిక్కాడులే;' అని రాయ్‌మహాశయుడు హుక్కా గోస్వామికి ఇచ్చాడు.

* * *

## 2

దీనికి ఫలితంగా కొద్దిరోజుల్లోనే శైలేశ్వరబాబును అడ్డం చేసుకుని ఖాదుడీమీద రాయీూ, రాయ్‌మీద ముఖర్జీ, ముఖర్జీగారిమీద గంగూలీ తిరగబడటం సాగించారు.

కలలోకూడా అనుకోనటువంటి విషయాలన్నీ శైలేశ్వరుడిమీద ఆరోపించబడినై. చాలామంది అభిప్రాయం అతను కలకత్తాపోయాడని. కాని వీళ్ళకి ఎదురుగాకూడా ఒకపార్టీ ఉంది. వీళ్ళేమంటారంటే ఆయనమాత్రం "రైలెక్కి ఎక్కడికీ పోలేదు. ఎందుకంటే అతను రైలెక్కడం స్టేషనులో ఉన్న ఒక్కరుకూడా చూడలేదు. కాబట్టి ఆయన కాలినడకనే పోయి చాకలిదానితోపాటు ఎక్కడో తల దాచుకున్నా" డని వాళ్ళ అభిప్రాయం.

"శైలేశ్వరబాబు చాకలిదాన్ని వీపు నెక్కించుకుని, చేలల్లోగుండా పరుగెత్తుతూ ఉండడం నేను స్వతహాగా చూశా,'నని ఒకడు నొక్కి చెప్పాడు!

## 3

శైలేశ్వరుని భార్య, కొడుకూ కూతురుతోపాటు కన్నారింట ఉన్నది. కాని ఈవార్త దావానలంగా అక్కడికి చేరేవరకు ఆమె చకితురాలై, భయపడి ఇంటికి చక్కా వచ్చింది! కాని ఇక్కడికి వచ్చి ఆమె ఇంకా తిరుగుడులో పడింది. ఆమె ఈడు స్త్రీలంతా ఆమెను ఓదార్చినట్టుగా దగ్గరికి వచ్చి, చిత్రచిత్రమైన మాటలన్నీ సులువుగా అనేసి పోయారు. ఒకావిడే – "అయ్యో, ఎవరన్నా వింటే సిగ్గుతో చావవలసిందేగాని ఇంకేమన్నా ఉందా?" అని బుగ్గను వేలుపెట్టుకుని మెడ వంకరగా పెట్టింది.

"మగవాళ్ళని నమ్మకూడదు చెల్లీ! ఎంతమాత్రం నమ్మకూడదు! – మనం మొహం ఎదుట లేకపోయ్యామంటే ఇక చెయ్యిజారిపోయినట్టే!" అన్నది గంగూలీ భార్య.

హాల్దారుభార్య సానుభూతి కొంచెం చూపుతూ – "మావారు, వీరు ఖుల్నా పోయారని గామాలు చెప్పుతున్నా!" రన్నది.

ముఖర్జీ భార్య గద్దిస్తూ– "ఇక ఆపవే చాలు నీ తెలివి! మా ఆయన మాత్రం





"చూడండి, డాక్టరుగారూ! ఇన్‌ఫ్లూయెంజా అంటువ్యాధికదా! మావారిని ఆస్పత్రికి పంపించే ఏర్పాటు చెయ్యకూడదూ?"

అనటంలా! దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకున్నారట! – నేను అందుకనే చెప్పేశాను – ఇక వాళ్ళల్లో పోయి కలిస్తే నేను ఎంతమాత్రం ఊరుకోనని! ముసలాళ్ళు అంతపొద్దుపోయిందాకా బజార్లో ఏంచేస్తారు?" అన్నది.

ముఖర్జి భార్య ముక్కెర అటుఇటూ ఊగులాడింది.

శైలేశ్వరుని భార్య సగం చచ్చి అన్నది: "కాని నే నెప్పుడూ చూడ లేదు, వారు చాకలి శ్యామతో మాట్లాడటం! మా గుడ్డలు ఉతికేది చాకలి శీనాయి. శ్యామ మా యింటి కెపుడూ రాలేదు–"

"నీ తెలివితేట లిలా మున్నకాబట్టే నీ మొగు డిలా పోయింది! వాళ్ళు చేసేవన్నీ నిన్నక్కడ సాక్ష్యం పెట్టి చేస్తారేమిటి? శైలేశ్వరబాబు అసలే ప్లీడరు! ఆయన చిక్కుతాడా! వ్యవహారాల్లో! మగవాళ్ళని స్వాధీనం చేసుకోవటానికి ఒకటే మార్గముంది – కనుమరుగు కానివ్వకపోవటం, కంటికి కనపడకపోయినా–" అన్నది ముఖర్జీ భార్య

## 4

శైలేశ్వరబాబుకు కొడుకు లిద్దరు; మాధవుడూ, యాదవుడూ. మాధవుడు బి. యే. పాసయ్యాడు; యాదవుడు ఇంటర్ చదువుతున్నాడు. వాళ్ళు పూజ్యమైన తండ్రిగారిమీదపడ్డ కళంకానికి ఆశ్చర్యపోయారు? వాళ్ళ

స్నేహితులుకూడా ఇది నిజమేనని నమ్మి కూర్చున్నారు. కాని వాళ్ళలోకూడా కొంతమంది కుర్రవాళ్లు వీళ్ళ తరఫున లేకపోలేదు - వాళ్లు నోటి సానుభూతి చూపించసాగారు.

ఇట్లు ముసలివాళ్ళలో తగువు చాలా బలిసిపోయింది! హాల్దారుగారిమీద రాయ్ మహాశయుడు ఎంత కథుపట్టాడంటే, అతనిమీద గుమ్మడికాయల దొంగతనం ఆరోపించి కేసుపెట్టాడు. భాదుడీగారు మాణిక్ పోద్దార్ దగ్గర ఇంతవరకు ప్రోనోటు రాసి అప్పు తెచ్చుకున్నాడు. ఇప్పుడు గంగూలీ గారు ప్రోత్సహించటంవల్ల పోద్దార్ భాదుడీని డబ్బు కక్కమని కూర్చున్నాడు. మల్లిక్ హోమియోపతీ వైద్యుడు. ఆయన ఎదురుపార్టీవాళ్ళకి మందు లివ్వనని చెప్పుతూ తిరగటం ప్రారంభించాడు. అందుకని గోస్వామి గారు కలకత్తా వెళ్ళి "హోమోపతీ చికిత్స" ఒకపుస్తకం కొనుక్కొని వచ్చి, వైద్యంనేర్చుకోవటంప్రారంభించాడు.

శైలేశ్వరునికి రెండుమూడు ఉత్తరాలు వచ్చినై. అవి ఎట్లాపడినవో శత్రుపక్షంవాళ్ళ చేతుల్లో పడ్డవి. ఈ సంగతి తెలిసి అనుకూలురు మండిపడి పోస్టుమాస్టరుమీద పదిపేజీలు రిపోర్టు రాసి పైకి పంపించారు.

పాపం, పోస్టుమాస్టరు ఈ ఆపద తప్పించుకోటానికి ఇల్లిల్లూ తిరిగి, అందరి కాళ్లూ పట్టుకోసాగాడు. ఆ ఊళ్ళో ఉన్న సెకండ్‌గ్రేడ్ ప్లీడరు ఆశుబాబు బల్లగుద్ది — "Everything is fair in love and fight." ఆఖరిదాకా పోట్లాడి చూసిగాని వదల," నని చెప్పివేశాడు.

## 5

సనాతనపురంలో మళ్ళీ ఆందోళనగా వుంది. అందరినోళ్లూ ఏదో వాగుతూ ఉన్నై. ఈమధ్య రెండు ఘటనలు ఘటిల్లినై ఆ ఊళ్ళో.

హటాత్తుగా చాకలి శ్యామ ఎక్కడినించో తిరిగివచ్చింది. అది వాళ్ళ మేనమామగారింటికి పోయిందట. ఇప్పుడు చాకలి పేరాయితో దాని కేమీ తగువులేదు. ఇద్దరూ గాడిదమీద గుడ్డలమూటలు వేసుకుని హాయిగా పాడుకుంటూ పోతున్నారు, ఏమీ జరగనట్టుగా!

ముసలిముతావాళ్లు మొదట ఇది చూసి చాలా ఆశ్చర్యపడ్డారు. తర్వాత దిమ్మతెలుసుకుని "ఊఁ, మనదగ్గరా ఈ కబుర్లు. పేరాయిగాడు ఏదో లంచం మేసిఉంటాడు. మాధవుడున్నాడుగా ఇక్కడనే!" అన్నారు.

శైలేశ్వరుడు మళ్ళీ తిరిగిరాలేదు. ఎందుకంటే అతను చచ్చిపోయాడు - ప్రేమలోపడికాదు - నూతిలోపడి. ఆ ఊళ్ళో పాడుబడ్డ బావి ఒకటి ఉంది దానిలోనించి అతని కుళ్లిన శవాన్ని బయటికి తీశారు.

ఇది బయటికి తెచ్చింది మల్లిక్‌గారు!

# వ్యక్తిత్వం లేని మనిషి

(గత సంచిక తరువాయి)

తన హితబోధలతో – బుజ్జగింపులతో, శాసనాలతో కూతుర్ని ప్రపంచానికి దూరంగా కట్టిపేసేయాలని ప్రయత్నించింది. సాధించలేకపోయింది. చిన్నప్పుడు జగతి లేడిపిల్లలా ఛంగున గంతులువేస్తూ పరుగెడుతూంటే, పొరుగింటి ఓవృద్ధుడు ఆపిల్లకి 'దొరకదు' అని పేరు పెట్టాడు. 'హాసేయి దొరకదూ!' అని పిలిచేవాడు. ఆమె ఆపేరుని ఒకరకంగా సార్థకం చేసుకుంది. ఆమెతల్లికి దొరకలేదు; ఏ కొక్కిరాయికో దొరికింది. ఆ కొక్కిరాయితో అంతర్ధానమైంది.

దాంతో శ్రీదేవి బ్రతుకు మరింత హీనమైంది. ఆమె నివసించే శిథిలగృహం మరింత శిథిలమైనట్లు గోచరించింది. తమ తప్పులు ఎదుటివారిలో చూడటంకన్న భయంకరమైన శిక్షలేదు భూమ్మీద. ఆమె చచ్చిపోవటానికి అభ్యంతరం లేదుగానీ, బ్రతుకులాగే చావులోనూ రుచి కనబడక – బ్రతక సాగింది.

ఈలోపున తనదారిన తను - తన బలహీనతలతో, అసహ్యాలతో పెరుగుతూన్న మృత్యుంజయరావు అక్కగారి యీ దృష్టాంతంతో లోకం దృష్టిలో, మరింత అవహేళనకి గురి అయ్యాడు. అతనప్పటికి కాలేజికి పోయి చదువుకుంటున్నాడు. ప్రతివాళ్ళూ కాలేజికి చాలా తేలిగ్గా, సునాయాసంగా పోతూ కాలం గడిపేస్తారు. తను వేసే ప్రతి అడుగునూ తను గుర్తిస్తూ, మీదపడే వికృతపుచూపుల్ని ప్రతి నిముషమూ ఓర్చుకుంటూ జీవించటం ఎంత దారుణం! ఇవన్నీ లెక్కచేయనట్లు కనబడాలని అతనికి తీవ్రమైన కాంక్ష. తన ముఖంమీద నిరంతరం చిరునవ్వు వెలుగుతూవున్నట్లు గోచరించటానికి ప్రయత్నించేవాడు. ఆ నవ్వుకోసం అద్దం ముందు గంటలతరబడి ప్రాక్టీస్ చేసేవాడు. కాని విశేషమేమంటే అతని ముఖం మందస్మితం అని ఎవరూ అనుకున్నపాపాన పోలేదు.

మృత్యుంజయరావు చదువుకూడా గ్రుడ్డిగానే సాగింది. అతను ఏనాడూ తీరిగ్గా కూర్చుని తన భవిష్యత్తుని గురించి పునాదులు నిర్మించుకోలేదు. ముందుముందు తాను ఏమిగా రూపొందాలి? డాక్టరా? ప్లీడరా? ఇంజనీరా? కలెక్టరా? పోనీ గుమాస్తానా? ఏమయినా వ్యాపారస్తునిగానా? ఏమిటి తన జీవితపథకం? అతనెప్పుడూ ఆలోచించలేదు. ఆలోచించటం చేతకాలేదు.

కొమ్మూరి వేణుగోపాలరావు

బి. ఏ. ప్యాసైనరోజున తల్లి దగ్గరకు వచ్చి నెమ్మదిగా ఆ విషయం వివరించాడు.

ఆమె మంచంమీద ముసుగు కప్పుకుని వుంది. "అయితే యిప్పు డేం చేద్దామనుకుంటున్నావు ?" అని ప్రశ్నించింది ఒక క్షణ మాగి.

"అవును. ఏమి చెయ్యాలి ?" అని విస్మితంగా ప్రశ్నించుకున్నాడు మృత్యుంజయరావు.

"నువ్వు డాక్టరువవుతే బాగుంటుందని నా ఉద్దేశం," అంది తల్లి కొంత ఆలోచించి. తల్లికి చదువుల వివరాలగురించి ఏమీ తెలియనందుకు అతను బాధపడి, "ఇదివరలో నేను తీసుకున్న గ్రూప్‌కి ఆచదువు చదవటానికి వీలు లేదమ్మా," అన్నాడు.

ఆమె కొడుకుమీద ఆశలు పెట్టుకున్న మనిషి. అప్రయోజన మనేది ఒకటి భూమిపై భాసిల్లుతూ వుందని ఆమెకి స్ఫురించదు. "కోర్టులో ఎదుటివాడు ఉక్కిరి బిక్కిరి అయేటట్లు గడగడ వాదించే ప్లీడర్ అయినా బాగుంటుంది," అన్నది తిరిగి.

"నాకంత వాగ్ధాటి లేదమ్మా," అన్నాడు మృత్యుంజయరావు సిగ్గుపడుతూ,

ఆమె వరుసగా అనేక ఉద్యోగాలగురించీ, వృత్తుల గురించీ అడిగి చూసింది. ఆమె ఒక్కొక్క కోరికా ఒక్కొక్క తూణీరంలా దూసుకువస్తున్నది. అతను లజ్జితు డవుతున్నాడు. ఆ అన్నిటికీ లేదు లేదని చెబుతున్నాడు. చివరకు 'ఏదో చిన్న ఉద్యోగం చేస్తా' నని అతను చెప్పినప్పుడు ఆమెకళ్ళు పెద్దవిచేసి అతనివంక చూస్తూ కూచున్నది. అతనికి తాను చాలా అపరాధం చేసినట్లు దుర్భరమైన బాధ కలిగి అక్కడ్నుంచి నెమ్మదిగా జారుకున్నాడు.

అప్పట్నుంచీ ఉద్యోగంకోసం పడరాని పాట్లు పడ్డాడు. చివరికి బెజవాడలో నూటనలభయి రూపాయలమీద ఓ ప్రయివేటుకంపెనీలో ఉద్యోగం దొరికింది.

తల్లికి రాశాడు: "ఇంకా ఎన్నాళ్లు ఆ రాక్షసులమధ్య ఆపాడు కొంపలో నివశిస్తావు ? అమ్మా! యిన్నాళ్ళకి మనం ఆయింటినుండి విడివడే తరుణం ఆసన్నమయింది. ప్రస్తుతం చిన్నగదిలో వుంటున్నానుకో. నువ్వు వచ్చేట్లయితే చిన్న యిల్లు తీసుకుంటాను. ఏమంటావు ?"

తల్లి జవాబు యిచ్చింది: "నీకు ఉద్యోగం దొరికినందుకు సంతోషం నాయనా! ఈమధ్య నా ఆరోగ్యం మరీ సన్నగిల్లింది. చూపూ సరిగ్గా ఆనటంలేదు. ఇంకా ఎన్నాళ్ళో బ్రతకనని నా కనిపిస్తున్నదిరా జయా! ఈస్థితిలో నీదగ్గరకు చేరి నిన్ను యిబ్బంది పెట్టటం నా కిష్టంలేదు. ఇక్కడి పరిస్థితి అంటావా ? వీళ్లు నాకు తమ శక్తి కిమించి కీడు చేయలేరు. నాకు అలవాటు అయిపోయింది కాబట్టి బాధేంలేదు.




కష్టాలనుంచి తప్పించుకోవాలనిగాని, సుఖాలని పొందాలనిగాని యిహ కాంక్ష లేమీ లేవు. నా శేషజీవితాన్ని యీ శిధిలగృహంలోనే గడపాలని సంకల్పించుకున్నాను. ఎప్పుడయినా వీలుచూసుకుని కనిపించిపోతూవుండు."

తనకి కళ్లు చెమ్మగిల్లాయి. చొక్కా అంచుతో తుడుచుకున్నాడు. తల్లిని అంతకంటే ఎలా బంవంతం చెయ్యాలో అతనికి బోధపడలేదు. ముఖంముందు అద్దం తన అసమర్థతను అపహసించినట్లయింది.

అప్పట్నుంచే ఆగదే అతని వాసగృహం అయింది. ఆగది నేలమీద, గోడలలో బూజులో జీవిస్తున్నాడు.

## 3

వెల్తురులో గది కిటికీగుండా బయటి యింటినంతా కలయచూసింది జగతి. "ఫర్వాలేదు. పెద్దయిల్లేనే! డబ్బూ, దస్కం బాగానే వున్నట్లుంది," అంది బద్ధకంగా ఆవులిస్తూ.

"ఉన్నవాళ్ళే."

అరుగుమీద నిలబడి ఒక నలభైయేళ్ళ స్త్రీ పనిపిల్లను ఎడాపెడా పన్లు పురమాయించేస్తున్నది. "ఆరు దాటిందా? ఇంత ఆలశ్యంగా ఆఘోరిస్తే పన్లు ఎలా తెముల్తా యనుకున్నావే పిల్లా! తెల్లారినాక అంట్లు తోముకోవటం దరిద్రంకూడానూ.

దరిద్రం దరిద్రమా అని. పెరట్లోకి వెళ్ళి అరిటిచెట్టు కొట్టి దూట తీసుకురా. ఇంటి మీదికి నిచ్చెనేసుకుని ఎక్కి మామిడికాయలు కొయ్యి. ఆ మూల చూడు, చెత్తంతా ఎలా పేరుకుందో; శుభ్రంగా చిమ్మెయ్యి."

జగతి ఆవిడవంక పరిశీలనగా చూసింది. పచ్చగా, బొద్దుగా, ఆరోగ్యంగా, మిసమిసలాడుతూ వున్నది. చాలా అందమైన, చక్రాల్లాంటి పెద్దపెద్ద కళ్ళు. మాట్లాడుతూంటే చేతులూ, కళ్లూ విచిత్రంగా త్రిప్పుతోంది.

"మంచి అందగత్తె," అంది జగతి, ఆమెవంక ఆసక్తిగా తిలకిస్తూ.

"అవును," అన్నాడు మృత్యుంజయరావు అప్రయత్నంగా వెనకనుండి.

జగతి చటుక్కున వెనక్కితిరిగి, పరిహాసపూర్వకంగా, "ఇదెప్పటినుంచీ... సౌందర్యారాధన," అంది.

అతను అప్రతిభుడై తడుముకుంటూ "అబ్బే; అదేంలేదు. అందంగా వుంటుం దన్నాను," అన్నాడు.

ఆమె నవ్వుతూ "ఊహుఁ, నీ గుండెలో ఆడవాళ్ళ అందచందాలుకూడా ప్రవే శిస్తున్నాయన్నమాట. పైకివస్తున్నావు బాబూ!" అంది.

అతనిముఖం కందగడ్డ అయింది. "ఆవిడ చాలా పెద్దది..." అని గొణిగాడు.

"చిన్నది అయితే ఫర్వాలేదన్నమాట," అని జగతి ఫక్కున నవ్వింది.

"నా ఉద్దేశం......"

"పెద్దది అయితే అందంగా వుండకూడదని వుందా?" అన్నదామె వొదిలి పెట్టకుండా.

"అబ్బే! వాళ్ళు చాలా మంచివాళ్లు."

"మంచివాళ్ళు అందంగా వుండకూడదేమిటి?" తన విశాల నేత్రాలతో అతన్ని గుచ్చిగుచ్చి చూస్తోంది.

ఇహ అతని కేమనటానికీ తోచక మౌనం ధరించి ప్రక్కకి చూడసాగాడు.

జగతి యిహ అతడిని కవ్వించటం ఆపి, మరోసారి బద్దకంగా ఆవులించి "సరేగాని, నేను మొహం కడుక్కోవాలి - ఎటువైపు వెళ్ళాలి?" అని అడిగింది.

మృత్యుంజయరావు గదిబయటకి వచ్చి చేత్తో దారి చూపిస్తూ, "ఇలా పెరట్లోకి వెడితే లోపల బావీ, కొళాయీ వున్నాయి. కొళాయిదగ్గర వద్దుగానీ, బావిదగ్గర కడుక్కో. మా యింటివాళ్లు కొళాయిని చాలా ప్రాణప్రదంగా చూసుకుంటారు," అన్నాడు.

జగతి తల ఊపి, దండేనవున్న తువ్వాలు తీసుకు భుజాన వేసుకుని, పెరటివైపు నడిచి వెళ్ళింది.

ఆమె వెళ్ళగానే మృత్యుంజయరావు గబగబ పెట్టెలోని రెండు పాతదుప్పట్లు తీసి ఒకదానికి ఒకటి కలిపి రెండుఅంచులూ ముడివేసి, గదికి మధ్యలో అడ్డంగా కట్టి, గదిని రెండు భాగాలుగా చేశాడు. అక్కకి కాఫీ తెప్పించాలి; పనిపిల్లకి యిప్పుడప్పుడే తీరికకాదు. ఎలాగా అని ఆలోచిస్తూ వుండగా, జగతి ముఖంమీది నీటిబిందువుల్ని తుడుచుకుంటూ లోపలికి వచ్చింది.

మీ యింటివాళ్ళు ఎక్కడో అడవిమనుషుల్లా వున్నార్రా. పంపుకు తలుపుపెట్టి దానికి తాళం తగలేశారేమిటి? పరమలోభులా ఏమిటి? ఇంతపెద్ద మహాపట్నంలో యీ యిల్లుతప్ప మరొకటి దొరకలేదా?" అంది అప్పుడే కామెంట్ ప్యాస్‌చేస్తూ.

ఇలాంటి దేదో అంటుందని అతను వూహిస్తూనేవున్నాడు. "జగడ మేమయినా జరిగిందేమిటి?" అని ప్రశ్నించాడు భయపడుతూ.

జగతి నిర్లక్ష్యంగా నవ్వుతూ, మంచంమీదకు వచ్చికూర్చుంది. "అదేం జరగ లేదులే. లోపలకు వస్తూన్న ఈ అపరిచిత యువతి ఎవరా అని మొదట తెల్లబోయి చూసింది – నేను బావిదగ్గరకు పోయాంటే. 'ఎవరమ్మా నువ్వు?' అని మర్యాదగానే అడిగిందిలే. 'నేను జగతిని' అన్నాను. ఆ వళాన వివరాలూ, తబ్సీళ్ళూ అన్నీ అడిగి తెలుసుకుంది. బావిదగ్గరకు పోబోతూంటే ఆపి కొళాయితలుపు తెరిచి అక్కడ కడుక్కోమంది. 'మృత్యుంజయరావు మంచివారమ్మా!' అంది. నువ్వెంత మంచివాడవుర్రా తమ్ముడూ! నాకు తెలియదే. ఆవిడ పెనిమిటినికూడా చూశా న్రోయి. రెండోపెళ్ళామేమిట్రా? యీభయ్యోవడిలో పడ్డట్టుగా వుంది. బయటకు బలంగానే వున్నాడుగాని – లోపల ఏదో జబ్బుతో పీడించబడుతూన్నట్టుంది." అని ఒక్కనిముషం ఊపిరి తీసుకుంది.

ఆమె తత్వమే అంత. ఇంతవరకూ ఆమె జీవితమంతా పరిసరాలని పరిశీలించ టములోనూ, వాటిల్లో విలీనమవటంలోనూ గడిచిపోయింది. పరిసరాలలో ఆమెకంటే సులభంగా యిమడగల వ్యక్తి వుండరు.

"గదిని పార్టిషన్ చేసేశావేమిరా? ఆ చీకటి గుహలో ఊపిరి పీల్చుకుంటూ వుండాలా నేను?" అంది జగతి మళ్ళీ.

'స్త్రీవికదా నువ్వు. అనేక సందర్భాలలో మరుగు అవసరమొస్తూ వుంటుంది.' అందా మనుకున్నాడు అతను. కాని "ఊరికినే" అన్నాడు.

జగతి గదంతా ఓసారి కలయజూసి "ఆఁ, ఇప్పుడు చెప్పబ్బాయి. నా అవసరం

కోసంగావి, మరెందుకైనాగాని నేను నీతో కపీసం కొన్ని నెలలైనా కలిసివుండాలి. ఇన్నిరోజులూ నువ్వు నన్ను పోషించాలి. ఏం, పోషిస్తావా ?"

'ఆ విషయ మంత స్పష్టంగా అడక్కపోతే ఏం?' అందా మనుకున్నాడు అతను. కాని తల ఊపి ఊరుకున్నాడు.

"ఈ గది బాగానే వుందిలే. మెల్లిగా గడిపేస్తాను. మరి ఒట్టినే కూచుంటే కాలక్షేపం కాదుగా. అందుకని వంట నేనే చేస్తాను. ఏదో కాస్త ఉడకేయటం వచ్చులే. వంటసామానూ అవీ వున్నాయా ? ఉండి ఉండవులే; ఎలాగో సంపాదించు. ఈ పూటకిమాత్రం కాఫీ పట్టుకురా. రేపట్నుంచీ మనమే కాచుకుందాం. ఏమిట్రా అలా చూస్తావ్ ? నన్ను చూస్తే ఆశ్చర్యంగా వుందా ? రాత్రిఅంత దెయ్యంలా కన బడటంలేదా నేను ? ఊఁ, త్వరగా కాస్త కాఫీ పట్రా." అంటూ ఆమె లేచి గోడని తగిలించివున్న అద్దందగ్గరకు వెళ్ళింది. చెరిగివున్న ముంగురులు సవరించుకో సాగింది. మృత్యుంజయరావు ఫ్లాస్క్ తీసుకుని రోడ్డుమీద పడ్డాడు.

అతని కేమీ సంతోషంగాలేదు. ఓ కొత్తసమస్య ఉత్పన్నమయినట్లుగా వుంది. అతను స్వయంగా ఏ సమస్యనూ స్వీకరించలేడు. వాటి గమనాన్ని అవలోకిస్తూ ఊరుకుంటాడు. అలా ఊరుకుంటే తిరిగి ప్రశాంతంగా వుండదు. గుండెల్ని పిండు తూన్నట్లే వుంటుంది. అలాగే భరిస్తాడు.

## 4

అలాంటి మృత్యుంజయరావుచుట్టూ కూడా రెండు మూడు సంవత్సరాలుగా ఒక ఆఫీసులో పనిచేస్తూ వుండటంవల్ల ఓ స్నేహితులపరిధి ఏర్పడింది. రోజుల తరబడి ఒకరితో ఒకరు సన్నిహితంగా సంచరిస్తే యితరులకి కనిపించే లోపాలు కళ్ళకి కనబడటం మానేస్తాయి. అత్యవసర పరిస్థితుల్లో తప్ప ఆలోపాన్ని వెలికి తియ్యటానికి ప్రయత్నించరు. అసలు స్నేహంలో ఓ నిగూఢమైన రహస్య ముంది. ఒకరి మనస్తత్వానికి సరిపడినా సరిపోడకపోయినా తన నావరించివున్న వాతావరణం నుంచే స్నేహితుల్ని ఎన్నుకోవటానికి ప్రయత్నిస్తాడు మనిషి. అనేక సందర్భాలలో ఒకరి నొకరు ద్వేషించుకుంటున్నా, విసుక్కుంటూన్నా స్నేహితులగానే మిగిలి పోతూవుంటారు.

సోమయాజులుగారు నలభయిఏళ్ళు దాటినమనిషి. మొదట బుద్ధిలేకా, తర్వాత బుద్ధివచ్చినా సాధ్యంగాకా ఎడాపెడా అరుగురు పిల్లల్ని కనేశాడు. కిడ్నీ సంబంధ మైనవీ, లివర్ సంబంధమైనవీ వ్యాధులు ఆయన శరీరంలో పేరుకుపోయి




"ఏఁయ్ ! ఏయ్ ! ను వ్వేదో మర్చిపోయ్యావు !"

వున్నాయి. ప్రపంచంలో అన్ని విషయాలగురించీ — అనగా రాజకీయాలూ, సాహిత్యం, సంగీతం, హిస్టరీ, జాగ్రఫీ, సైన్సు, వేదాంతం వీటన్నిటిగురించీ అతనికి కొంచెం కొంచెం పరిజ్ఞానం వుంది. కనీసం పరిజ్ఞానం వుందన్న విశ్వాసం వుంది. పిల్లలు రాక్షసులుగా పరిణమించడంవల్లా, పెళ్ళాం అస్థిపంజరంలా మారి ఆయింట్లో శవాలు తిరుగుతూన్న వాతావరణం సృష్టించటంవల్లా ఆయనకి యిల్లు నరకప్రాయంగా మారి ఎక్కువభాగం ఆఫీసులోనే గడుపుతూవచ్చాడు. ఆఫీసులో మాత్రం వృధా సంభాషణలతో, కాయితాలమీద పనులతో ఎంతని కాలం గడుస్తుంది ? అందుకని ఆయనకు అనేక కార్యకలాపాలు అవసరమొచ్చాయి. గుమాస్తాలందర్నీ కూడదీసి ఏమీ వ్యాపకాలులేని జీవితం దుర్భరంగా వుంటుందనీ, మానవుని మానసిక వికాసానికి ఉదాత్తమైన కార్యకలాపాలు అవసరమనీ బోధించి, ఒప్పించి తమ ఆఫీసులోని గుమాస్తాలందరిచేతా కళాసమితి నొకటి స్థాపింపజేశారు. దానికి విజ్ఞాన కళాసమితి అని పేరుపెట్టారు. అంటే అందులో విజ్ఞానం పొంగి పొర్లి ప్రవహిస్తూ వుంటుందన్నమాట. సభ్యులందరూ నెల నెలా చందాలు కట్టాలి. ఊళ్ళో ఓగది అద్దెకి తీసుకున్నారు. సభ్యులందరూ అందులో సాయంత్రం వేళ కలుసుకుంటారు. రాజకీయాలగురించీ, సాహిత్యంగురించీ చర్చలు చేస్తారు; వాదించుకుంటారు. ఒక బీరువా కొని గ్రంథాలయమంటూ ఒకటి ఏర్పాటుచేశారు.

వ్రాతపత్రిక నొకదాన్ని నడుపుకొస్తున్నారు. తురంగరావు అనెఅతను దానిక సంపాదకుడిగా వ్యవహరిస్తున్నాడు. అతను బి. ఏ. లిటరేచర్. అతనితండ్రి పేరు పొందిన సాహితీవేత్త. చిన్నప్పట్నుంచీ వారి యింటికి చిన్నలూ, పెద్దలూ సాహితీ పరులు రావటం, గోష్ఠులూ, సమావేశాలూ యీ వాసనల్లో పెరగటంవల్ల, తనూ అంతడివా డ్ననుకుంటాడు. అతనికి వాళ్ళు చేసుకునే వాదప్రతివాదాలలోని విమర్శా, ప్రతివాళ్ళనీ తీసిపారెయ్యటమూ పట్టుబడ్డాయిగానీ ఒక అక్షరంముక్క (మంచిది) స్వంతగా రాయటం అలవడలేదు. అందుకని ఎంతటివాడినైనా అవ లీలగా తీసిపారేస్తాడు. వాడిమొహం వాడు కవి కాదంటాడు, వీడిమొహం కథకుడు కాదంటాడు. అసలు ఆధునిక సాహిత్యం కొస్తకూడా చదవడు; చదవకుండా మన సాహిత్యం పతనమైపోతుందని గోలపెడతాడు. అసలు సాహిత్యమంటే పద్యాలేగాని నవలా, నాటకం, కథా యివన్నీ ఏమీ కావని ఓవాదం లేవదీశాడు. అతనికి భారతం, భాగవతంలోవి మూడు నాలుగొందలదాకా పద్యాలు కంఠతా వచ్చు. సందర్భం వున్నా లేకపోయినా అందులో ఒక్కొక్కటి చొప్పున విసుర్తూ సాహిత్యమంటే యిదీ అని నిరూపిస్తూ వుంటాడు. మనిషి దుర్మార్గుడేమీ కాదుగానీ, ఎవరితోనూ మనసువిచ్చి మాట్లాడలేడు. మూడోవ్యక్తి ఎదురుగుండా లేనప్పుడు అతనినోరు అతని అనుమతి లేకుండానే మూడోవాడ్ని గురించి అవాకులూ చెవా కులూ పేలుతూ వుంటుంది. రచయితగా రాణించలేనని అనుభవంమీద తెలుసుకుని ఉపన్యాసకుడగా రాణించటానికి యీమధ్య ప్రయత్నాలు జరుపుతున్నాడు. అతను కాస్త కలిగినవాడు. ఈ జీతంరాళ్ళమీదే ఆధారపడి జీవించే అగత్యంలేదు. అందు కని కాస్త దర్జాగానే ఖర్చుపెడుతూ వుంటూవుంటాడు. ఈ మధ్య పైకివచ్చిన కవులూ, కళాకారులూ వగైరాలు ఉమ్మడిపద్ధతిమీద వ్యవహారం నడుపుకొచ్చి క్రమంగా నిచ్చెనలు ఎగబ్రాకటం అతను బాగా గ్రహించాడు. ఉమ్మడిపద్ధతి అంటే మరేంలేదు. పైకివచ్చి లోకాన్ని చెండుకు తినదల్చే యిద్దరు ఉద్దండులు ఒకచోట తారసిల్లుతారు. ఒకరి అభిప్రాయాలు ఒకరు క్షుణ్ణంగా తెలుసుకుని ఒక ఒడంబడి కకు వస్తారు. ఇహ దేశంమీద దండయాత్రకు బయల్దేరి సభల్లోనూ, సమావేశా ల్లోనూ, యింకా యితరములైన ఆనేక సందర్భాలలోనూ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఒకరినొకరు ఆకాశానికి ఎత్తేసుకుంటారు. 'మా ఫలానా అన్నట్లు' యితనూ, 'మా ఫలానా అన్నట్లు' అతనూ ఒకరిగొప్పతనాన్ని మరొకరు తెగ అభివర్ణిస్తారు. దీన్ని ఉమ్మడిపద్ధతి అనిగానీ, డప్పుపద్ధతి అనిగానీ అనవచ్చు. దీనివల్ల అంతా లాభమేగాని నష్టమన్నమాట లేదు. ప్రారంభదశలో అనేకుల

నవ్వుకొనినా నవ్వుకుందురుగాక. రానురానూ విళ్ళ విజృంభణ అయేసరికి, పేర్లు బాగా నోళ్ళకు పట్టుబడి, నాని చివరకు ప్రఖ్యాతులుగానే చలామణి అవుతారు. తురంగరావుకు యీ పద్ధతి బాగా నచ్చింది. తాను ఉపన్యాసకుడిగా చలామణి కావటానికి గల పథకాలన్నీ ఒక ప్రణాళికగా వేసుకున్నాడు. ఇరవై ముప్ఫైవరకూ నాటికలు రాసి, ఎవరూ ప్రదర్శించటానికి ముందుకు రాకపోయినా పూనుకుని తనే సొంతఖర్చుతో ప్రదర్శనలు ఏర్పాటుచేసి, ఎవరిమెప్పూ పొందకపోయేసరికి భంగపాటు చెంది, ఏంచేద్దామా అని తలగోక్కుంటూన్న ఒక దూరమిత్రుని సహకారం అతనికి అనుకోకుండా లభించింది. ఆ మిత్రుడ్ని అంతగొప్పవాడు యింత గొప్పవాడని తను సభ్యులముందు పొగిడి, అతని ఉపన్యాసం ఒకటి యీ ఊళ్ళో ఏర్పాటు చేయించాడు. అతన్ని తమయింట్లోనే వుంచుకుని వంటవాడ్ని పెట్టి ఘుమ ఘుమలాడే పిండివంటలతో మంచి విందుభోజనం చేయించాడు. ఆ మిత్రుడితో తమ ఆఫీసరుకి 'తురంగరావువంటి కవి మీ ఆఫీసులో పనిచేయటం మీ ఆఫీసుకే ప్రివిలేజ్ అండీ," అని చెప్పించాడు. మాటల్లో మాటగా అధ్యక్షస్థానం వహిస్తోన్న ఆ ఆఫీసరుకి. అదేమిత్రుడు తమ ఊరుకు చేరుకుని అక్కడేపో సభ ఏర్పాటు చేసి దానికి తురంగరావును వక్తగా ఆహ్వానించాడు. కంఠసీమల నలంకరించే పూలహారాల విషయంలోనూ, సభలు ముగిశాక ఆ సమాచారాన్ని పత్రికలు ప్రకటించేటట్లు చూడటంలోనూ ఆ యిరువురూ సర్వశక్తులూ ధారవోసేవారు. పత్రికా విలేఖరులతో నిరంతర సాన్నిహిత్యం పెంపొందింపజేసుకున్నారు దీనికోసంగానూ. ఇలా క్రమంగా ప్రచారం జరిగి తురంగరావుకు యితర సంస్థలనుండి కూడా ఆహ్వానాలు రావటం మొదలుపెట్టాయి. శ్రోతల్ని ఆకట్టుకోవాలంటే కొన్ని ఒరిపిడిరాళ్ళవంటి పదాలూ, వాక్యాలూ పడాలి. హ్యూమర్ వుండాలి. తురంగ రావుకు మనిషికి స్వంతహ్యూమర్ లేదు. అందుకని శ్రోతల హృదయాలని రంజింప చేయగలిగే కొన్ని కొన్ని హాస్యపు అంశాలనూ, నిత్యజీవిత సంఘటనలనూ ఓపికతో సేకరించి, కంఠస్థం చేసి, వాటిని తూణీరాల్లా గురిచేసి విడిచిపెట్టటం నేర్చుకున్నాడు. ఉపన్యసించబోయేటప్పుడు తను పెట్టబోయేముఖభంగిమలూ, గొంతు గంభీరంగా మార్చటం, చేతులు వూపటం దగ్గర్నుంచీ యింట్లో అద్దంముందు రిహార్సల్సు వేసుకునేవాడు. అతను పైకిరావటానికి యీవిధంగా, పాపం, అనేక విధాల తంటాలు పడుతున్నాడు.

సాయంత్రాలు వాగిన వాదాలు జరుగుతూన్నప్పుడు సభ్యులు అనేక విషయాల్ని మథించటాన్ని జరుగుతూఉండేది. దానికి సోమయాజులుగారు యించుమించు

అధ్యక్షస్థానాన్ని అలంకరిస్తూ ఉండేవారు. మృత్యుంజయరావు విధిగా సమావేశాలకు హాజరయేవాడు గాని, ఎప్పుడూ నోరు విప్పి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన పాపాన పోలేదు. స్థిరంగా ఓ సత్యాన్ని వెల్లడించటానికిగానీ, ఖండించటానికిగానీ అతనికి భయం. అసలు ఏ సత్యంపట్లా అతనికి స్థిరమైన అభిప్రాయం లేదు. ఒక విషయం మంచిదనిగానీ చెడ్డదనిగానీ అతను ఘంటాపథంగా చెప్పలేడు. ఒక అంశాన్ని గురించి వాదోపవాదాలు జరుగుతూన్నప్పుడు అతను యిరుపక్షాలవార్నీ మనసులో అభినందిస్తూవుంటాడు. వారు వాదించే విషయంమీదికన్నా, వాదించే విధానంమీద అతనికి ఆసక్తి మెండు.

ఎదుటివారి మనస్తత్వంలో, వ్యక్తిత్వంలో అతను చాలా సులభంగా లీనమౌతాడు 'నేను దొంగనైతే బాగుండును' అనుకున్న సందర్భాలు అనేకం ఉన్నాయి. తనని తాను ఒక రౌడీగా అనేకసార్లు ఊహించుకున్నాడు. ఎందర్నో చంపినట్లూ, పరపర నరికినట్లూ, దృశ్యాలు కళ్ళముందు తిరుగాడుతూ ఉంటాయి

సభ్యులలో సంజీవరావు అని ఒకతను ఉన్నాడు. అతను ఏ పార్టీకి చెందిన వాడో ఎవరికీ సరిగ్గా తెలీదుగాని, ఎప్పుడూ ప్రభుత్వాన్నీ, ప్రభుత్వ విధానాలనూ విమర్శిస్తూ వుంటాడు. ప్రజలు అనుభవిస్తూన్న యిడుముల్ని హృదయవిదా కంగా విశదీకరిస్తూ ఉంటాడు ఒకసారి అతను రైల్లో దూరప్రయాణం చే వచ్చాడు. వచ్చినప్పట్నుంచీ చిరాగ్గా ఉన్నాడు. చిర్రుబుర్రు లాడుతున్నాడు "వెధవ రైళ్ళూ, వెధవ ప్రయాణమూ." అని విసుక్కుంటున్నాడు. "మొద టికెట్లు అమ్మేచోటికి వెళ్ళి అదోనికి టికెట్ ఇమ్మన్నాడుట. ఒకమూల ట్రెయిన్ బయల్దేరటానికి సిద్ధమయిపోతూ ఉందిట. వాడు ఒక అయిదు నిమిషాలపాటు అ లన్నీ వెదికి 'అదోని టికెట్లు అయిపోయా'యన్నాడుట. 'మరి ఎలాగయ్యా' అం 'నే నేం చెయ్యను' అన్నాడుట. 'పోనీ గుంటకల్ దాకా యిస్తావా' అంటే, 'యిస్తా నన్నాడుట 'ఆ సలహా పూర్వంగా ముందే ఎందుకు చెప్పలే'దంటే, 'నా కేమవస మన్నాడుట. తను కోపం ఎలాగో నిగ్రహించుకుని 'గుంటకల్ నుంచి అదో వరకూ వెళ్లేటట్లు కాయితం రాసిస్తావా' అంటే 'అసలు టికెట్లు అమ్మేవాడ్ని నే కాదు. అత నేదో పనిమీద పోతే నే నమ్ముతున్నాను. నాది ఇంకో డిపార్టుమెంట నేను ఇవ్వటానికి వీల్లే'దన్నాడుట. ఇతనికి కోపం వచ్చి 'అయితే కంప్లెయిం బుక్ ఇ'మ్మన్నాడుట. 'అది ఉండేచోటు ఇది కాదు' అన్నాట్ట అతను. 'అయి ఎక్కడ ఉంటుం'దన్నాడుట సంజీవరావు. 'నాకు తెలియ'దని జవాబు. సరే ఇ గలాటా పడుతూ కూచుంటే ట్రెయిన్ మిస్ అయిపోతుందని కోపాన్ని దిగమ్రిం




కుని గుంటకల్‌దాకా టికెట్ తీసుకుని రైలెక్కాడుట. మధ్యలో ఓసారి గార్డుని కలుసుకుని ఆదోనికి టికెట్ రాసిమ్మన్నాడుట. ఇతను చెప్పింది అతని కెంతవరకూ బోధపడిందో కాని 'గుంటకల్ స్టేషన్‌లో కలుసుకోండి. అక్కడ ఇస్తాను' అని టికెట్ జేబులో పెట్టుకుని తన పెట్టెలోకి పోయాడుట. ఈ లోపున సంజీవరావుకు మంచి నిద్ర పట్టేసింది. మెలకువ వచ్చేసరికి ఏదో స్టేషన్‌నుండి బండి కదల బోతూంది. ఇదే స్టేషన్ అని ప్రక్కవార్ని అడిగితే గుంతకల్ అన్నారుట. కంగారుపడుతూ అతను తన బెడ్డింగుతోసహా పెట్టోంచి దూకేశాడుట. టికెట్ ఏమో గార్డుతో వెళ్ళిపోయింది. ఈ విషయం అక్కడి టికెట్ కలెక్టర్‌కు చెబితే విని పించుకోడుట. చివరికి మెడలు విరిచి ఎక్సెస్ కట్టించాడుట.'' అది కథ.

ఈ కథ చెప్పి ప్రభుత్వాన్ని, పరిపాలకుల్ని, మంత్రుల్ని తెగ ఏకాడు సంజీవ రావు. అట్లా దూది నేకుతున్నట్లు ఏకుతూంటే ఆవేశంతో అతని కంఠనాళాలు ఉబ్బు తున్నాయి. గొంతు ఖంగ్‌మని మ్రోగుతోంది.

అట్లాగే ఎన్‌క్వయిరీస్ గురించి చెప్పాడు. ప్రయాణికులు ఎంతో ఆతురతతో, ఆందోళనతో అడిగిన ప్రశ్నలకు వాళ్ళు సరియైన సమాధానాలు చెప్పరుట. ఒకసారి సంజీవరావు ఎక్కడికో ప్రయాణం పెటుకుని ట్రెయిన్ ఎప్పుడు వస్తుందని ఫోన్

చేస్తే గంట లేటుగా వస్తుందని చెప్పాడుట. సరే అని తిరిగ్గా బయల్దేరి అప్పటికి వాళ్లు చెప్పిన టైముకి అరగంట ముందుగా పోయేసరికి అప్పటికే బండీ బయల్దేరి పావుగంట అయిందని చెప్పారుట. ఇంకా చెప్పాడు ఎన్క్వైరీవాళ్ళ గురించి. మొదటిసారి అడిగితే ఏదో చెబుతారుట; రెండోసారి అడిగితే విసుక్కుంటారుట; మూడోసారి అడిగితే కసురుకుంటారుట.

రైలు ప్రయాణాల గురించి మృత్యుంజయరావుకూ దారుణమైన అనుభవాలు కలిగాయి. ఆఫీసరు చెప్పినట్లు అణకువగా నడుచుకునే వాళ్ళలో అతను అగ్రగణ్యు డేమో – ఆఫీసు పనులమీదా, సొంత పనులమీదా అతన్ని అడపాతడపా పైఊళ్ళకి పంపించటం కద్దు. ఏ క్లాసులో ప్రయాణం చేద్దామా అన్న సంఘర్షణతో ఆరంభ మవుతుంది అతని సమస్య అసలే గోరంతని కొండంతలు చేసే మనిషేమో, దాన్ని గురించి మనసులో పెద్దపెట్టున తర్జనభర్జనలు జరిపి, తల్లక్రిందు లవుతాడు. ఆఫీసు డబ్బుతో అతను సెకెండుక్లాసులో ప్రయాణం చేయవచ్చు. కాని అది ఒకటే కంపార్టుమెంట్ కావటంవల్ల క్రిక్కిరిసిఉంటుంది. ఫస్టుక్లాస్‌లో సొంత డబ్బు పెట్టుకుని పోదామంటే దానికి ముందుగా రిజర్వు చేసుకోవాలి. లేకపోతే ఖాళీ లేకపోతే, ప్రక్కవాడు అభ్యంతరం తెలిపితే దిగిపోవాలి. అసలు ఫస్టుక్లాసులో ప్రయాణం చేసే అర్హత తనకు లేనట్లు తడుతూఉంటుంది ఎక్కినప్పట్నుంచీ. ఆ ప్రయాణీకులు తనను చీదరించుకుంటున్నట్లూ, పురుగుని చూసినట్లు చూస్తున్నట్లూ అనుభూతి పొందుతాడు. ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చునేవాడు. ఇహ థర్డ్‌క్లాసులో ఎక్కువ ప్రయాణాలు అందులోనే జరిగాయి. జనం చీమలలా, యీగలలా ముసురు కునిఉంటారు. ప్రక్కవాడ్ని కాస్త ప్రక్కకి జరగమనటానికి దెలికసీ మృత్యుం జయరావుకు. రైల్లో ఏదయినా కొనుక్కుని తినటానికి దెలికసీ. అందరూ డబా యించి సొంత ఇళ్ళలో తిన్నట్లు తింటారు. అసలు చాలా మంచితిండికోసమే ప్రయాణం చేసినట్లు చేస్తారు. స్టేషన్ స్టేషన్‌కీ జంతికలో, చక్రాలో, జీడిపప్పో, జామకాయలో, బఠాణీలో కొనుక్కుని మింగుతూఉంటారు. కబుర్లు చెప్పుకుంటూ. సరదాగా, నవ్వుతూ, పేలుతూ మింగుతారు. అయినా మృత్యుంజయరావు ఆకలితో మాడి చస్తున్నా సరే, అందరి ఎదుటా తినటానికి ఏదో అపరాధం చేసినట్లూ, అందరూ తనవంక వికృతంగా చూస్తున్నట్లూ, నవ్వుతున్నట్లూ ఫీలయి నాలిక కట్టేసుకునేవాడు. అధవా ఆత్మారాముడ్ని జయించలేక ఎప్పుడైనా కక్కుర్తిపడితే. ఏ కుంటిచేత్తోనో, చీమిడిముక్కుతోనో, దుర్గంధం విరజిమ్ముతూన్న కురుపులతోనో ఏ ముష్టివాడో మీదికి ఎగబడతాడు. ముఖాన్నీ గడ్డాన్నీ ముట్టుకుంటాడు. వాడి

నేమన్నా అనాలన్నా ప్రక్కవాళ్ళ సానుభూతి అంతా ముష్టివాడిమీదే వుంటుంది... ఇహ ప్యాసింజర్లో ప్రయాణమంటే యమలోకం చూస్తున్నట్లే. గంటలతరబడీ లేటుగా వచ్చే ట్రెయిన్‌కోసం ఎంతసేపు పడిగావులు గాసి కూర్చోవాలి! దాని గమ్యస్థానం చేరేలోగా ఎన్ని క్రాసింగులు! ఎన్నిసార్లు ఆగిపోతుంది! ప్రభూ! అడుగడుక్కీ మన బ్రతుకు యింత కిష్టంగా వుందా? ప్రజలగోడు తెలియటల్లేదా పై వాళ్ళకి?

కొంతమంది ప్రయాణం చేసినంతసేపూ సరదాగా, ఖుషీగా గడిపేస్తారు. కొంతమంది ఆ మహాయాతనలోనే గుర్రుపెట్టి నిద్రపోతారు. కొంతమంది పత్రికలో, పుస్తకాలో చదవటంలో లీనమౌతారు. మొత్తంమీద చాలామంది ప్రయాణమనే సాధనాన్ని ఎన్‌జాయ్ చేస్తున్నట్లే కనబడతారు. వాళ్ళ జీవితకాలంలో దీనికి వెచ్చించే కాలం ఓ వేస్టు క్రింద జమకట్టుకోక తమతమ పన్లు గడిపేసుకుంటారు. మృత్యుంజయరావుకు ఇది నిర్వచించలేని వృథాయాపన. ఆ సమయంలో అతని మస్తిష్కం బ్లాంక్‌గా ఉంటుంది. ఇది అతని జీవితానికి అదనపు ఖర్చు. ఎన్ని గంటలు, అవసరం వస్తే రోజులయినా సరే, జీవితానుభవాన్ని అంగుళమైనా పెంచకుండా వాడిలా చేయలేకపోతున్నానే. వీడిలా చేయలేకపోతున్నానే. ప్రయాణానందాన్ని అనుభవించలేకపోతున్నానే అని మధనపడ్తూ గడిపేస్తాడు. పిరికితనంతో తప్పించుకుని పారిపోయేవాళ్ళని అనుభవాలు అంతగా వెంట తరమవు.

ఇహ ఏవయినా సంఘటనలో చిక్కుకున్నప్పుడు దాన్ని సహజ పద్ధతిలో ఆతను ఎదుర్కోలేడు. అసలు సహజపద్ధతి అంటూ ఒకటి వుంటేగా. ఈ సమయంలో సంజీవరావు వుంటే ఏం చేసేవాడు, శేఖరం వుంటే ఏం చేసేవాడు అని వితర్కంలో పడతాడు.

ఒకసారి ఆఫీసరుగారి తాలూకు బండెడు లగేజితో దిగాడు బెజవాడ స్టేషన్‌లో. అర్ధరాత్రి దాటింది– కూలీలని పిల్చాడు.

"దీన్ని బయటకి తీసుకుపోవటానికి మూడురూపాయ లివ్వాలి," అన్నారు లైసెన్సు కూలీలు.

మృత్యుంజయరావు ఆశ్చర్యపోయి "గట్టిగా పడితే ముగ్గురు కూలీల సామాను. మనిషికి పావలాచొప్పున ముప్పావులా అవుతుంది.'' అన్నాడు. హెడ్‌లోడ్ పావులా అని స్టేషన్‌లోని గోడలకి తగిలించివున్న బోర్డులు చాటిస్తున్నాయి.

"మనుషులలెక్కన కాదండీ. మూడురూపాయ లిస్తేనే సామాను ఎత్తేది. తొరగా

చెప్పండి. ఇది కుదరకపోతే మరో బేరానికి పోవాలి,'' అన్నాడు కూలీ ఒత్తిడిచేస్తూ.

"ఇది అన్యాయం. యివ్వను,'' అన్నా డతను.

"అబ్బో ! అన్యాయం. అవతల ధరలన్నీ ఒకటికి పదింతలు పెరిగాయి. డబ్బు చాలక మలమల మాడిపోతున్నాం. అన్యాయంట అన్యాయం ?" అన్నాడు కూలీ చేతులు జాచి అభినయిస్తూ.

మృత్యుంజయరావుకి కోపం వచ్చింది. "ధరలు పెరిగితే—పెరిగితే పెరుగుగాక, రూలు రూలే. యివ్వటానికి వీల్లేదు," అన్నాడు గట్టిగా.

"ఈయ నెవడో రూల్సు చెబుతున్నాడయ్యా రూల్సు. యీ గిరాకీ టైంలో. పదండ్రా పోదాం; అదిగో అక్కడాయ నెవరో పిలుస్తున్నాడు."

ఘడియసేపు మృత్యుంజయరావుకి ఏంచేయాలో తోచలేదు. ఈ పరిస్థితుల్లో శేఖరం వుంటే ఏం చేస్తాడని చప్పున ఆలోచించాడు. 'ఆగు !' అని గర్జిస్తాడు.

"ఆగు" అని గర్జించాడు.

కూలీలు ఆగిపోయారు.

అదిగో వాళ్ళు ఆగిపోయారు. ఇప్పు డేంచేస్తాడు శేఖరం... ? 'నోరు మూసుకుని సామా నెత్తుకోండి' అంటాడు.

"నోరు మూసుకుని సామా నెత్తుకోండి," అన్నాడు.

వాళ్ళు వెనక్కి తిరిగారు; రెండడుగులు వేశారు. అతన్ని చూపులతో కాలుస్తు న్నారు. ఒకడు మరీ ముందుకొచ్చి "ఏంచేస్తావ్ ఎత్తకపోతే ?'' అన్నాడు గర్వంగా ఛాతీ విరిచి.

చెప్పవయ్యా శేఖరం చప్పున. ఇవతల ముంచుకువస్తున్నది. ఇప్పుడు నువ్వేం చేస్తావు ? చెప్పవయ్యా మహానుభావా.

శేఖరం 'తంతాను', అంటాడు.

మృత్యుంజయరావు 'తంతాను' అనబోయాడు. కాని ఎలా సంబాళించుకున్నాడో, బుద్ధిహీనుడిలా ప్రవర్తించకుండా తెలివి ఎలా తెచ్చుకున్నాడో అతనికే తెలీదు. ఎలాంటివాడికైనా ఒక్కోసారి బుర్ర అమోఘంగా పనిచేస్తుంది. అతనికీ అలానే పని చేసింది.

"స్టేషన్ మేష్టరికి రిపోర్టు చేస్తాను," అన్నాడు.

తర్వాత మధ్యలో ఎవరో కల్పించుకోవటం, సర్దిచెప్పటం, ఏదో బేరం కుదరటం జరిగింది. ఎలాగో గండం గడిచి బయటపడ్డాడు. రిక్షాలో కూలబడి తను చేసిన పొరబాటుని తల్చుకునేసరికి అతనికి ముచ్చెమటలు పోశాయి. అదీ కథ.



"చిల్లర లేదోయ్! రేపిస్తాలే!"
"అప్పు వేసి ఎవ్వరూ బాగుపడలేదు."

సంజీవరావు గవర్నమెంటు ఆసుపత్రుల్లో జరిగే అవినీతుల్నీ, హద్దూ పద్దూ లేని ప్రవర్తననికూడా ఖండిస్తూవుంటాడు. పల్లెటూళ్ళనుండి వచ్చే ప్రజలకు తమ జబ్బులకి సరాసరి ఏ వార్డుకి పోవాలో తెలీదు. ఒకవార్డుకి పోయి క్యూలో మూడు గంటలు నిలబడి, తీరా డాక్టరుగార్ని సమీపించేసరికి ఆయన చీటీ అటూయిటూ త్రిప్పిచూసి దానిమీద ఏదో యింగ్లీషులో రాసి "యిక్కడ కాదయ్యా," అంటాడు. "మరి ఎక్కడికి పోవాలండీ?" అని అడుగుతాడా పేషెంటు అమాయకంగా. ఈ ప్రశ్నకి సమాధానం రావటానికి మరోగంట పడుతుంది. చివరికి ఏ వార్డుబాయో ఫలానానంబరు వార్డుకి పోవయ్యా అని అదలించేసరికి పుణ్యకాలం కాస్తా గడిచి పోతుంది ఆరోజుకి. మరునాడా కొత్తవార్డుని వెదుక్కుంటూపోయి, తిరిగి క్యూలో నిలబడి డాక్టరిగారి దర్శనం చేసుకున్నాక ఆయన పరీక్షచేసి, 'గొంతు, చెవి, ముక్కులో దోషం ఏమీ కనబడటంలేదు తలనొప్పికి కారణం కంటికి సంబంధించిన వ్యాధి కావచ్చు,' అని అక్కడికి పొమ్మని రిఫర్ చేస్తాడు. ఈ పేషెంటు కాళ్ళీడ్చుకుంటూ కంటిడాక్టరుదగ్గరికి, పోయేసరికి, ఆరోజుకి కాలం గడిచిపోతుంది.

ఇలా రోజులతరబడి వార్డులచుట్టూ నిర్భాగ్యునిలా తిరుగుతూంటాడు ఆ పల్లెటూరి పేషెంటు. ఇహ అక్కడి డాక్టర్ల ప్రయివేటు ప్రాక్టిస్, వార్డులలో చేర్పించటానికి జరిగే తతంగాలూ, చేరాక అక్కడ రోగులకి జరిగే సదుపాయాలూ, ఆ హాస్పటల్‌కి కేటాయించబడిన డబ్బు వినియోగించబడే పద్ధతీ... కర్ణపేయంగా వర్ణిస్తాడు.

"దీనికంతటికీ కారణం మన ప్రభుత్వం బలహీనత," అంటాడు చివర్న తోకలా తగిలించి

"మన ప్రజల్లోకూడా చైతన్యం, ఆత్మపరీక్ష కావాలయ్యా సంజీవరావూ! ప్రతి దానికీ ప్రభుత్వాన్ని ఆడిపోసుకుని లాభంలేదు." అని గొంతు తగ్గించి "మన ఆఫీసరుగారు అప్పుడప్పుడూపడే కడుపుకక్కుర్తికి కారణం మన ఆఫీసరే నంటావా?" ప్రభుత్వ మంటావా? అనేవాడు సోమయాజులుగారు.

"ముమ్మాటికీ ప్రభుత్వమే. ఆలాంటివాళ్ళని పట్టుకుని జైలుకి పంపించక పోవటం ప్రభుత్వం బలహీనత."

"మరి నీలాంటివాడు పూనుకుని రిపోర్టు యిచ్చి, అలాంటివారి పని ఎందుకు పట్టించకూడదూ?"

"కర్మంకాలి రుజూకాకపోతే మొదటికే మోసం వస్తుందనీ..." అని ఎవరో అంటారు

"అలా ఎవరిస్వార్థం, రక్షణా చూచుకుపోవడంతోనే ప్రపంచంకడుపులో పుచ్చు పెరిగిపోతున్నది," అని చివరికి యింకెవరిదో తీర్మానం.

* * * *

సోమయాజులుగారి మస్కిష్కంలో ఒక అద్భుతమైన ఆలోచన ప్రవేశించింది. ఇంతవరకూ తమ సమితి సన్మానాలు చేయడంతోనూ, వక్తలను పిలిచి మాట్లాడించి పూలమాలలు వేయడంతోనూ సరిపోయింది. ఓ చక్కని కళాప్రదర్శన — అనగా నాటకప్రదర్శన ఏర్పాటుచేసి, తమ ప్రతిభను ఎందుకని చాటుకోకూడదూ అని. అనుకోవటమేమిటి–ఆసాయంత్రమే తీర్మానం ప్రవేశపెట్టాడు. వెనువెంటనే సభ్యులంతా ఏకగ్రీవంగా తమ అమోదం తెలియబర్చారు.

దానిమీదట యిహ అభిప్రాయశరంపరలు వెలువడ్డాయి. నాటకం వెయ్యాలా, నాటిక వెయ్యాలా? స్త్రీపాత్రలు వుండాలా అక్కర్లేదా? అదివరకే పాప్యులర్‌గా వున్న నాటకం తీసుకోవాలా, కొత్తనాటకాన్ని చేపట్టాలా?

తనదగ్గర ఆహ్లాదకరమైన యితివృత్తాలున్నాయనీ, సభ్యులు అనుమతిస్తే




వారం రోజుల్లో అమోఘమైన నాటకాన్ని రూపొందించగలనని సోమయాజులు చల్లగా వాక్రుచ్చాడు.

తురంగరావు యీ ప్రతిపాదనకు వెంటనే అభ్యంతరం తెలియపర్చాడు. సోమయాజులుగారు వ్యక్తిగతంగా సహృదయులూ, కొంచెమో గొప్పో కళాభినివేశం వున్నవారూ అయితే కావచ్చుగాని అనేకహంగులూ, మేధస్సూ మేళవించవలసిన నాటకరచనకు ఉపక్రమించటం అలవాటులేని దుస్సాహసమే కాగలదని వక్కాణించి, తన అభిప్రాయం నిర్మొహమాటంగా వ్యక్తం చేసినందుకు ఆయన తనను అపార్థం చేసుకోకూడదని మనవి చేసుకున్నాడు సవినయంగా.

సోమయాజులుగారు అనుభవజ్ఞుడు. సాంబశివుడు గరళాన్ని మ్రింగినట్లు ఆయన అవమానాన్ని దిగమ్రింగి చిరునవ్వు ప్రదర్శిస్తూ "చిన్నవాడైనా సంజీవరావు వున్న మాట సెలవిచ్చాడు. ఏనాటకం చేపట్టినా మన కళాసమితి పేరు ప్రతిష్ఠలకు లోపం రాకూడదని నే ననేది. ఆఁ, అది నా ఆశయం." అన్నాడు.

అయితే పేరుప్రతిష్ఠలు నిలబెట్టే నాటకాన్ని ఎక్కడ వెదకాలి అన్న ప్రశ్న వచ్చింది. "బ్రహ్మాండమైన నాటకం రాశాను. అయిదుసీన్లు వుంటాయి. సెట్టింగు మార్చక్కర్లేదు. ఎక్కడో వెదకడం ఎందుకండీ; మా కోదండపాణి ఉన్నాడు. 'ముళ్ళచక్రం' అని ఒక్కటే స్త్రీపాత్ర," అన్నాడు తురంగరావు.

ప్రస్తుత నాటకరంగ పరిస్థితి ఎలా వున్నదంటే — ఒక జీవితచరిత్ర అంతా

ఒక చేసెట్టుమీద జరగాలి. ఆ జీవితచరిత్రలోకి స్త్రీపాత్ర ప్రవేశించకూడదు అలాటి నాటకాన్ని ప్రదర్శించటానికే ప్రదర్శకులు ఉత్సాహంగా ముందుకు వస్తారు.

"స్త్రీపాత్ర వుంటే కష్టమేనే; చాలాయిబ్బందుల్ని ఎదుర్కోవలసివస్తుంది," అని చప్పరించాడు సోమయాజులు.

"అబ్బే, యిబ్బంది ఏమిటండీ? స్త్రీపాత్ర లేకపోతే నాటకం రక్తికట్టదు. డ్రైగా వుంటుంది."

"వేషం కట్టటానికి ఎవర్ని తీసుకొస్తామయ్యా మహానుభావా?"

"ప్రొఫెషనల్‌ని తీసుకువద్దాం."

"అంతడబ్బు ఎవడు పోస్తాడయ్యా?"

ఆర్థికసమస్యసంగతి నిజమే మరి. అంతా ఏంచేద్దామంటే ఏంచేద్దా మనుకున్నారు. "మాలతిగార్ని నటించమని ప్రాధేయపడదాం," అని ఓ ప్రబుద్ధుడు సలహా యిచ్చాడు.

'మాలతి' అన్న నామధేయం వినబడగానే శేఖరం భుజా లెగరేశాడు. అతని ముఖం విప్పారింది.

కాని క్షణం ఆలోచించి "మాలతి ఒప్పుకుంటుందా?" అన్నాడు అనుమానం వెలిబుచ్చుతూ.

సోమయాజులుకు ఆవేశం వచ్చి కాసేపు కళాకారుడి స్థాయిలో మాట్లాడాడు: "ఎందుకు ఒప్పుకోదయ్యా? ఆమెకూడా మన సమితి సభ్యురాలు. మనం వున్నతాశయాలతో, ఉత్తమలక్ష్య సాధనంకోసం పనిచేస్తున్నాం. కళ అనేదానికి స్త్రీ పురుష భేదంలేదు, ఆవిచక్షణ మనం పాటించకూడదు. ఇలాంటి విచక్షణలు చూపిస్తున్నందువల్లనే ప్రజల్లో మానసిక వికాసాలూ, విలువలూ నశించిపోతున్నాయి. మనమంతా విద్యావంతులం. విజ్ఞానవంతులం. కళారాధన మన పరమార్థం. మనలో మాలిన్యం లేనినాడు మాలతిని ఒప్పించగల శక్తికూడా మనలో వుంటుంది."

ఈ మాటల్లోని నిజానిజాలు ఎలావున్నా, ఆయన అలా మాట్లాడటం మాత్రం అందరికీ నచ్చింది.

మొదట ఆ నాటకం స్క్రిప్ట్ తెప్పించి చదవాలి, తర్వాత మాలతిని అడగాలి అని తీర్మానించారు.

రెండు మూడు రోజుల్లో ఆనాటకంప్రతి తీసుకురావటం చదవటం జరిగింది. అయితే దాని యుక్తాయుక్తాలు నిర్ణయించే విచక్షణాజ్ఞానం అక్కడ ఎవరికి వుంది గనక? వేసేద్దామంటే వేసేద్దామన్న ఉత్సాహంలో వున్నారు. అప్పటికి ఆనాటకం

లోని లోటుపాట్లని కొన్నిటిని ఎత్తి చూపి అభ్యంతరం చెప్పటానికి సోమయాజులు ప్రయత్నించాడు. అయితే ఆ సంరంభంలో ఆయనమాట ఎవరు వినిపించుకుంటారు. బాగుందంటే బాగుందని భుజా లెగరేశారు. ఈసారికూడా తురంగరావే గెలిచాడు.

మరునాడు ఆఫీసులో విరామసమయం. టైప్‌మిషన్ దగ్గర్నుంచి లేవబోతూన్న మాలతి, ఆఫీసులోని ఉద్యోగస్థులందరూ కట్టగట్టుకుని తనదగ్గరకే రావటం చూసి కంగారుపడి, కలవరపాటుని అణచిపెట్టుకుంటూ ఒక చిరునవ్వు నవ్వి "ఏమిటి యివేళ అందరికీ యింత దయకలిగింది నామీద?" అని అడిగింది కోమల స్వరంతో.

"ఈమధ్య మీరు సమితికి రావటం మానేశారు?" అని ప్రశ్నించాడు సోమయాజులు, పునాదిని ప్రారంభిస్తూ.

"ఆడవాళ్ళం చూడండి. అనేక యిబ్బందు లుంటాయి," అంది మాలతి చిరునవ్వు ముఖంతో.

"ఏదీ అందులో ఓ రెండు చెప్పి మాకు శ్రవణానందం కలుగజేయండి," అన్నాడు వైకుంఠరావు అనే గుమాస్తా. ఈ భూమ్మీద హాస్యప్రియుల మనుకునే లక్షోపలక్షలలో ఆ అల్పజీవి ఒకడు.

"రెండేం కర్మ, ఇరవై చెబుతాను. ఇంట్లో వంటా వార్పూ, పూజలూ, పునస్కారాలూ, పెద్దల భయం, ప్రయివేటుగా ఎమ్మేకి కట్టటం, తమ్ముళ్ళూ, చెల్లెళ్లూ వెంటబడుతూంటే వదిలించుకోవటం ..."

"ఇది కాకుండా ఆడవాళ్ళకి సహజంగా ఉండే నీరసం..." అని వైకుంఠం అందుకున్నాడు.

"నీరసం మనజోలికి అట్టే రాదులెండి. రానివ్వను నేను."

"ఆ ప్రకారం మాకంటే మీరే రైటన్నమాట. అవునవును – అబలలకాలం ఏనాడో గతించిపోయిందిగా."

ఈవిధంగా హాసపరిహాసాలు కాసేపు సాగాక సోమయాజులు "చూడమ్మాయి!" అంటూ వ్యవహారంలోకి వచ్చాడు. "ఈనాడు కాలం మారిందని ఒప్పుకుంటావా?"

మాలతి ఒప్పుకుంది.

"ఉద్యోగాల్లో నైతేనేమి, వృత్తుల్లో నైతేనేమి స్త్రీలు ముందంజ వేశారు. స్త్రీలు ఆపరేటర్లుగా పనిచేస్తున్నారు, బస్సు కండక్టర్లుగా పనిచేస్తున్నారు. కళారాధనలో, కళాసాధనలో పైకి వచ్చారు. అలాంటప్పుడు మన సమితి ప్రదర్శిస్తూన్న నాట

కంలో స్త్రీ పాత్ర నువ్వు పోషించటానికి అభ్యంతరం ఏముంది? నీ వంటి కళా స్వరూపిణి ఇలాంటి ఉత్తమకార్యాలకు పూనుకోవాలి."

"నాటకంలో పాత్ర ధరించటమా? అమ్మో!" అని హడలిపోయింది మాలతి.

"అదేమిటమ్మా! నువ్వు అలా కంగారుపడితే ఎలా? నీకు విద్య వుంది, టాలెంట్ వుంది. స్వేచ్ఛ వుంది."

కాని మాలతికి యీ పొగడ్తలు ప్రోత్సాహాన్ని కలిగించలేదు. "మీ కందరికీ ఓ నమస్కారం పెడతాను. నన్ను ఇలాంటి వ్యవహారాల్లోకి దింపబోకండి. నా దారిన నన్ను ఉద్యోగం చేసుకోనివ్వండి," అంది ప్రతిమాలుతూ.

ఆమె ఇలా ప్రతిమాలుతుందని తెలుసు గనక వాళ్ళు అదేమీ పాటించక ఆమెని బలవంతపెట్టారు. వేధించారు. పీడించారు.

"బాబోయి! నాకు అనుభవం లేదండోయి," అని గోలపెట్టింది మాలతి.

"అనుభవ మనేది వేరే ఎక్కడ్నుంచో రాదు. ఒకసారి అడుగు పెడితే అదే ఛంగుమని గంతులువేస్తూ దుముకుతుంది."

"మా ఇంట్లో ఇలాంటివాటికి అంగీకరించరండీ?"

"మేం చెప్తాం. మేం ఒప్పిస్తాం?"

మాలతి పెట్టిన ఘోషలన్నీ వ్యర్థమైపోయినాయి ఆమె తండ్రి హృదయం ఆమెకు తెలుసు. కూతుళ్ళని చూసి మురిసిపోయే ఆ వ్యక్తి, తను చాలా ఆదర్శ పురుషుడిననీ, కుమార్తెల భవిష్యత్తుకోసం సర్వస్వాతంత్ర్యమూ ఇస్తున్నాననీ తలపోసే ఆ మనిషి బయటకు గంభీరంగా కనిపించినా, నాలుగు ముఖప్రీతిమాటలు చెప్పేసరికి కరిగిపోయి, ఒప్పేసుకుంటాడని ఆమెకు తెలుసు.

అంతపని జరిగింది. దేశానికి యువతులు వెన్నెముకవంటివా రని ఆయన కూడా బల్లగుద్ది వాదించి, కూతుర్ని కళాసమితివారి కళాసేవకు అప్పచెప్పారు.

ఇహ పాత్రధారుల నియామకం విషయంలో హోరాహోరిగా యుద్ధాలు చెలరేగాయి. ఆ యుద్ధాల ఫలితంగా కాస్తకాస్త కలతలు చెలరేగినా చివరకు శేఖరం నాయకుడి పాత్రకు నియోగించబడ్డాడు.

శేఖరం స్ఫురద్రూపి, ఒడ్డూ, పొడుగూ వున్నవాడు. ఎర్రగా, బుర్రగా వుంటాడు. మాట్లాడేటప్పుడు హావభావప్రదర్శన చేస్తూ, అవసరాన్నిబట్టి చేతులూపుతూ, భుజా లెగరేస్తూ, భంగిమలు మారుస్తూ ఎదుటివార్ని ఆకర్షించే ప్రయత్నాలు చేస్తూ వుంటాడు. ఉచ్చారణ విషయంలో, పట్టిపట్టి మాట్లాడటంలో చాలా మెలకువగా వుంటాడు. ధైర్యసాహసాలూ, అవసరం వస్తే ఎవర్నయినా తన్నగల సామ




ర్ధ్యమూ వున్నట్లు కనబరుస్తాడు. హీరోవేషం అతను దక్కించుకున్నాడు. మిగతా పాత్రలు అంతా ఎగబడి పంచుకున్నారు. దర్శకత్వం దగ్గర పెద్ద తర్జన భర్జన వచ్చింది. నువ్వా, నేనా అని సోమయాజులూ, తురంగరావూ పోటీ పడ్డారు. చివరకు బలాబలాలు ఎటూ తేలక తురంగరావు దర్శకత్వానికనీ, సోమయాజులు పర్యవేక్షణకనీ భాగించబడ్డారు. వాల్‌పోస్టర్‌మీద తనపేరు అందరికన్న పెద్దసైజులో వేయించుకోవచ్చునని తలిచి తృప్తిపడ్డారు. నాటకప్రదర్శనరోజున నాటక రచయితను యీ వూరు తీసుకొచ్చి సన్మానమో, సన్మానంలాంటిదో చేయాలని తురంగరావు ప్రతిపాదించాడు. ఐతే అది వీగిపోయింది. అతను ముఖం చిన్నబుచ్చుకున్నా, చేసేదిలేక మరో సందర్భం చూసుకోవచ్చునని తనని తాను సముదాయించుకున్నాడు.

"మరి మృత్యుంజయరావు విషయమో?" అన్నాడు సోమయాజులు.

అతనిగుండె గబగబ కొట్టుకుంది. ముఖం నల్లబడి మరీ అధ్వాన్నంగా తయారయింది. ఇలాంటి సూచన రాకూడదనే అతడు భగవంతుడ్ని ధ్యానిస్తున్నాడు.

ఇప్పు డేంచెయ్యాలి? మెల్లిగా అక్కడ్నుంచి జారిపోదా మనుకున్నాడు గుట్టు చప్పుడు కాకుండా. కాని కాళ్ళు వణుకుతాయి, ముఖాన పోసే చెమట పట్టిం చేస్తుంది.

అందుకని పరధ్యానంగా వున్నట్లు ముఖం ప్రక్కకి త్రిప్పి శూన్యంలోకి చూడసాగాడు.

ఈ ప్రతిపాదనకు అందరూ ఎందుకింత నిశ్శబ్దంగా వున్నారు? వారిలో వారు నవ్వుకుంటున్నారా? ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుని సైగలు చేసుకుంటున్నారా? తను తేలిపోకూడదు. తన కేమీ వినబడనట్లుగా నటించాలి.

కాసేపటికి...

"పోర్షన్లు అన్నీ నిండిపోయాయే." ఓ కంఠం వెలిబుచ్చింది.

"అయితే ఏం? మృత్యుంజయరావు నిర్వహించవలసిన బాధ్యత చాలావుంది;" మరోగొంతు.

"ఏమిటి?"

"ప్రాంప్టర్ పనికి ఎవరూ నియామకం కాలేదుగా."

"అవునవును. అసలు మరిచేపోయాం ఎంతముఖ్యం? ఎంతముఖ్యం? అసలు నాటకం సక్సెస్ అంతా మృత్యుంజయరావుమీదే ఆధారపడివుంది," అని అందరూ అల్లాంటి బాధ్యత అతను స్వీకరిస్తున్నందుకు అభినందించారు. మెచ్చుకున్నారు పొగిడారు.

మృత్యుంజయరావు ప్రాంప్టర్‌గా నియమితు డయాడు.

అదిమొదలు రోజూ రిహార్సల్సు జరగటం మొదలుపెట్టాయి. ఆఫీసు అయిపోయిన తర్వాత సాయంత్రం అయిదుగంటలవేళ ఆరంభమయేవి. విజ్ఞాన కళా సమితి కార్యాలయపు వాతావరణం వివిధసభ్యుల మనస్సులతాలూకు చిత్ర విచిత్రపు ఆలోచనలతో నిండిపోయి ఉక్కిరిబిక్కిరవుతోంది. రిహార్సల్సు తొమ్మిదిగంటలదాకా సాగేవి. ఈలోగా కాఫీలు, టిఫిన్లు, సిగిరెట్లు దండిగా అమరుతూవుండేవి. రాత్రి తొమ్మిది గంటలవేళ మాలతి వంటరిగా అరమైలు దూరంలోవున్న యింటికి వెళ్ళవలసివచ్చేది. ఎవరినన్నా సాయం పంపిస్తానని సోమయాజులు బలవంతం చేశాడు. మొదట్లో మాలతి నిరాకరించింది గాని, నాలుగయిదు రోజులు గడిచాక వంటరిగా పోవటానికి భయంగావుందని చెప్పి ఎవర్నయినా తోడుపంపమని అర్థించింది. ఈ అర్థింపు వినగానే కళాసమితి వాతావరణం మరోసారి విద్యుత్ప్రసార వేగంతో వివిధ ఉపాయాలతో నిండిపోయింది. సోమయాజులు మొదట తానే వెడదా మనుకున్నాడు గాని, తాను పెద్దవాడు కాబట్టి తేలిపోకూడదని బింకం ప్రదర్శించాడు. అయితే ఇటువంటి రిస్క్‌తో కూడినటువంటి బాధ్యతను యితరులమీద వొదిలిపెట్టటం అతనికి సుతరాంమూ యిష్టంలేదు. అమ్మో! ఈ కుర్రవాళ్ళు అసాధ్యులు, వ్యవహారం ఎంతవరకైనా నడిపింపగల సమర్థులు. కొంతమందికి పెళ్ళయింది అనుకో. అయినా పెళ్ళయినవాళ్ళనుకూడా నమ్మటానికి వీల్లేదు.

ఆమాటకొస్తే యీ విషయంలో బ్రహ్మచారులే కాస్తనయం. ఎందుకంటే పెళ్ళయినవాడికి ఆడదంటే అసలు బెరుకు పోతుంది. స్త్రీయొక్క ఆంతర్యం, మనస్తత్వం చాలావరకూ అర్థం చేసుకుంటాడు. అదీగాక వివాహితుడు అనేముద్ర వున్నవాడు కాబట్టి చాలా తేలికగా ఎటువంటి చొరవ తీసుకోవటానికి కూడా వెనుదియ్యడు. బ్రహ్మచారి అలాకాదు. ఆ అమ్మాయికి తనంటే మంచి యింప్రెషన్ కలగాలని తనకి ఉన్నతాశయాలున్నట్లూ. తను చాలా మృదువైన మనిషినన్నట్లూ ప్రవర్తిస్తాడు. స్త్రీగురించి చాలా ఉన్నతంగా ఊహిస్తూ ఆరాధిస్తూవుంటాడు. అందుకని యీ పనికి మృత్యుంజయరావుని నియోగించటం శ్రేయస్కరమని ఆయనకు తట్టింది. ఇంకేం? మన మృత్యుంజయరావు వున్నాడుగా. అతని కేం బాదరబందీలులేవు. అక్కడ్నుంచి అతనింటికి దగ్గరతోవ వుందికూడానూ," అనేశాడు — తన యీమాటల వెనక అంతతతంగం వున్నట్లు కనిపించనీయకుండా, అప్పటికప్పుడు తనకా ఆలోచన వచ్చినట్లు స్ఫురింపజేస్తూ.

ఈ మాటలకి మిగతావా రంతా ముఖాలు ముడుచుకున్నారు. ఏ విధంగా అభ్యంతరం చెబుదామా అని ఉపాయాలు పన్నుతున్నారు. కాని ఇంతలో మాలతే జోక్యం కలిగించుకుని "అవునవును.

మృత్యుంజయరావుగారు ఉన్నారుగా," అని ఉత్సాహం కనపర్చటంతో వారి నోరులు తెరవటానికి వీలులేకపోయింది.

నాటకం రిహార్సల్సులో ఎవరిమట్టుకు వారు తమ ఆధిక్యత ప్రదర్శించటానికి ప్రయత్నించటంలో చాలా కాలయాపన జరుగుతూఉండేది. తురంగరావు దర్శకత్వం కొట్టేశానని సంబరపడ్డాడు గాని అతనికి ఎలా దర్శకత్వం చెయ్యాలో తెలియటల్లేదు నటన అనేదాన్ని గురించి తన కేమీ తెలియదని అతనికి కరాఖండిగా తెలిసివచ్చింది. మిగతా యాక్టర్లు అతన్ని అడిగేవారు కాదు గాని మాలతి మాత్రం అతన్ని తరుచు ప్రశ్నిస్తూఉండేది. 'తురంగరావుగారూ! మొట్టమొదట సెట్‌లోకి వచ్చినప్పుడు ఎలా నడుస్తూ రావాలి...? ఈ డైలాగు ఎలా చెప్పాలి...? ఇక్కడ స్క్రిప్టులో నవ్వాలి అని ఉంది. ఏ విధంగా నవ్వమంటారు...? అది ఏమిటో సంభాషణ అర్థంకావటం లేదు. కాస్త విపులీకరించి చెప్పండి...ఈ సీను అభినయిస్తూ వున్నప్పుడు ముఖం ఏ విధంగా పెట్టాలి?" ఇలాగ ఎన్నో ప్రశ్నలు. ఒకసారి 'తురంగరావుగారూ!' అని మరోసారి 'డైరెక్టరుగారూ!' అని సంబోధించేది. ఏదో మాలతి తమ అందరి బలవంతంమీదా నాటకంలో వెయ్యటానికి అంగీకరించిందని అనుకున్నారు. ఆమె ఇంత నిజాయితీగా, సిన్సియర్‌గా బాధ్యత తీసుకుంటూందని తెలియగానే తురంగరావు గాభరా పడ్డాడు. అతనికి ఎంత చిన్న విషయాన్నైనా సరే - నిజాయితీగా తీసుకునేవాళ్ళంటే భయం. వాళ్ళముందు నిలబడితే దడుపుగా ఉంటుంది. అయితే విగ్రహపుష్టి వున్నవాడు కాబట్టి గాంభీర్యం సడలకుండా, గుట్టు రట్టు చేసుకోకుండా అప్పటికప్పుడు ఏదో తోసకు వచ్చినట్లు చూపించటం, లేకపోతే ఆమె చేసిందే అలా కాదు ఇలా అని తిరిగి అదే చేసి చూపిస్తూ, రసభంగం కాకుండా కాపాడుకొస్తున్నాడు. సోమయాజులు అతన్లోని యీ బలహీనత గ్రహించి తను విజృంభింపసాగాడు. "ఇదిగో చూశావా అమ్మాయి! ఈ డైలాగు అలా కదలకుండా మెదలకుండా నిల్చుని చెబితే విట్టు పేలదు. దానికి తగిన మూవ్‌మెంట్సు...ఇదిగో ఇలా...అలా (చేసి చూపించాడు— నటులంతా నవ్వుతున్నారు) ఇవ్వాలి ఇదిగోనోయ్ శేఖరం! నువ్వు అక్కడ నిల్చుని ఉపన్యాసం ఇస్తే లాభంలేదు. స్టేజిమధ్యకు నడుచుకుంటూ వచ్చి అక్కడ బరస్టు అవాలి. కమాన్ స్టార్ట్."

ఇలా దడదడ లాడించేసేవాడు సోమయాజులు. మాలతి చిరునవ్వును దాచుకుంటూ అతనుచెప్పినట్లే చేయటానికి ప్రయత్నించేది. ఎప్పుడైనా సోమయాజులు

లేని సమయం కనిపెట్టి తురంగరావు, "ముసలాడు చాదస్తంతో చంపుతున్నాడు. ఎందుకులే బాధపడతాడని వూరుకుంటున్నాగానీ లేకపోతే... ?" అనేవాడు.

మాలతి యీ విషయాలన్నీ మృత్యుంజయరావుతో కలసి రాత్రుళ్ళు నడుస్తూ యింటికి వెడుతున్నప్పుడు ముచ్చటించి ఫకాల్న నవ్వుతూవుండేది.

ఆమె చాలా నిశితబుద్ధిఅని గ్రహించాడు మృత్యుంజయరావు. "మీరు ప్రాంప్టింగ్ ఎందుకు తీసుకున్నారు ? ఓ కేరెక్టర్ ఎందుకు తీసుకోలేదు ?" అని ప్రశ్నించింది హఠాత్తుగా మాలతి ఒకరోజు.

మృత్యుంజయరావు తడబిడపడ్డాడు. ఏం చెబుతాడు సమాధానం ? 'నేను అందంగా వుండను కాబట్టి' అంటాడా ?

'నేను అసహ్యంగా వుంటాను కాబట్టి' అంటాడా ? లేకపోతే.

కాదు, కాదు, తనగురించి తను ఏమనుకుంటున్నాడో అసలు లోకానికి తెలియకూడదు. తెలిస్తే తను భరించలేడు.

"నాకు నటించటంరాదని వాళ్ళు అంటారు." అన్నాడు నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"అక్కడ ఒకళ్ళకి తెలుసునా ఏమిటి నటనగురించి ?" అంది ఎగతాళిగా మాలతి. అని మృదువుగా నవ్వింది.

"మీరు అంత తొందరగా వేషం వేయటానికి ఒప్పుకుంటారని అనుకోలేదు," అన్నాడు భయంభయంగా.

"ఒప్పుకుందామని నేనూ అనుకోలేదు. కాలేజిలో చదివే రోజుల్లో చాలా చేసే దాన్ని; నాటకాల్లో పాత్రలు ధరించేదాన్ని; భరతనాట్యా లిచ్చేదాన్ని; సంగీతపు పోటీలలో పాల్గొనేదాన్ని. ఉద్యోగంలో చేరాను. ఇహ అన్నింటికీ స్వస్తి అనుకున్నాను. మా నాన్నగారి బలవంతంవల్ల అంగీకరించాల్సివచ్చింది," అంది మాలతి.

"మీ నాన్నగారు ఆదర్శపురుషు లనుకుంటాను."

"అంత పెద్దమాటలు వాడకండి," అంది వారిస్తున్నట్లుగా ఆమె. 'కూతుళ్ళని యిలాంటి వ్యవహారాల్లో ప్రోత్సహించటాన్ని అదర్శం అనుకోను నేను. పైత్యమంటాను. మీరన్న ఆదర్శపురుషు లున్న కుటుంబాలు లోకంలో అనేకుల అవసరాలు తీర్చటానికి పనికివస్తూవుంటాయి. మానాన్న నేను వేషం వెయ్యటానికి అంగీకరించా డనుకోండి. అభ్యుదయవాది అని పొగుడ్తారు మొహంయెదుట. చాటుకు వెళ్ళి వెర్రివెధవ అని బిరుదుయిస్తారు. మానాన్న ఆదర్శవాదో, అవివేకో, పైత్యపు మనిషో ముందుముందుగాని యింకా స్పష్టంగా తెలుసుకోలేను."

మృత్యుంజయరావు యీ సంభాషణకు బెదిరి యిహ ఆ సంభాషణకి స్వస్తిచెప్పి వూరుకున్నాడు.

వెన్నెలరాత్రుళ్ళు ఒక నవనాగరీకమైన యువతితో, నిండుయవ్వనంతో వున్న ఓ సుందరాంగితో జనసమ్మర్ధమైన వీధుల్లో, నిర్మానుష్యమైన వీధుల్లో నడిచి పోవటం అతనికి ఉల్లాసాన్ని కలుగజేసేది. నిండు యవ్వనంలో వున్న సుందరాంగి... ఈ ఆలోచన తనకే వచ్చిందా? అతనికి ఆనందం కలిగింది. ధైర్యంచేసి ఆమెకి తెలియకుండా చాలాసార్లు పరీక్షగా చూసేవాడు. దీపాల్లాంటి కళ్ళు ... నవ్వులో, పలువరసలో, నవ్వినప్పుడు కనిపించే లేత చిగుళ్ళలో, నొక్కునొక్కుల జుత్తులో, స్ఫటికంలాంటి నున్నని చెంపల్లో, నీలివారలు గీతగీసినట్లుండే కంఠంలో. మెడప్రక్కల కావాలన్నట్లు కొంచెం వొంగి, విల్లులా అమరిన లేభుజములలో, సుకుమారమైన వక్షస్థలంలో, కోమల హస్తాలలో, చేతివేళ్ళలో, తెల్లగా మెరిసే పాదాలలో, అడుగుతీసి అడుగు వేయటంలో అతనికి అందం కనిపించింది, ఆనందం కనిపించింది, యవ్వనం కనిపించింది.

ఆమె ప్రక్కన తను ...... అతను భయకంపితు డయ్యాడు.

ఆమెది నాసిక. అంత అందమైన అవయవాన్ని ముక్కు అనే బండపేరుతో పిలవకూడదు, తనది ముక్కు.

అహ ! ఆలోచించకూడదు. ఈ సామరస్యం తీసుకురాకూడదు.

మనసుని అరికట్టటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని అటే ... అటే ... ఆ పోలికలోకే తీసుకుపోతున్నది కోతిబుద్ధి.

ఆమెవి అధరాలు, తనవి పెదాలు.

ఆమెది ముఖము, తనది మొహం.

ఆమెది శరీరము, తనది చర్మము.

ఆమెవి ముంగురులు, తనవి వెంట్రుకలు.

ఆమె ప్రక్కన తను... ఈ ఉల్లాసంలో ప్రతి రెండుక్షణాలకూ మధ్య ఓ త్రుటి కాలం శిక్షగా తయారయి. అదిగో వాడు చూస్తున్నాడు; వాడి చూపులు వికృతంగా వున్నాయి. వాడింకా చూస్తున్నాడేమో తలత్రిప్పి చూద్దామా? చూశాడు. అదిగో వాడింకా చూస్తూనే వున్నాడు. ప్రక్కవాడితో ఏమిటో చెబుతున్నాడు. అతను ఏమి చెబుతున్నాడో! ఇదిగో వీడెవడో నవ్వుతున్నాడు. నవ్వితే ఫర్వాలేదుగాని, మాలతి గమనిస్తే ఎంత అవహేళనగా వుంటుంది!

అందుకని ఓ పద్ధతి ఆలోచించాడు మృత్యుంజయరావు. అలాంటి వికృత

సందర్భాలు ఎదురైనప్పుడు ఆమెదృష్టిని మరోదిక్కుకు మళ్ళించటానికి ప్రయత్నము చేశాడు. కాని దృష్టి మరల్చటానికి ఎప్పుడూ సాకు లేం దొరుకుతాయి?

"అదిగో ఆ కుక్క చూశారా?" అన్నాడు ఓసారి.

"ఏముం దా కుక్కలో?" అన్నది మాలతి విస్మయంగా.

"అది ఏజాతి కుక్కంటారు?" అన్నాడు సభాషణ పొడిగించాలిగనుక.

"బలేవారే. అది వొట్టి ఊరకుక్కండీ మహానుభావా?"

"అంతేనంటారా? చీకట్లో జాతికుక్కే మోనని పొరబడ్డాను సుమండీ!"

ఒకవేళ అప్పటికీ అవతలివాళ్ళు యింకా పరిహాసదృష్టితో చూస్తూ, వారిని మాలతి గమనించే ప్రమాద మున్నదని అనిపిస్తే-

"మీకు కుక్కల్ని పెంచటమంటే సరదాయేనా?" అని అడిగేవాడు.

"అబ్బో చాలా యిష్టం. ఇదివరకు మోతీ అని ఓ కుక్కపిల్లను పెంచాం. ఎంత ముద్దొచ్చే దనుకున్నారు?"

"సాధారణంగా అందరూ కుక్కపిల్లకు మోతీ, జాకి, జిమ్మీ యీ పేర్లే పెడతారు. చిత్రంగా వుంటుంది. ఏం?"

మాలతి తల ఊపుతుంది

అదిగో ఆ అమ్మాయెవరో తనని చూసి పకపక నవ్వుతోంది. "అయితేనూ ఆ మోతీ యిప్పుడు పెద్దదై వుంటుంది. ఏమంటారు?" అన్నాడు గబగబా.

"లేదండీ, చచ్చిపోయింది. అవునుగాని ఆ అమ్మాయి..."

"అరెరే చచ్చిపోయిందా? ఎలా చచ్చిపోయింది?"

"దాన్నెవో పిచ్చికుక్క కరిచిందిలెండి. దీనిక్కూడా పిచ్చి ఎక్కింది. ఆ పిచ్చిలో నన్నుకూడా కరిచింది. విరుగుడుకని పధ్నాలుగు యింజక్షన్లు చేయించుకున్నాను... ఏం చూసుకుని దాని కా మిడిసిపాటు? ఎందు కలా నవ్వు...?"

"అబ్బా! పధ్నాలుగు యింజక్షన్లే, మీకు బాగా నెప్పిచేసి వుండాలి!"

"డర్టీక్రూక్, అడిగేస్తాను నిలేసి. ఏం కనిపించింది అంతనవ్వు రావటానికి," అంది మాలతి యిహ వినిపించుకోకుండా కోపంతో ఎర్రబడ్డ ముఖంతో.

అతను భయపడిపోయాడు; మాలతి ఆ అమ్మాయిని పట్టుకు ఎక్కడ దులిపేస్తుందోనని. అప్పుడు అసలువిషయం బయటపడిపోతుంది. బండారం బట్టబయలయిపోతుంది.

"బలేవారేనండీ మాలతిగారూ! చంపేశారు. అసలు సంగతి మీరు చూశ్శేదు. నేను గమనించాగా. మనవెనుక ఒకాయన అరటిపండు తొక్క తొక్కి జారిపడ

బోయి, సంబాళించుకున్నాడు. అది చూసి నవ్వుతు ... ...
మరేంలేదు. హహ్హాహ్హా, బలే సందేహం వచ్చిందే మీకు."

ఆమె అతనివంక ఓసారి విస్తుపోయి చూసింది, మరేం మాట్లాడలేదు:

ఆమెతో కలిసి నడిచిపోతూన్నప్పుడు అతనికి తరుచు యింకో విషయం స్ఫురిస్తూ వుండేది. ఎంతసేపూ తను సంభాషణని పొడిగా, రసహీనంగా వున్న విషయాలపై కొనసాగిస్తున్నాడుగాని — యిదే శేఖరమైతే ఏం చేసివుండేవాడు? తన వాక్చాతుర్యాన్ని గుప్పురించేవాడు. ఆమెని నవ్వించేవాడు, కవ్వించేవాడు. బుజానికి బుజం ఆనించేవాడు. ఆమె శిగలోని మల్లెల సౌరభ్యాన్ని ఆఘ్రాణించేవాడు.

పోనీ తనుకూడా శేఖరంలా చెయ్యటానికి 'ట్రై' చేద్దామా ఏమిటి? అతనీ ఆలోచనలో వుండగానే ఆమె అత్రుతగా "అదిగో చూడండి చూడండి," అని యించుమించు కేక పెట్టినంతపని చేసింది.

---

"ఏమిటి ?" అన్నా డతను ఈ లోకంలోకి వచ్చిపడి.

"అక్కడ కిల్లీదుకాణం దగ్గర నిలబడి కోరచూపులు చూడటం లేదూ ? వాడే. మొదటిరోజుల్లో రిహార్సల్సునుండి వంటరిగా వస్తూంటే ఏదో తుంటరి వాగుడు వాగాడు మొహం వాచేటట్లు చివాట్లు పెట్టాను. అప్పటికి దబాయించేశాను కానీ, కారుపెధవ ఏం అఘాయిత్యం చేస్తాడోనని తర్వాత భయం వేసింది చెప్పొద్దూ ! అందుకే సాయం కోరాను," అని విశదం చేసింది మాలతి.

మృత్యుంజయరావు అతని వంక పరిశీలనగా చూశాడు. నేరో ప్యాంటూ, హవాయి షర్టూ వేసుకుని, పొట్టి క్రాపింగ్‌ని ముందు ఓ కెరటంలా లేచేలా దువ్వి, ఎత్తుగా, బలిష్ఠంగా పెరిగిన ఆ వ్యక్తి సిగరెట్టు కాలుస్తూ తమవంక కోరచూపులు చూస్తూ కనబడ్డాడు. అతని చూపు తన చూపుతో కలవగానే మృత్యుంజయరావు వళ్ళు ఒక్కసారి ఝల్లుమన్నట్లయింది. తనా ? తను వయసులో ఉన్న ఒక స్త్రీకి సాయంవచ్చే మొగాడా ? ఇప్పు డా రౌడీ మాలతిని ఏడిపిస్తే తను ఏం చేస్తాడు ? ఏడిపించటమే కాదు జడ పుచ్చుకుని లాగాడనుకో. అప్పు డేం చేస్తాడు. జడే కాదు, చెయ్యే పుచ్చుకుని బరబర యీడ్చుకుపోయినా తను ఏం చెయ్యగలడు ? తిడతాడా ? తిట్టటానికి తగినన్ని పదా లేవీ తనదగ్గిర ? ఉన్నా ఆ సమయంలో స్ఫురిస్తాయా? పోనీ కలబడతాడా ? కలబడటానికి అటువంటి సందర్భంలో తనకి భయమేగాని ఆవేశం కలుగుతుందంటావా ? ఒకవేళ సాహసించి కలబడినా, అతన్ని తన్ని, చితగ్గొట్టి, అతని బారినుండి మాలతిని రక్షించగలడా ? ఆ రౌడీ, ఆ దృఢకాయుడు తనని ఒక్క తన్ను తంతే...

కాని బయటికి "అలాగా ?" అన్నాడు. "నాలుగు తంతేసరి" అన్నాడు మహా సాహసంగా. అతని మాటలు అతనికే అబ్బురాన్ని కలిగించాయి.

"ఏమిటి ? మీరు ? మీరు తంతారా ?" మాలతి గట్టిగా నవ్వుతోంది.

అతనికి వళ్ళంతా జర్రెలు పాకినట్లయింది. 'ఇదేం కర్మ ? డబ్బాలు కొట్టటం కూడా తనకి యిమడదా ఏమిటి ?'

"అదేమి టలా అంటున్నారు ?" అన్నాడు చిన్నబుచ్చుకుని.

"సారీ! అదికాదండీ... మీకు తన్నులాటలు యిష్టంలేదేమోననుకున్నాను," అంది మాలతి నవ్వుకుని.

"ఇష్టం లేదనుకోండి. అయినా అవసరం వచ్చినప్పుడు కొన్ని కొన్ని తప్పించుకోలేముగా," అన్నాడు, ఆమె నమ్మదని తెలిసినా, తను నిజాయితీగానే చెబుతున్నట్లు కనబడాలి గనక.

ఇంకో విశేషం. ఇలాంటి సంభాషణలు, సంక్షోభంతో కూడిన సంఘటనలూ అతని హృదయక్షేత్రంలో ఎంత దృఢంగా ముద్రవేసుకుపోతాయంటే - అవి బహుశా అతని జీవితకాలంలో ఎప్పటికీ చెరిగిపోవు. కాని తను వాటిని తలచుకుని బాధపడుతున్నట్లు ఏమాత్రం కనబడడు. అసలు గుర్తు లేనట్లే ప్రవర్తిస్తాడు.

అప్పుడప్పుడు అతడు ఆమెతో వారి యింటికి పోవటమూ తటస్థించింది. మాలతి తండ్రి పశుపతి, మొదట్లో ఆయన్ని చూస్తే మృత్యుంజయరావుకి భయంగా వుండేది. తన రాకను అర్ధంగానీ, అపార్ధంగానీ చేసుకుంటాడేమోనని. ఆయన అలాంటివేమీ చేయకపోగా నాటకాల గురించీ, సాహిత్యాన్ని గురించీ, రాజకీయాల గురించీ ఉత్సాహంతోనూ, విసుగులేకుండానూ మాట్లాడటం అతనికి ధైర్యాన్ని కలిగించింది ప్రపంచంలో ఏవిషయాన్ని గురించయినాసరే ప్రసంగం రానివ్వండి, అది ఆయన తన పరిధిలోకి తీసుకుని స్వంత అనుభవాన్నొకటి జోడించి విడిచిపెట్టే వారు. తను చిన్నప్పుడు నటించేవాడట. ఎక్కువగా ఆడవేషాలు వేసేవాడట. కొన్ని కొన్ని చిన్న చిన్న విషయాలపట్ల మనుషులు అంత లోతుగా, నిజాయితీగా ఆలోచించటం అతనికి విస్మయాన్ని కలిగించేది. ఒకసారి ఒక నాటకంలో నటిస్తున్నాడట. "ఈ సంభాషణ యిట్లా చెబితే జనం మెచ్చరు," అన్నాడుట దర్శకుడు. "కాదు. ఇలాగే చెప్పి జనాన్ని మెప్పిస్తాను చూడు" అన్నాడు యీాయన. ఇద్దరికీ వాగ్వివాదం జరిగింది. కొన్నాళ్ళపాటు మాట్లాడుకోవటం మానేశారు. తర్వాత నాటకప్రదర్శన జరిగింది. పశుపతిగారు తను అనుకున్న ఫక్కీలోనే ఆసంభాషణ చెప్పాడు. ప్రేక్షకులు చేసిన సంతోషధ్వనులతో హాలు దద్దరిల్లి పోయింది. తర్వాత దర్శకుడు వచ్చి ఆనందభాష్పాలు కారుస్తూ ఈయన్ని కావిలించు కున్నాడట. ఆయన తరుచు 'అభిప్రాయభేధం' అనే పదం ఉపయోగిస్తూ వుండే వాడు. "ఆ సందర్భంలో అతనికీ నాకూ అభిప్రాయభేధం వచ్చింది," అంటూండే వాడు ఎవరెవరి గురించో తన పరిచయాలు ప్రస్తావిస్తూ.

ఆయనకూ తనకూ ఎప్పుడైనా అభిప్రాయభేధం వస్తుందేమోనని అప్పు డప్పుడూ మృత్యుంజయరావు హడిలిపోయేవాడు, కాని మళ్ళీ యింతలోనే సర్దు కునేవాడు. ఆఁ, తన కసలు అభిప్రాయలే లేవు, ఇహ భేదాలు ఎలావస్తాయి?

(సశేషం)

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns at Yuva Press, Hyderabad-1. Telephones, 36336, Press 34400.
Controlling Editor : Sri "CHAKRAPANI"

# సైకిలు జీవితాంతం ఉపయోగపడుతుంది హెర్క్యులిస్ మీ సొత్తుకు మంచి విలువైనది

విశిష్టమైన రకము, మితమైన వెలతో హెర్క్యులిస్ బైసికిళ్ళలో ఆదర్శమైనది. ఎంతమాత్రము ఆశ్చర్యము లేదు. ప్రపంచమంతటా 135 దేశాలలో ఎక్కువగా అందరూ వాడేదే ఇది. సౌత్ ఈస్ట్ ఏషియాలో మద్రాసు నందు మంచి సాధన సదుపాయాలు కలిగిన పెద్ద సైకిల్ ఫ్యాక్టరీలో అంతర్జాతీయపు అర్హతలకు అనుగుణ్యంగా తయారుచేయబడింది. హెర్క్యులిస్ ప్రపంచంలో పెద్ద సైకిళ్ళ ఉత్పత్తిదారులైన ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ లిమిటెడ్, యు.కె. వారి సౌజన్యంతో ఖచ్చితముగా నిర్మింపబడినది

## ® హెర్క్యులిస్-

ఒక్క సైకిలే కాదు జీవితకాలపు నేస్తము





**ఇప్పుడు హెర్క్యులిస్ కొన్నాడు**

"హెర్క్యులిస్ కొనడానికి కష్టపడి కూడ బెట్టాను. ఆ 'హ' ఎంత మంచి పెట్టుబడి! ఎప్పుడూ ఇంట్లో నమ్మకమైన భాగస్వామి



వెల, విశిష్టత బలిష్టత, మన్నిక అందము-అన్నిటిలోను హెర్క్యులిస్ సొమ్ముకు మంచి విలువైనది.

® ది హెర్క్యులిస్ సైకిల్ మరియు మోటర్ కంపెనీ లిమిటెడ్ యు.కె. వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కులు. ఇండియాలో తయారీ. టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు, మద్రాసు-53 ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు-1. ఉపయోగించుటకు రిజిష్టరు కావింపబడిరి. చిన్న మొత్తముల సేకరణలలో ఆదా చేయండి

TIC/H/5822 A